



# వారెవ్వా!

## జుట్టు చూడు..
## జుట్టు అందం చూడు!

జుట్టున్న అమ్మలూ.. అయ్యలూ..
ఏ కొప్పైనా కట్టొచ్చు...
ఎన్ని ముడులైనా పెట్టొచ్చు!
తలనీలాలతో ఎన్నెన్ని ఆకృతులో..
ఎన్నెన్ని హొయలో మరి!
ఈ కేశాలంకరణలను మాటల్లో
వర్ణించగలమా?!







# భామనే.. సత్యభామనే..!



★ సినిమాల్లో అవకాశాలు తగ్గిన కథానాయికలు బుల్లితెర వైపు తొంగి చూడ్డం పరిపాటే.. అయితే ఈ అమ్మడు బుల్లితెరలో ఓ వెలుగు వెలిగి ఆ తర్వాత బాలీవుడ్‌లోకి ఎంట్రీ ఇచ్చింది.. అక్కడా ప్రశంసల జల్లులే పలకరించాయామెను..! ఇంతకీ ఎవరా భామ.. ఆమె సొగసు రహస్యాలేంటి..?

★ జుట్టు రాలుతోందా..
తేలికైన చిట్కా..!

★ గంటల తరబడి చదవడం విసుగ్గా ఉందా.. మరి చదివి వినిపిస్తే..!?

చలో పేజీ నెం. 122.

– సంపాదకులు

# మనసున ఉన్నదీ...

★ చతుర జూన్ సంచికలో ఇందిరా సౌందర రాజన్ తమిళ నవల 'నాగేశ్వరపురం 4 కి.మీ' చివరివరకూ ఉత్కంఠ భరితంగా సాగింది. అనువాదం సాఫీగా ఉంది. 'నేను అమ్మని' పెద్దకథ, నవలావలోకనంలో కావిలి పాటి విజయలక్ష్మి 'విధివిన్యాసాలు' సమీక్ష ఆసక్తికరంగా ఉన్నాయి. చమత్'కారం'లో నక్షత్ర మహత్యం మన పూర్వకవుల గమ్మత్త యిన కవిత్వానికి అద్దం పట్టింది.

**– డి. శ్రీనివాస దీక్షితులు,** నరసరావుపేట

★ 'నాగేశ్వరపురం 4 కి.మీ.' ఎంతో ఉత్కం ఠభరితంగా ఉంది. పాముల గురించి సైంటిఫి క్‌గా, పురాణాలపరంగా ఎన్నో విషయాలు తెలి యపరిచారు. పెద్దకథ 'నేను అమ్మని' అమ్మ ప్రత్యేకతను చాటింది. చతుర ప్ర.జ.లో ఎన్నో విషయాలు తెలుసుకుంటున్నాం.. నవలావలోక నంలో 'విధివిన్యాసాలు' మధ్యతరగతి జీవితా నికి అద్దం పట్టింది. 'అమ్మకు అన్నీ తెలుసు' చదువుకుని కడుపుబ్బా నవ్వుకున్నాం. ఆలూపా లక్ పరోటా నోరూరించింది.

**– యస్. జమిలాబేగం,** కర్నూలు

★ తమిళ అనువాద నవల 'నాగేశ్వరపురం 4 కి.మీ.' ఆసక్తిగా చదివించింది. యండపల్లి పాండురంగ మూలరచయిత హృదయాన్ని బాగా ఆకళించుకుని, చక్కని నుడికారంలో కథా కథనం సాగించారు.

**– యు. రాఘవేంద్రరావు,**
సైదాబాద్, హైదరాబాద్

★ 'నాగేశ్వరపురం 4 కి.మీ.' పాముల ఇతి వృత్తంగా సాగింది. ఏ జీవికైనా ప్రాణభయం సహజం. తనపై దాడి జరుగుతుందని తెలిస్తే ఆత్మరక్షణకు ఎదురు దాడి చేస్తాయి. పాములు కూడా అంతే. ప్రొఫెసర్ శారదాదేవి పాముల వెనక ఉన్న అసలు రహస్యాన్ని కనుగొని ఆ గ్రామ ప్రజల భయాన్నీ, మూఢన మ్మకాన్నీ పోగొడుతుంది. నవల కథ, కథనం బాగున్నాయి.

**– ధఫ్ఫూరి శ్రీధరాచార్యులు,** సీతారాం
బాగ్, హైదరాబాద్

★ 'నాగేశ్వరపురం 4 కి.మీ.' నవల ఆద్యం తం ఆత్రుతగా చదివించింది. రచనాశైలి, ప్రతి సంఘటనలో తనదైన ముద్రను వేయగలిగారు రచయిత. శారదాదేవి అటు ఆధునికత, ఇటు ఆధ్యాత్మికత మూర్తీభవించిన అద్భుత పాత్ర. మిగిలిన పాత్రలూ వేటికవే సాటిగా ఉన్నాయి. రచయితకు, అనువాదకునికి అభినందనలు.

**– కె. లహరి,**
చెల్పూర్, వరంగల్ జిల్లా

★ 'చతుర'లో చతురంగం తక్కిన శీర్షికలు ఆకట్టుకుంటున్నాయి. 'నాగేశ్వరపురం 4 కి.మీ.' నవల చక్కని సామాజిక స్పృహ కలిగిన నవల. మూఢనమ్మకాలు, భక్తి ముసుగులో కొందరు సాగించే అకృత్యాలను కథానాయకుడు తిప్పి కొట్టిన తీరు బాగుంది. 'చతుర ప్ర.జ.' ద్వారా ఆధ్యాత్మిక సందేహాలు తీరుతున్నాయి.

**– వి. విజయలక్ష్మి,** కాకినాడ

★ 'కొత్తగాలి' చిరుకవితలు మనసుకు దగ్గ రవుతాయి. 'నాగేశ్వరపురం 4 కి.మీ.' నవల పేరుకు తగ్గట్టు నూతనత్వాన్ని పొందుపరచుకో వడమే కాక అడుగడుగునా ఉత్కంఠని సంత రించుకుంది. నవలావలోకనంలో విజయలక్ష్మి నవల 'విధివిన్యాసాలు' సమీక్ష అర్థవంతంగానే కాక ఆలోచనీయంగా ఉంది. చతురసమ్'గ తులు చక్కని పరిజ్ఞానం ఇచ్చే శీర్షిక. 'భామనే సత్యభామనే..!'లో ఆహార నియమాల్ని చక్కగా వివరించారు. జోక్స్ బాగా నవ్వించాయి.

**– డాక్టర్ శివభూషణం,** కర్నూలు

★ 'నాగేశ్వరపురం 4 కి.మీ.' నవల అత్యం త ఉత్కంఠభరితంగా సాగింది. ఎత్తుగడ, నడ క, ముగింపు దేనికదే ప్రత్యేకత సంతరించు కుంది. జమీను కొనడానికి బయల్దేరిన కరుణా కర్‌కు ఎదురయిన సంఘటనలు మరొకరికి ఎదురైతే వెనక్కి వెళ్లిపోయేవాళ్లే. అతని తల్లి శారదాదేవి సహేతుకమైన ఆలోచనలతో నవలీ కరించిన తీరు శ్లాఘనీయం.

**– జి.జి.కె. రావు,** శ్రీకాకుళం

సంపుటి -38,
సంచిక - 6
450వ సంచిక,
పేజీలు : 132, జులై 2015

# చతుర

'ఈ కొద్ది పరిచయంతోనే అనసూయ ఇన్ని రహస్యాలు నీకు చెప్పిందా? ఇది ఎలా సాధ్యం?' ఆశ్చర్యంగా తన భార్య నిరోషాను అడిగాడు అశోక్.

'అనసూయ దగ్గర స్వప్న గురించి కదిపినపుడల్లా టాపిక్ ఆమె తండ్రి వెంకీ మీదకు పోయేది. అదీగాక కొన్ని నా రహస్యాలు ఆమెతో షేర్ చేసుకునేసరికి ఆమె కూడా తనవన్నీ చెప్పుకోవడం మొదలు పెట్టింది' చెప్పింది నిరోషా.

'ఏయ్! నీ రహస్యాలా? ఏంటవి? ఏం చెప్పావ్ ఆవిడకి? నా గురించేనా?' గట్టిగా అడిగాడు అశోక్.

ఇంతకీ నిరోషా అనసూయకేం చెప్పింది? అనసూయ రహస్యాలు ఏంటి? సమాజంలోని రకరకాల మనుషుల మనోగతాలకు అక్షరరూపమిచ్చిన **డా. జి. సురేశ్ బాబు** నవల

**ప్రియదర్శిని పార్క్**

చతుర జులై కానుక!
6వ పేజీలో...




★ ముఖచిత్రం: నటి మంజిమ మోహన్
★ రెండో కవరు : వారెవ్వా!
★ చివరి కవరు : బేబీ సాయి సంహిత
★ పుస్తకాలంకరణ : రాజు యాట




పార్వతి తండ్రి ఆమెకు వేరే సంబంధం ఖాయం
చేయడంతో, విలవిల్లాడాడు అశోక్.
తన కొడుకు పడుతున్న బాధను చూడలేక
ఆ అమ్మాయిని తీసుకుని ఎక్కడికైనా వెళ్లిపొమ్మంటూ
రెండు రైలు టిక్కెట్లు కూడా కొనిచ్చాడా కన్న తండ్రి అశోక్‌కు.
మరోపక్క 'అశోక్! హార్ట్ ఎటాక్ అంటున్నార్రా డాక్టర్లు.
నా హార్ట్ నువ్వేనని వాళ్లకు తెలీదురా' అని కన్నీళ్లు పెట్టుకుంది తల్లి.
ఆ పరిస్థితుల్లో అశోక్ ఏం చేశాడు?
గుండెనొప్పితో మంచమెక్కిన తల్లిని కనిపెట్టుకుని ఉన్నాడా?
తండ్రి ఇచ్చిన టిక్కెట్లు తీసుకుని అమ్మాయితో ఉడాయించాడా?
చిత్రవిచిత్ర ప్రేమకథలతో ఆద్యంతం ఆసక్తిగా సాగే
డా. జి. సురేశ్ బాబు నవల **ప్రియదర్శిని పార్క్**
చతుర జులై కానుక!

బొమ్మలు : రాజు

రాత్రి ముక్కలు చెక్కలయ్యే ప్రాతః కాలం. సూర్యకాంతి నల్లని, తెల్లని మేఘాలనే భేదం లేకుండా వితరణం అవుతూ భూమిని తాకే ప్రయత్నం చేస్తోన్న నిశ్శబ్దపు వాతావరణ పరివర్తనం. ఆ పార్కులో ఉన్న చెట్లన్నింటిలోకి అత్యంత చిట్టిపొట్టి చెట్టుకున్న చివురుటాకు అపురావుమంటూ నోరు తెరుచుకుని ఆబగా ఆ పసి పసిడికిరణాల సంయోగ ప్రక్రియతో తన ఆకలి తీర్చుకునే కాల ధర్మం. లేత ఎరుపు మబ్బుల్ని ఆహారంగా భావించి ఆ దిశగా ఎగురుతున్న పావు రాలు. కన్నతల్లి భూమాతకు పుష్పార్చన చేసే పున్నాగమల్లె చెట్టు, పక్కనే అదే పని చేస్తూ ఓ పారిజాతవృక్షం. ఆ పార్కులో తిరుగాడే గాలి- ఈ సుగంధాల్ని మోస్తూ బుడిబుడి అడుగులు నేర్చిన పసిపిల్లాడి పరుగులా ఈ కొన నుండి ఆ కొనకు తిరు గాడుతోంది. రాలి ఎండిన పత్రాలు చెట్ల వైపు దీనంగా చూస్తూ తరుముకొస్తున్న చీపురు దిశగా మోకాళ్లపై వంగి శిరస్సుప్ప గిస్తున్నాయి. మంచు తాగిన మట్టి తన గట్టిదనాన్ని గాంభీర్యంగా ప్రదర్శిస్తోంది. వాకింగ్ ట్రాక్ మీద మెల్లని అడుగుల సవ్వడి క్రమక్రమంగా అలజడి సంతరించు కుంటోంది. పార్కులో అంతర్భాగంగా ఉన్న సరూర్‌నగర్ చెరువు బాతుల ఈతకు ఊతంగా సన్నటి అలల్ని తీరం తాకిస్తోంది.

కానీ..

ఎవడికి ఇంత టైముంటుంది- ఇవన్నీ చూసి ఆనందించేంత? నాక్కూడా అంత సమయంలేదు. ఉన్నా దీనికి వాడేంత టైంలేదు. ఓపిక అసలే లేదు.

శరీర ధర్మం ఏంటంటే.. ప్రతి మిల్లీ నానో సెకండుకు అదే నిష్పత్తిలో క్షీణిం చడం. ప్రతిక్షణం- క్షణక్షణం కుదేలయ్యే కణజాలం. పునరుద్ధరణ శక్తిని క్షణక్షణం కోల్పోవడం! గట్టును కరిగించే వర్షం- అప్పటికే నదిని నింపి ఉండటం వల్ల.. గట్టును కోసి గ్రామంలోకి దూకడం నీళ్లకు ఎంత సునాయాసమో, మీద పడే వయ సుతో శరీరం పలు రోగాలకు దారివ్వడం కూడా అంతే సహజం.

ఇదంతా ప్రకృతి నియమం. కాలధర్మం. కానీ మానవుడు దీన్నంతా ఎదుర్కొనే శుష్క ప్రయత్నం చేస్తాడు. ఆహార నియ మాలు, వ్యాయామం, కాలినడక, యోగా, ధ్యానం, జుత్తుకు రంగేయడం ఇంకా వయాగ్రా ఎట్సెట్రా!

ఆచార వ్యవహారాలకి తలొగ్గని మనిషి, సమాజంలో బతకడం చాలా కష్టం. మధు మేహం, ఊబకాయం పెట్టుకుని పొద్దున్నే వాకింగ్‌కి వెళ్లక న్యూస్‌పేపర్, అల్లం చాయ్‌లతో గడిపేస్తే సమాజం మనల్ని నైతికంగా వెలివేస్తుంది. అలాకాక, పొద్దున్నే ఇల్లుదాటి బైటికొచ్చామా- సమాజం మనల్ని అక్కున చేర్చుకుని సానుభూతితో లాలిస్తుంది. మరణించినా అది వీరమరణమే! తొంభై ఏళ్ల ఆయు ష్షును జాతకమో అదృష్టమో ధ్రువీకరిం చినా- మానవ అంతఃచేతనలో వాటికి నమ్మిక లేనందున అవి చెల్లుబాటు కావు!!

ఈ ప్రియదర్శిని పార్కులో కాలు పెట్ట డానికి ఇంతకంటే వేరే కారణం నాకు లే దు. ప్రకృతి వర్ణన కోసం అయితే- చెప్పా నుగా- అంత టైం, ఓపిక- నాకు లేవు.

'వాకింగ్'కి వెళ్తే మధుమేహాన్ని మరింత అదుపులో పెట్టవచ్చని డాక్టర్లు, మీడియా, నెట్, టీవీ ఆరోగ్య ప్రకటనలు ఓవైపు. పొరుగింటి పేషంటు, ఎదురింటి ఆంటీ లు.. ఇలా సమాజమంతా ఓ నిశ్చితాభిప్రా యంతో ఒక 'ధర్మాన్ని' నెలకొల్పిన పరిస్థితి మరోవైపు. ఈ నేపథ్యంలో మా ఆవిడ నన్ను 'తరమడం' వల్ల ఈ ప్రియదర్శిని పార్క్‌లో నడక కోసం అడుగు పెట్టాను.

నాకు జీవితాల్ని అన్వేషించే గుణం ఉండటం వల్ల ఈ పార్కు నాకొక జీవి

తాల పూదోటలాగా స్ఫురించింది. రకరకాల మనుషులు వారివారి సమస్యలు మోసుకుంటూ, అడుగులో అడుగేసుకుంటూ ఆరోగ్యాన్ని పోగేసుకుంటుంటారిక్కడ.

'హలో మాష్టారు!' అన్న పిలుపు విని నేను ఆ వైపుగా చూశాను.

"మిమ్మల్నే!"

నేనాయన్ని చూసి ప్రశ్నార్థకంగా నవ్వేను- 'మీరు నాకు తెలుసా?' అన్నట్టుగా.

ఆయన వృద్ధాప్యంలో ఉన్నా, హెల్దీగా ఉన్న పెద్దాయన. భానుడి లేలేత కిరణాల్ని తాకించుకోవడానికన్నట్టు పార్కులోని సిమెంటు బెంచీ మధ్యలో కూర్చుని నన్ను పిలుస్తున్నాడు.

నడకనాపి ఆయన్ని సమీపించాను.

"హలో! నేను త్రినాథరావు, గవర్నమెంటు విశ్రాంత ఉద్యోగిని, ప్రస్తుతం హోమియో డాక్టర్ని కూడా! మిమ్మల్ని ఇంతకు ముందు ఎక్కడో చూసినట్టుంటేనూ.." తనని పరిచయం చేసుకున్నాడు.

"హలో సర్..! నమస్తే! అశోక్ రాణా! తెలుగు లెక్చరర్" చేతులు జోడించి నమస్కరించాను. కరచాలనం చేసుకున్నాం.

"అశోక్ రాణా.. ఇది హిస్టరీ లెక్చరర్ కుండాల్సిన పేరు.. గుడ్‌నేమ్!" అంటూ నవ్వి, కూర్చోమన్నట్టు సైగ చేశాడు. నేను కూర్చోకుండా అలాగే నించుని పెరుగుతున్న ఎండ తాకిడిని కాలయాపనగా అనువర్తించుకుని బయల్దేరబోయాను.

"అశోక్‌గారూ..! కాసేపు కూర్చోండి! ఈ పార్కు మొత్తంలో మొట్టమొదటిగా సూర్యకాంతి పడేది ఈ బెంచీ మీదే! విటమిన్ 'డి' అండి బాబూ! రండి. 'డి' తయారు చేసుకుని వెళ్లండి. ఇదికూడా టాక్‌టైమ్ టాపప్ లాంటిదే!" అంటూ మళ్లీ నవ్వాడు.

మొహమాటం కొద్దీ కూర్చుండిపోయాను. ఆయన తన పెద్ద సైజు కళ్లజోడు తీసి, తన టీషర్టుకి తుడిచి, మళ్లీ పెట్టుకుని నన్ను ఆపాదమస్తకం చూశాడు.

"గుర్తొచ్చింధి..! బ్యాంక్ కాలనీ కమ్యూనిటీ హాల్లో గణేష్ ఉత్సవాలకు మీరు వస్తుంటారు..! ఔనా? శాక్సాఫోన్ కూడా వాయించారు.. మీరే కదూ!"

'గుర్తుపట్టేశాడ్రా బాబోయ్!' అనుకున్నాను. "మీది కూడా- అదే కాలనీనా అంకుల్?" అడిగాను- కొంచెం ఆసక్తి పైకి కనబడేలా.

కాదన్నట్టు తల ఊపాడు.

"నాకు శాక్సాఫోన్ స్వరం ఇష్టం. అందుకే మీ వదనం అలాగే గుర్తుండిపోయిందనుకుంటా. బాగా ప్లే చేశారు. అంటే..? ఎప్పట్నుంచో ప్రాక్టీసా? చిన్నప్పట్నుంచా?"

**కొత్తగాలి...**

**స్వచ్ఛభారత్ అంటూ**
**తన పెరడు ఊడ్చి**
**రోడ్డు మీద పోస్తే**
**అది చెత్తభారత్ అవుతుంది**

*- ఆర్.ఎస్. హైమవతి,*
చెన్నై

"అబ్బే.. ఈ మధ్యనే. రెండేళ్లుగా నేర్చుకుంటున్నాను. మీరు చూసింది నా అరంగేట్రం.. ఎనీవే.. థాంక్స్!"

"కాద్రి గోపాలనాథ్‌గారని.. చాలా గొప్ప విద్వాంసుడు, నాదస్వరాన్ని శాక్సా మీద యాజిటీజ్‌గా వాయిస్తాడు. అబ్బో..! ఏం టాలెంటండీ! అరవాయన.. తెలుసనుకుంటా మీకు?"

"తెలుసంకుల్! అనితర సాధ్యం. ఆయనే నా ఇన్స్పిరేషన్. యూట్యూబ్‌లో నేను ఆయన షోలన్నీ చూసేశాను"

కాసేపు నిశ్శబ్దం. నాకూ ఇంక ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. నడుద్దామని

లేస్తుండగా ఆయన నావైపు చూడకుండా చెరువువైపు చూస్తూ "షుగరా? " అనడిగాడు. నేను సన్నని నవ్వును సమాధానంగా ఇచ్చాను.

"మీ మందహాసం వెనుక చిరువిషాదం నా కళ్లకి కనబడుతోంది.."

"ఇప్పుడు మీరు కవిత రాస్తారా అంకుల్!"

ఆయన పెద్దగా నవ్వేశాడు. "మీలో సెన్సాఫ్ హ్యూమర్ స్పాంటేనిటీ నాకు నచ్చింది. గుడ్! కీపిటప్! విల్ మీట్ టుమారో.." అంటూ ఆయన లేచి వడివడిగా నాకన్నా ముందే పార్క్ గేటువైపు వెళ్లిపోయాడు.

'డాక్టర్ త్రినాథరావు..' మనసులోనే ఆయన పేరుని ఉచ్చరించి గుర్తుపెట్టుకున్నాను. ఈయన ధరించిన కాన్వాస్ బూట్లు నా దృష్టి దాటిపోలేదు. సరిగ్గా ఇలాంటివే నాకూ ఉండేవి. అవి వేసుకుని నడుస్తూంటే.. ఇంకా ఇంకా నడవాలనిపించేంత సౌఖ్యం కలిగేది.

నేను పాఠాలు చెప్పే కాలేజీలో ఒక పేద విద్యార్థికి వాటిని దానం చేసేశాను. ఆ షూస్‌తో వాడు రన్నింగ్ రేస్‌లో కాలేజీకి కప్పు పట్టుకొచ్చేశాడు. నేనే ఆ కప్పు విజేతనన్నంత గర్వం కలిగిందా క్షణాన. వాడు గ్రూప్స్‌లో సెలక్టయ్యి, డి.యస్.పి.గా జాయినయ్యి, నేనిచ్చిన షూస్ ధరిస్తున్నానన్నప్పుడు నా ఇగో మరింత ఆనందానికి లోనయ్యింది. ఆ తృప్తి రవీంద్రుడు కవిత రూపంలో కూడా చెప్పలేడేమో అనిపించింది. ఆ సెంటిమెంటు బాగా క్లిక్కవ్వడంతో.. ప్రతి యేడాదీ ఒక బీద విద్యార్థికి ఖరీదైన పుస్తకాలో, షూసో, ఫీజు కట్టడమో చేస్తూ వచ్చాను. వాళ్లు సెటిలై నాకు ఏదైనా బహుమతి పట్టుకొస్తే మాత్రం నిర్ద్వంద్వంగా తిరస్కరించేవాణ్ని.

'నేను ఇస్తాను.. ఇచ్చాను. మీరు తీసుకోవాలి.. తీసుకున్నారు. బాగుపడ్డారు.. తిరిగి ఇవ్వడం మీ కృతజ్ఞత, కరక్టే.. కానీ.. నా ఉద్దేశానికది విరుద్ధం' అనేవాణ్ని. అలా నన్ను నేను ప్రమోట్ చేసుకునేవాణ్ని!

మరుసటిరోజు డా. త్రినాథ్ రాలేదు. నా కళ్లు అప్రయత్నంగా 'డి' బెంచ్ మీద వెతికాయి. రౌండ్లు వేస్తున్న ప్రతిసారీ ఆ బెంచ్ దగ్గరకు రాగానే ఆయన నిన్న మాట్లాడిన మాటలు గుర్తుకు రాసాగాయి.

ఆయనలో ఏదో 'విషయం' ఉంది. అందుకే ఆయన నన్నాకర్షించగలిగాడు. 'మామూలు ముసలాడు' కాదని నా మనసు గ్రహించింది.

ఈ ప్రియదర్శిని పార్క్‌లో ఓ మూలన క్యాంటీన్ సదుపాయం ఉంది. గ్రీన్‌టీ, సమోసా, పూరీ సబ్జీ, చిప్స్, బెవెరేజ్‌లాంటివి అక్కడ దొరుకుతాయి. ఇంకోపక్క పిల్లల టాయ్స్, ఐస్‌క్రీం, మిఠాయిలు కూడా అమ్మే దుకాణం ఉంది. కానీ అది కేవలం సాయంత్రం మాత్రమే తెరుస్తారు. సంక్రాంతి పండుగ సమయంలో గాలిపటాలు కూడా అమ్ముతారు. విచిత్రమైన విషయం ఏంటంటే, గాలిపటాల సీజన్లో దాదాపు ప్రతి అరగంటకొక తెగిన గాలిపటం అక్కడి గడ్డి మైదానంలోనో, చెట్ల కొమ్మలపైనో వచ్చి వాలుతుంటుంది! అలాంటి గాలిపటాలను దొరికించుకోవడాన్కి మావూళ్లో నా చిన్నతనంలో ఎన్నిసార్లు ముళ్లలో, మురికి నీళ్లల్లో పరిగెత్తి ఉంటానో నాకే గుర్తులేదు. ఇప్పుడు ఈ నగరంలోని పిల్లల్లో అలాంటి ఉత్సాహం నాకస్సలు కనిపించదు. అసలు ముళ్లచెట్లు ఎక్కడున్నాయ్ ఇప్పుడు? అవి పెరిగే ఖాళీ స్థలమేదీ ఈ నగరంలో? రోడ్లమీద సీలలు, గాజుపెంకులు తప్ప ముళ్లకు మనుగడేదీ?

ఆలోచిస్తే అంతా తమాషాగా తోస్తుంది. మా చిన్నప్పటి ప్రపంచం వేరుగా ఉండేది. ఇల్లు, ఇంట్లోని వంట

# జైలంటే ఇష్టం!




నేరస్థులు జైలు శిక్షని తప్పించుకోవాలని చూస్తారు, అలాంటిది కావాలని నేరం చేసి జైలుకి వెళ్లడానికి కొందరు ఉత్సాహం చూపిస్తారు. అలాంటి వారి గురించి!

★ జార్జియా రాష్ట్రంలోని లేన్స్ బ్రౌన్ 2011లో ప్రభుత్వ భవనాల కిటికీ అద్దాలని రాళ్లతో పగలగొట్టి జైలుకి వెళ్లాడు. రోడ్ల మీద జీవించే బ్రౌన్ ఆకలి బాధ తట్టుకోలేక, భోజనం దొరుకుతుందని ఈ పని చేశాడు



★ ఎట్టాలో పెజ్(31) శాక్రిమెంటోలోని ఓ డిప్యూటీ షెరీఫ్ చెంప పగలకొట్టింది. వెంటనే ఆమెని అరెస్ట్ చేసి జైల్లో పెట్టారు. తనకి కావలసింది అదే అని, సిగరెట్ అలవాటు మానుకోవడానికి జైలుశిక్ష కోరుకున్నానని ఆమె చెప్పింది.

★ కెనడాలోని మనిటోబా అనే ఊళ్లో రాయల్ కెనెడియన్ మౌంటెడ్ పోలీస్ స్టేషన్‌కి 13, 14 ఏళ్ల టీనేజర్లు నిప్పు అంటించారు. కారణం జైలుకి వెళ్లాలని, వాళ్ల ఫ్రెండ్స్ అందరూ జైల్లోనే ఉన్నారట!

★ నార్వేలోని హోల్‌డెన్ ప్రిజన్‌కి వచ్చే ఖైదీల్లో కొందరు సౌకర్యాల కోసమే నేరం చేసి వస్తున్నారు. ప్రతీ సెల్‌లో మినీ ఫ్రిజ్, ఫ్లాట్ స్క్రీన్ టీవీ, చక్కటి బాత్‌రూమ్స్, డిజైనర్ ఫర్నిచర్, కొన్ని సెల్స్‌కి కిచెన్, డైనింగ్ రూమ్ ఉంటాయి. బాస్కెట్ బాల్, కుకింగ్, మ్యూజిక్, చదరంగం నేర్పే క్లాసులు ఉచితం!

★ వలసదారులు మర్కో సావ్‌రెట్రా, పిరిడియనా మార్టినెజ్‌లు కావాలని అమెరికన్ జైల్లోకి వెళ్లే నేరం చేశారు. అక్కడ వలస ఖైదీలని ఎలా చూస్తున్నారో బయటికి వచ్చాక ప్రపంచానికి తెలియజేయడానికే వాళ్లు వెళ్లారు.

★ కింబర్లే బివెన్స్(49) తన మాజీ భర్త ఇంటి కిటికీలు పగలకొట్టి జైలుకి వెళ్లడానికి కారణం, అతనికి భరణం చెల్లించకూడదని

★ ఫ్రాంక్ జె మొరాకో(46) అనే అమెరికన్‌కి లుకేమియా వ్యాధి సోకడంతో చికిత్సకి డబ్బు లేక నేరం చేసి జైలు పాలయ్యాడు.

కాలు, వాతావరణం, ఆటలు, ఆవేశాలు.. అవన్నీ ఇప్పుడు కానరావు. చలికాలం చల్లగా, వర్షాకాలం వర్షాలతో, ఎండాకాలం ఎండలతో.. ఉండేవి! స్కూల్ నుండి రాగానే పుస్తకాల సంచి విసిరేసి పాలు తాగేసి బైటపడేవాళ్లం. కనీసం రెండు గంటలపాటు ఉరుకులు పరుగులు, తుళ్లింతలు, కేరింతలు, కొట్లాటలు.. వర్షాకాలంలో కాలువల్లో కాగితం పడవలు, చలికాలంలో పొద్దున్నే చలిమంటలు..

ఈ నగరానికేమయ్యింది? ఆ బాల్యం ఏదీ? ఆటలు, పాటలు ఆడించే స్కూళ్లేవీ? యాంత్రికంగా పెరిగిన ఈ పిల్లలు ఏటీయం మెషిన్లలాగా, రోబోల్లాగా తయారవ్వడంలో పెద్ద వింతేం ఉంది? ! కథలు, నవలలు, వార్తాపత్రికలు, గ్రంథాలయంలాంటి పదాలు ఈ జెనరేషన్‌కి నవ్వు పుట్టించే జోక్స్! రేడియోలో బాలవినోదం, వివిధ భారతి, సంస్కృతం వార్తలు.. చెప్పనే వద్దండీ!

అంతదాకా ఎందుకు? ఈ పార్క్‌లోనే.. అదుగో- ఆ ఎదురుగా వస్తోన్న కుర్రాణ్ని- చెవుల్లో స్పీకర్లు లేకుండా, పాట వినకుండా పరిగెత్తమనండి చూద్దాం! ఈతరం ఇంతే..! మనసు, శరీరం, ఆత్మ.. అన్నీ ఫార్మాటబుల్.. మెటీరియలిస్టిక్. కానీ..

ప్రపంచమే హద్దులు చెరిపేసుకుంటూ అంతా కలిసిపోతూంటే పాపం ఈ పిల్లకాయలు మాత్రం ఏం చేస్తారు?

ఆ తర్వాత రెండ్రోజులకి 'డి' బెంచ్ మీద త్రినాథ్ ఆసీనుడై కనిపించాడు. నా మొహంలో చిరునవ్వు తొణికిసలాడ్డం నేను గమనించుకున్నాను. నన్ను దూరం నుంచే గమనించినట్టున్నాడు. చిరునవ్వులు చిలికిస్తున్నాడు.

"రావయ్యా అశోక్ రాణా! నీ పేరు మాత్రం బాగుంది బాబూ! నాకు నచ్చింది" పలకరించాడాయన.

"హలో సార్! నమస్తే..!" నమస్కారం పెట్టి, నడక ఆపి, ఎండకు నుంచున్నాను.

"అమెరికా నుండి పిల్లలొచ్చారండీ! అందుకే కుదర్లా! లేకపోతే నేను వాకింగ్ మిస్ చెయ్యను.. ఊ!"

"ఔనా.. దట్స్ వెరీనైస్!" అన్నాను ఇంక ఏమనాలో తెలీక. చెవుల్లో స్పీకర్లు పెట్టుకున్న కుర్రాడు జాగింగ్ చేస్తూనే ఉన్నాడు. మావైపు వచ్చినప్పుడు 'నమస్తే తాతాజీ!' అని త్రినాథ్‌ను విష్ చేసి జాగింగ్ కంటిన్యూ చేశాడు.

"నా మనవడేం కాదు. కానీ మంచిపిల్లాడు. ఐ లైక్ హిమ్" చెప్పాడు త్రినాథ్.

నేనేం మాట్లాడలేదు. కాసేపాగి ఆయనే చెప్పాడు "అశోక్‌గారూ..! నాకొక్కోసారి ఆశ్చర్యం వేస్తుందండీ! ఈ కాలంలో ఇట్లాంటి గొప్ప పిల్లలున్నారేంటా అని!? "

నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"వెరీ ఇంట్రెస్టింగ్ అండీ! వెరీమచ్" గొణుక్కున్నట్టుగా అన్నాడా పెద్దాయన.

ఆ కుర్రాడి గురించి ఈయనకేదో తెలిసుండాలి. అందుకే మెచ్చుకుంటున్నాడు కాబోలు.. అనుకున్నాను.

"మీ సమయం వృథా చేయట్లేదంటేనే.. నేను మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తాను. మీ వాకింగ్‌ను నేను ఇంటరప్ట్ చేస్తున్నానా? అయామ్ సారీ అశోక్ గారూ!"

"గారూ వద్దంకుల్. 'అశోక్' అని పిలవండి. ఇక వాకింగ్ అంటారా.. దానికి అంతే లేదుగా! చేసుకున్నంత"

"అయితే సరే! మినిమమ్ ఓ ఇరవై వేస్తారా? "

"ఇరవై నిమిషాలా? "

"కాదు.. ఇరవై రౌండ్లు!"

"అమ్మో!"

ఆయన నవ్వేశాడు. "ఇరవై రౌండ్లేస్తే ఐదు కి.మీ."

"సారీ.. నేనంత జబ్బు పడిలేను. అయినా నాకు అంత ఓపిక, టైమూ లేవు. త్వరగా వెళ్లి కాలేజి పాఠం చదువుకొని రెడీ అవ్వద్దూ!? "

"కాస్త ఎర్లీగా రండి మరి.. ఇద్దరం అలా అలా వాక్ చేస్తూ మాట్లాడుకోవచ్చు. బోర్ రాకుండా!" సూచించాడా పెద్దమనిషి.

★ ★ ★

త్రినాథ్‌గారికి దాదాపు మా తండ్రిగారి అంత వయసుంటుంది. అరవై.. అరవై ఐదుకు మధ్య. అందుకే ఆయన్ని ఫాదర్ ఫిగర్‌గా భావిస్తున్నానేమో! నాన్నగారు పోయి పదేళ్లవస్తోంది. ఆయన్ని నేను బాగా మిస్సవుతున్న ఫీలింగే నన్ను త్రినాథ్‌గారికి దగ్గర చేసిందని ఒప్పుకుంటాను. అయినా, ఇద్దరు మనుషుల మధ్య ఒక స్నేహ భావం, చనువు, ఆత్మీయత ఏర్పడ్డానికి మరీ ఎక్కువ టైం అవసరం లేదని నా వాదన. ట్యూనింగ్ కుదిర్తే చాలు.

రాత్రి పడుకోబోయే ముందు త్రినాథ్‌గారి మాటలు గుర్తొచ్చి త్వరగా లేచి వాకింగ్‌కి వెళ్లాలని నిశ్చయించుకున్నాను. నా కూతురుకు ఏడో తరగతి ఫైనల్ ఎగ్జామ్స్ జరుగుతున్న నేపథ్యంలో మా ఆవిడ తనతో కూర్చుని చదివిస్తోంది. ఎప్పుడో పన్నెండింటిగ్గాని, మధులికను నిద్రపుచ్చాకే నిరోషా బెడ్‌రూంలోకి వస్తుంది. అప్పటిదాకా వెయిట్ చెయ్యలేను. ఆ ఇద్దరికీ పదింటికే గుడ్‌నైట్

చెప్పి బెడ్‌రూంలోకొచ్చి నిద్రకుపక్రమిం చాను. మధులికకు ప్రతి పరీక్షల సీజన్లో కడుపునొప్పి, వాంతులులాంటి జాడ్యం ఆవరిస్తుంది. వైద్యపరీక్షల్లో అది కేవలం ఎగ్జామ్ ఫోబియా వల్ల వచ్చిన నొప్పే అని తేల్చినా, కన్నవారిగా మధుకి అనునిత్యం మోరల్ సపోర్ట్ ఇవ్వడం మా బాధ్యతగా భావిస్తాం. మధుకి ఎగ్జామ్స్ దగ్గరకొస్తు న్నాయంటే - తల్లిదండ్రులుగా మా ఇద్దరికీ ఓరకమైన మానసిక అసౌకర్యం మొదలవు తుంది. అయినప్పటికీ నిరోషా మూలస్తంభంగా నిలిచి మధుని పొదు వుకుని కాపాడుతుంది. ఏ విషయమైనా ఎంతో అవసరం ఉంటే తప్ప నాదాకా రానీయదు. అందుచేత నా ప్రేమతో పాటు, తన పట్ల గౌరవం కూడా సంపా దించుకుంది నా అర్ధాంగి, నిరోషా.

★ ★ ★

"దేవుని మీద మీ అభిప్రాయం? " ఆ రోజు వాకింగ్‌లో కలవగానే అడిగాను త్రినాథ్‌గారిని.

"అంటే? " అన్నారాయన.

"ఉన్నాడంటారా? "

"అయ్యో బాబోయ్! ఎంతమాట? తప్ప కుండా..!"

త్రినాథ్ ప్రతిమాటకు చిరునవ్వు జోడిస్తాడు. అది నాకు నచ్చుతుంది. నిర్మల మైన మనసు, పరిపూర్ణమైన జీవితం గడి పినవారికే అది సాధ్యం.

"ఈ విశ్వం గురించి మీకు తెలిసే ఉంటుంది కదూ..! ఈ గ్రహాలు.. అంత రిక్షం.. సూర్యుడు.. అలాంటి గెలాక్సీలు ఎట్సెట్రా.. ఒక్క భూమి మీదనే జీవం ఉంది. మనిషికి మాత్రమే దేవుని పట్ల ఒక భావన, నమ్మకం, విశ్వాసం లేదా అవి శ్వాసం ఉన్నాయి"

"తప్పకుండానండీ అశోక్.. ఏదో ఒక సూపర్ పవర్ ఉండి తీరాలి!"

"అంత కచ్చితమైన విశ్వాసం ఎలా మీకు? "

"ఫరెగ్జాంపుల్.. భూమి తన చుట్టూ తాను ఇరవై నాలుగు గంటల్లో తిరుగు తుంది. సూర్యుని చుట్టూ ఓ సంవత్సర కాలంలో తిరుగుతుంది. అట్లాగే వేరే గ్రహాలు, ఉపగ్రహాలు ఈ విశ్వంలో చాలా ఉన్నా - ఒకదానితో ఒకటి ఎప్పుడూ ఢీ కొట్టకుండా పర్ఫెక్ట్‌గా దేని కక్ష్యలో అది తిరుగుతూనే ఉంటుంది! మానవుని స్పేస్ షిప్స్ ఫెయిలయ్యాయి.. ఉపగ్రహాలు కూలిపోయాయి గానీ - దేవుని గ్రహాలు ఎప్పుడూ ఫెయిలవ్వలా. అది అంతే! మనిషి తెలివితేటలకి అంతుబట్టని కాలిక్యు లేషన్స్. అసలివ్వన్నీ ఎట్లా ఏర్పడ్డాయో..! తల్చుకుంటేనే ఎంతో ఆశ్చర్యం! అందుకే ఆ

**కొత్తగాలి...**

**స్వచ్ఛభారత్ మాదిరిగా**
**స్వచ్ఛ కార్యాలయాలు కావాలి**
**స్వచ్ఛ అంటే చెత్తరహితం కాదు**
**అవినీతి రహితం అని!**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

సూపర్ పవరే దేవుడని గుడ్డిగానైనా నమ్మాల్సిందే!! ఏమంటారు? "

"అయితే మనిషిని.. ఐ మీన్ మనల్ని సృష్టించేది కూడా ఆ దేవుడేనా? "

"కాదు! కచ్చితంగా కాదు!!"

మళ్లీ నవ్వేడు త్రినాథ్.

"అదేంటి? అందరం అట్లానే భావిస్తాం కదా! ఈ వేదాలు, పురాణాలు, సినిమాలు, పెద్దలు అందరూ నమ్మేది అదే కదా! భగ వద్గీత కూడా మనిషి చావు పుట్టుకలు, పునర్జన్మల గురించి భగవంతుడే కేర్‌టేకర్ అని చెబ్తుంది..!"

త్రినాథ్ నడక ఆపి 'డి' బెంచ్ వైపు చూ

స్తూ "అక్కడ కూర్చుందాం.. కాసేపు" అన్నాడు.

నాకు వాకింగ్ చేసి ఆరోగ్యం పొందేదీ, అనారోగ్యం తొలగించుకునేది కంటికి కన్పడదు కాబట్టి దానిపట్ల అంత ఇంట్రెస్ట్ లేదు. ఉన్న ఆసక్తి అల్లా.. ఇట్లాంటి చర్చలపైనే. అందునా- మేధావులతో చర్చ మిస్సవ్వలేం.

"నీ కేస్టేంటి? "

త్రినాథ్ అడిగిన ప్రశ్నకు బిగుసుకుపోయాన్నేను.

"నీది ఏ కులం? అని అడిగాన్నేను.. నువ్వు కరెక్టుగానే విన్నావ్ అశోక్!"

చెప్పాన్నేను.

త్రినాథ్ కూడా తాను ఏ కులమో చెప్పి నవ్వేడు.

"చూడు అశోక్..! ఓ యాభై ఏళ్ల క్రితం అయితే.. మనిద్దరం ఇట్లా ఒక బెంచి మీద పక్కపక్కనే కూర్చునేవాళ్లమే కాదు. కానీ రాన్రాను రోజులు మారినై. కులాలు పెళ్లిళ్లతో కలిసిపోయినై.. ఇంకొన్ని సంవత్సరాల్లో ఈ మతాలు తప్ప, కులాలనేవి మట్టిగొట్టుకుపోతాయి. మారుతున్న ప్రపంచ పటం, కల్చర్, డబ్బు - ఇవే కారణం. అంతేకానీ మనుషుల్లో విశాల హృదయం ఏర్పడ్డం వల్ల కాదు గదా!"

"అఫ్‌కోర్స్! అంకుల్..! నేను ఏకీభవిస్తున్నాను"

సరూర్‌నగర్ చెరువు నుండి చల్లని పిల్ల తెమ్మెరలొస్తున్నాయి. 'డి' బెంచ్ కొంచెం అవతల పున్నాగపూల చెట్టు తన పని తాను చేస్తున్నట్టుగా బొడ్డు మల్లెల్ని రాలుస్తోంది. ఆ పరిమళం మోసిన గాలి మా మధ్య గుబాళిస్తోంది.

త్రినాథ్ ఈ సువాసన పీలుస్తున్నాడో? లేదో? తెలియట్లేదు గానీ, అతని వదనం మాత్రం ప్రసన్నంగా ఉంది.

"అశోక్.. అట్లాగే మనకు దేవుని శక్తి యుక్తుల మీద ఉన్న కాన్సెప్ట్స్ కూడా మారిపోతున్నాయి. మన ఆలోచనా విధానం మారుతోంది. ఒకప్పుడు చంద్రుణ్ణి, నక్షత్రాల్ని దేవతలుగా భావించాం. కానీ.. ఇప్పుడు కాదు.. పూనకం వచ్చినోడిని పిచ్చోడి కింద జమ కట్టే స్థాయికి విజ్ఞానం పెరిగింది. మరో గ్రహం మీద పంటలు పండుతాయా? లేదా? అని పరిశోధిస్తున్నాం. త్రీజీ మొబైల్‌లో మొహాలు చూస్తూ మాట్లాడుకుంటున్నాం. ఎట్ ది సేమ్ టైం 'మరణం' గురించి మాత్రం కనిపెట్టలేకపోయాం. మూడొందల మంది ఉన్న విమానం ఎట్లా మాయమైందో తెలుసుకోలేకపోయాం. అలాగే మన పురాణాలు, దైవిక సాహిత్యం అంతా కూడా లాంచింగ్ పాడ్ లాంటిదే తప్ప మన విజ్ఞానపు గమ్యం కాదు! జిజ్ఞాస మంచిదే గానీ, మనిషి మేధాశక్తికి హద్దులున్నాయి. వాడి జీవిత కాలానికి ఎక్స్‌పయిరీ డేట్ ఉంది. అయినా ఎంతో ప్రగతి పథంలో నడుస్తున్నాం. ప్రస్తుతానికి అది చాలు!"

"దేవుణ్ణి ఏదో ఓరోజు వెదికి పట్టుకుంటామా? "

"ఏమో! ఆ సూపర్ పవర్‌ను పట్టుకుంటాడేమో మనిషి. నా దృష్టిలో ఆ సూపర్ పవర్‌కి మనతో, అంటే ఈ మానవులతో మన సమాజంతో పనేంటి? ఈ భూమ్మీద నీరు, ఆక్సిజన్ ఉంది కాబట్టి, గ్లూకోజ్ తయారవగలదు కాబట్టి, ఇక్కడ జీవరాశులు పెరిగాయి. అందులో మానవుడు ఒక పార్ట్ మాత్రమే. మనం ఆలోచించగలం కాబట్టి, ఇదంతా ముందేసుకుని కూర్చున్నాం. మతాలు తయారుచేసుకున్నాం. కులాలు సృష్టించాం. దేవుడికి రూపాన్ని, లక్షణాల్ని, శక్తుల్ని మనమే కల్పించుకున్నాం. సమాజం అనేది ఒక పద్ధతిలో నడవాలంటే మనుషులకు ఇవన్నీ అవసరం అయ్యింది. మనుషుల్లో ఈ క్లాసిఫికేషన్ వల్ల ఐడెంటిటీ దొరుకుతుం

# ఉత్కంఠ రేపిన సస్పెన్స్ థ్రిల్లర్

## రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష



గత ముప్పయి ఎనిమిది సంవత్సరాల నుంచీ 'చతుర'కు నేను పాఠకుడిని. ఇక జూన్ సంచిక విషయానికి వస్తే 'నాగేశ్వరపురం 4 కి.మీ.' నవల ఆద్యంతం ఆకట్టుకుంది. నాగేశ్వరపురం జమీన్ కొనడానికి వచ్చిన వారిని కాటేస్తున్న నాగుపాముల భరతాన్ని, దాని వెనకాల సూత్రధారి అయిన పూజారి ఆటకట్టించిన కరుణాకర్ వ్యూహం ఆసక్తిక రంగా ఉంది. ఆస్తీక మంత్ర పఠనం వల్లనే పాములు వెనక్కు తగ్గాయని శారదాదేవి అనుకుంటుంది. కానీ నిజానికి మత్తుమందు కలిపిన స్ప్రేద్వారా వెనక్కి తగ్గా యన్న విషయం చివర్లో తెలుసుకొని ఆమె ఆశ్చర్యపో తుంది. మంచి సస్పెన్స్ థ్రిల్లర్‌గా సాగిందీ నవల. ఇందిరా సౌందరరాజన్ తమిళ మూలానికి డా. యండపల్లి పాండురంగ తెలుగు అను వాదం సరళ సుందరంగా ఉంది.

ఉపకారికి ఉపకారం చేయడం గొప్పకాదు. అపకారం చేయడమే 'నేటి న్యాయం' అంటూ సమాజంలో జరుగుతున్న వాస్తవికతకు అద్దం పట్టింది 'చతురకత'. పెద్దకథ 'నేను అమ్మని' చదువుతున్నంతసేపు హృదయాన్ని ద్రవింపజేసింది.. మనసు మూగ బోయింది.

'నవలావలోకనం'లో 'విధివిన్యాసాలు' నవల ఉమ్మడి కుటుంబాల్లోని ఆవేశాలు, హేళనలు, పుల్లవిరుపు మాటలు కళ్లకు కట్టించింది. ఈ నవల ఆధారంగా వచ్చిన 'తాసిల్దారుగారి అమ్మాయి' సినిమా అప్పట్లో సూపర్‌హిట్.

'కొత్తగాలి' కవితలు కొన్ని చురుక్కుమంటే, మరికొన్ని చమక్కుమన్నాయి. 'చతుర సమ్‌గతులు' వింతగా, విడ్డూరంగా మళ్లీమళ్లీ చదివించాయి. దేహం గురించి సం'దేహం'లో ఎన్నో విషయాలు తెలుసుకున్నాం. నక్షత్ర మహత్యం చమత్'కారం'గా ఉంది. 'అక్షరం' లోని ప్రముఖుల వచనాలు ఆణిముత్యాలు. 'చతు రంగం' మెదడుకు పదును పెడుతోంది. ముఖ చిత్రం, వెనుకచిత్రం వెన్నదొంగ- అందంగా, ఆకర్ష ణీయంగా ఉన్నాయి.



– బిక్కునూరి రాజేశ్వర్,
ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా

ది. బతకడం సుగమం అయ్యింది. అంతే తప్ప ఇదంతా దేవుడు చేసింది కాదు!"

నా ఫోన్ రింగయ్యింది.

"ఇప్పుడు సమయం ఎంతయిందో తెలుసా? తొమ్మిది! వాకింగ్ చేస్తున్నారా? - టాకింగా? " నిరోషా నవ్వింది.

నేను ఫలానా త్రినాథ్‌తో చర్చిస్తున్నానని తనకు తెలియదు. చెప్పలేదు. 'వస్తున్నా' అని పెట్టేశాను.

ఆ తర్వాత రోజు.

ఆ కుర్రాడు చెవుల్లో స్పీకర్లు మర్చిపోయి నట్టున్నాడు.. అయినా పరిగెత్తుతు న్నాడు.. 'గ్రేట్' అనుకున్నాను.

ఇంతలో వెనకాతల భుజం మీద చెయ్యి పడింది.

"గుడ్ మార్నింగ్ అశోక్..!"

"అంకుల్ గుడ్ మార్నింగ్..!"

"ఏంటి వాకింగ్ చేస్తూ దీర్ఘాలోచన? దేవుని ఎగ్జిస్టెన్స్ గురించా? మహామహులే తేల్చలేకపోయారు, వదిలేయ్ బాబూ!" నవ్వేడు త్రినాథ్.

"అబ్బే..! ఆ కుర్రాడిని, అదే మిమ్మల్ని 'తాతాజీ' అంటూ పలకరించిన అబ్బాయిని చూస్తున్నాను. ఇవాళ మ్యూజిక్ వినకుండానే అడుగులు కదుల్తున్నాయ్ అను కుంటున్నాను"

"ఓహ్.. వాడా! మోహన్.. ఫైనలియర్ మెడికల్ స్టూడెంట్. గత ఏడాదిగా పరిచయం. రెగ్యులర్‌గా జాగ్ చేస్తాడు"

"ఎందుకు? "

"ఎందుకంటే, బహుశా.. బహుశా.. స్ట్రెస్ అనుకుంటా. షుగర్ బీపీలైతే లేవతనికి.. నాకు తెలిసినంతవరకూ స్ట్రెస్సే!"

"యం. బి. బి. యస్. స్ట్రెస్సా? "

"కాదు. ఏమో! అదీ అయ్యుండొచ్చు! కానీ నాకు తెలిసిన స్ట్రెస్- అతని లవ్ ఎఫైర్ గురించి"

"లవ్ ఫెయిల్యూరా? "

"గమ్మత్తయిన విషయం, ఫెయిల్యూరా? సక్సెస్సా? నాకైతే అంతుపట్టలేదు!"

నేను నడక ఆపి త్రినాథ్ కళ్లలోకి సూటిగా చూస్తూ ప్రశ్నించాను. "అంకుల్! మీకిలా ఇంకొకళ్ల విషయాలు, రహస్యాలు ఎట్లా తెలుస్తాయి? ఆ కుర్రాడి పర్సనల్ విషయాలు మీకెట్లా తెలుసు? మీతో చెప్పుకున్నాడా? "

"నువ్వు మరీ అంత సీరియస్సయిపోకు. మోహన్ లవ్ ఫెయిల్యూర్ అవ్వడంలో నా బాధ్యతా ఉంది. అది సక్సెస్సే అనుకుంటే నా హస్తం కూడా ఉంది. అందుకే చెప్పగలుగుతున్నా"

నాకర్థం కాలేదు.

"వాట్? "

"అవును! అయామ్ గిల్టీ అండ్ ప్రౌడ్!" నవ్వేశాడు శూన్యంలోకి చూస్తూ.

ఇద్దరం కలిసి మరో రెండు రౌండ్లేశాం. 'డి' బెంచ్ దగ్గరికొచ్చేక అడిగాను.. "అంకుల్! నాకు మోహన్ స్టోరీ చెప్పండి"

"అదే ఆలోచిస్తున్నా. నీకెట్లా చెప్పాలా అని!"

"ఏం? ? "

"అబ్బే..! ఏం లేదు. ఎట్లా మొదలుపెట్టాలా అని. పోనీ- రోజూ కొంచెం, కొంచెం చెబుతాను. ఎట్లాగూ నువ్వు రోజూ పార్కుకి వస్తావుగా!"

"ఓకే! చెప్పండి! దీని కోసమైనా రోజూ వాకింగ్‌కి వస్తా"

"రేపట్నుంచి మొదలుపెడ్దాం. ఇవాళ నాకు గుండె డాక్టర్ అప్పాయింట్‌మెంటుంది. త్వరగా రెడీ అయ్యి వెళ్లాలి"

"డన్! ఆల్ ది బెస్ట్ అంకుల్!"

**అనసూయ:**

సాటి ఆడది అసూయపడే అంగసౌష్టవం ఆమె సొంతం. ఆమెపేరు అనసూయ. కానీ ఆమే అసూయ పడే విషయం ఒకటుంది. అదే సౌభాగ్యం! సాటి ఆడదాని మాంగల్యం!!

అనసూయకి పదిహేనో ఏటనే పెళ్ళి

## పోస్ట్‌మేన్‌లు దొంగలను పట్టుకుంటారక్కడ!

చతుర సమాచారం

యు.పి.ఎస్. అంటే యునైటెడ్ పోస్టల్ సర్వీస్. అమెరికాలో పోస్ట్‌మేన్‌లకి సంబంధించిన కొన్ని అరుదైన విశేషాలు.

✤ 2009లో అమెరికాలో పోస్ట్‌మేన్‌లని 2863 సార్లు కుక్కలు కరిచాయి. సగటున ఏడాదిలో రోజుకి తొమ్మిదిసార్లు!

✤ ఎర్ర కవర్ల మీద అడ్రస్‌లు రాయవద్దని యు.పి.ఎస్. విన్నపం. పోస్ట్‌మేన్‌లు వాటి మీద అడ్రస్‌ని చదవడానికి, ముఖ్యంగా రంగు సిరాతో రాస్తే చాలా కష్టపడతారు.

✤ పోస్ట్‌మేన్‌లు ఉచితంగా పోస్ట్ చేయాల్సిన ఫ్లాట్ రేట్ కవర్లని, బాక్స్‌లని, పోస్టాఫీసులకి ఇళ్లనించి తీసుకెళ్తారు.

✤ పోస్ట్‌మేన్‌ల జీతాలు ప్రజలు కట్టే పన్నుల నుంచి కాక, పోస్టల్ ఆదాయం నుంచే చెల్లిస్తారు.

✤ క్రెడిట్ కార్డ్, ఎలక్ట్రిసిటీ, వాటర్ బిల్స్ లాంటి కవర్లు దొంతరలో కింద, బంధుమిత్రులు రాసిన ఉత్తరాలు పైన పెట్టి పోస్ట్‌మేన్‌లు వాటిని పోస్ట్‌బాక్స్‌లో ఉంచుతారు.

✤ పోస్టాఫీస్ నుంచి ఎప్పుడు బయలుదేరాలి, ఎన్ని ఉత్తరాలు డెలివరీ చేసి, మళ్లీ ఎప్పుడు రావాలో సూపర్‌వైజర్లు నిర్దేశిస్తారు. వారి రూట్‌లోని మెయిల్ బాక్సుల్లోని బార్‌కోడ్‌లని స్కాన్ చేయాలి. అలా వారు ఎప్పుడు ఎక్కడ ఉన్నారో సూపర్‌వైజర్లు తెలుసుకుంటారు.

✤ పోస్ట్‌మేన్‌లు తపాలా బిళ్లలని దగ్గర ఉంచుకుంటారు. ఇళ్లల్లోని వారు అదనపు ఛార్జ్ లేకుండా కొనవచ్చు.

✤ వారానికి ఆరు రోజులపాటు సగటున 15 కోట్ల ఉత్తరాలని అమెరికన్ పోస్ట్‌మేన్‌లు బట్వాడా చేస్తుంటారు.




✤ పోస్ట్‌మేన్‌లు ఇళ్లల్లోని దొంగలని పట్టుకోవడం, కాలిపోయే కార్లలోంచి మనుషులని రక్షించడం, ఏక్సిడెంట్స్ చూస్తే పోలీసులకి ఫోన్ చేయడం, ఇంట్లో ఉండే ఒంటరి వృద్ధులు క్షేమంగా ఉన్నారా అని చూడటంలాంటి విధులు కూడా నిర్వర్తిస్తుంటారు.

✤ 110 డిగ్రీల ఉష్ణోగ్రత పెరిగితే, కొందరు అమెరికన్స్ పోస్ట్‌మేన్‌కి కోక్‌లాంటి చల్లటి డ్రింక్స్ ఇస్తుంటారు.

చేశారు, ఆమె తాతయ్య నానమ్మలు. చిన్నతనంలోనే తల్లిదండ్రుల్ని రోడ్డు ప్రమాదంలో కోల్పోయిన అనసూయని తాత, నానమ్మలే పెంచారు.

చూడచక్కని చుక్క కావడంతో పుష్పవతి కాగానే పెళ్ళి సంబంధాలు రావడం మొదలెట్టాయి. పదోతరగతి పరీక్ష పాసవగానే మంచి సంబంధం అని నిర్ధారించుకున్న హైదరాబాదు సంబంధం ఖాయం చేసి పెళ్ళి జరిపించారు.

ఐదేళ్లు కాపురం చేసినా పిల్లలు కలక్కపోవడంతో డాక్టర్లకు చూపించాడు తాతయ్య. వైద్యపరీక్షల్లో అనసూయ భర్తకి కొద్దిపాటి బలహీనత వున్నట్లుగా రుజువైనా, తాతయ్య విషయం దాచేసి 'అంతా' బాగానే వున్నట్లుగా అనసూయకు చెప్పి 'అవుతార్లే అమ్మా- పదేళ్ళకు కూడా పుట్టే వాళ్ళున్నారు' అంటూ ఉత్సాహపరిచాడు. కానీ విషయం నానమ్మ దాచలేకపోయింది. నోరు దాటితే ఊరు దాటుతుందని - అసలు విషయం అనసూయ భర్తకు తెలిసింది. అతను ఆ రాత్రే విషం సేవించి విగతుడైనాడు. ఆ పరిస్థితిలోనే అనసూయ నెలతప్పి గర్భం నిర్ధారణ అయింది. విషయం జీర్ణించుకోలేని అత్తమామలు అనసూయను పుట్టింటికి పంపే

శారు. తాతయ్య- ఇక చేసేది లేక మళ్ళీ అనసూయను అక్కున చేర్చుకున్నాడు. ఆ వైద్యపరీక్షలు చేయించింది తానే కావడం వల్ల ఆ పాపమంతా తనకే చుట్టుకుందని దానికి ప్రాయశ్చిత్తంగా అనసూయను, ఆమె ప్రసవించిన మగబిడ్డను కళ్ళలో వత్తులు పెట్టి చూసుకున్నాడు. మోహన్‌కి అట్లాగా.. తండ్రి అంటే ఎవరో తెలీని స్థితిలో పెరగాల్సి వచ్చింది.

మోహన్‌కి ఐదేళ్ళు వచ్చాక అనసూయ కాలేజీలో చేరి చదువు మొదలు పెట్టింది.

దాంతో అందరూ హైదరాబాదుకు మారిపోయారు.

అనసూయ సునాయాసంగా పీజీ వరకు చదివింది. కానీ ఆమె స్ఫురద్రూపం ఆమె స్వాతంత్ర్యానికి సంకెళ్ళు వేసింది. ఆమె 'విడో' అని, కొడుకు వున్నాడని తెలిసి కూడా ఎంతో మంది ఆమెకు ప్రపోజ్ చేశారు పెళ్ళికి. కానీ అనసూయ అసలు ఒప్పుకోలేదు.

అనసూయ అదృష్టం కొద్దీ ఆమె తాతయ్య చాలా యేళ్లు బతికాడు. దాదాపు తొంభై ఏళ్లకు ఆయన కాలం చేసినప్పటికీ, డెబ్బైయేళ్ల నానమ్మ ఆరోగ్యంగా వుండటం అనసూయకి ఊరట లభించింది.

మగతోడు లేకపోవడంతో అభద్రతా భావం మొదలై ఇండిపెండెంట్ ఇంటిని అమ్మేసి, సరూర్‌నగర్ చెరువు వ్యూపాయింట్‌గా వున్న ఒక మంచి అపార్ట్‌మెంట్‌లో ఫ్లాట్ కొనుక్కుని షిఫ్టయ్యారు అనసూయ, నానమ్మ, మోహన్.

భర్త మిగిల్చిన చేదు జ్ఞాపకాల్ని దిగమింగి- ఒకే ఒక తీపిగుర్తుగా మిగిలిన మోహన్‌ను కంటికి రెప్పలా కాపాడుకుంటూ కొడుకే లోకంగా బతుకుతోంది అనసూయ. నానమ్మకి పక్షవాతం వచ్చి చక్రాల కుర్చీకి పరిమితమై మాట కోల్పోయింది. మోహన్ చదువులో మంచి ప్రతిభ కనబరుస్తూ మెడిసిన్‌లో సీటు తెచ్చుకున్నాడు. అనసూయకి డబ్బు సమస్య ఏమీ ఉండేది కాదు. తాతయ్య బోల్డెంత ఆస్తిపాస్తులు మిగిల్చి వెళ్ళిపోయాడు. అందుకే అనసూయకి ఉద్యోగం చేసి డబ్బు సంపాదించవలసిన అగత్యం వుండేది కాదు.

అయినా పొద్దుపోక, టైం పాసు కోసం ఒక స్కూల్లో టీచర్‌గా చేరింది. ఆమెకు భర్త లేడని తెలిశాక పెళ్లయిన మగవాళ్ళు కూడా ఆమె మనసు దోచుకోవడానికి విశ్వ ప్రయత్నాలు చేసేవారు. స్కూళ్ళు మార్చినా, మొబైల్ నెంబరు మార్చినా ఎట్లా తెలిసేదో? ఏమో? గానీ- ఆమె బుర్ర అంతా మగ వేధింపులతో నిండి సతమతమయ్యేది. ఇక వల్లకాక ఉద్యోగాలు మానేసి ఇంట్లోనే వుంటూ టీవీకి అలవాటైంది. నానమ్మ చక్రాల కుర్చీలో, ఆమె సోఫాలో కూర్చుని, కదలకుండా టీవీ సీరియళ్ళు వందల వేల ఎపిసోడ్లు చూసేవారు.

ఆ సీరియళ్ళలోని స్త్రీ పాత్రల్లో తనను చూసుకునేది అనసూయ. అందులో తనకి ఎంతో సాంత్వన లభించేది.

ఇప్పుడామెకు మగతోడు లేదనే చింత అస్సల్లేదు.. కేవలం కోడలెలాంటిది వస్తుందో అన్న ఆత్రుత తప్ప!

స్వప్న:

పేరుకు తగ్గట్టే స్వప్న - కలలు కంటూ వుంటుంది. కానీ అవెప్పుడూ నిజమైన పాపాన పోలేదు. అందుకే కలలు కనడం ఆపేసి ఇంజినీరింగ్ చదువు మీద దృష్టి పెట్టి ప్రస్తుతం మంచి మార్కులు తెచ్చుకుంటోంది.

నగరంలో అత్యంత ప్రసిద్ధి చెందిన ఇంజనీరింగ్ కాలేజీలో మూడో సంవత్సరం చదువుతున్న స్వప్నకి చిన్నతనం ఇంకా పోలేదు. ఆమె మైండ్‌సెట్ అంతా ఎనిమిదో క్లాసు పిల్లలాగా వుంటుంది. దానిక్కారణం ఆమె తండ్రి వెంకటేశ్వర్లు.

వెంకటేశ్వర్లు తన ఏకైక కూతుర్ని మానసికంగా ఎదగనీయక పోవడానికి ఒకే ఒక పెద్ద కారణం.. స్వప్న ఎనిమిదో క్లాసులో వున్నప్పుడు తన భార్య చనిపోవడం!

నిజానికి చనిపోలేదు. కానీ - తండ్రీ కూతుళ్ళకి మాత్రం చనిపోయినట్టే. ఒకానొక రాత్రి నగానట్రా, బ్యాంకు ఎకౌంట్లలోని డబ్బు, పొలం అమ్మగా వచ్చిన డబ్బు మొత్తం తీసుకుని తన చిరకాల ప్రియుడితో రేవతి విమానంలో దేశం విడిచి అమెరికాకి పారిపోయింది. లేచిపోయింది? !

అప్పుడు స్వప్నకి అర్థమయ్యీ, అర్థంకాని వయస్సు. రేవతికి ముప్ఫై ఐదేళ్ళే. ఎటొచ్చి వెంకటేశ్వర్లే పెద్దోడు. అందుకే భార్యను అర్థం చేసుకున్నాడు. తల్లి చేసిన తప్పిదాన్ని కూతురికి అర్థం కాకుండా చేయడం తన బాధ్యతగా భావించి - ఆ క్షణం నుండీ కూతురిని ఎంతో గారాబంగా, కంటికిరెప్పలా పెంచాడు. దాంతో స్వప్న ఇంకా చిలిపి చిన్నారిగా వుండిపోయింది.

తొమ్మిదో తరగతికొచ్చాక స్వప్న మెచ్యూర్ అయ్యింది. అప్పుడు తల్లి లేని లోటు తెలియకూడదని - వెంకటేశ్వర్లు పడ్డ ఆపసోపాలు అన్నీ ఇన్నీ కావు. అపార్ట్‌మెంట్‌లో వున్న ఆడవాళ్ళందరి సహాయం అర్థించాడు. తన ఊరి నుండి చుట్టాల్ని అందర్నీ పట్టుకొచ్చి ఇల్లంతా పండగ వాతావరణం నెలకొల్పి స్వప్నకి ఊపిరి సలపనివ్వనికుండా, సమయం ఇట్టే గడిచిపోయేలా చేశాడు.

స్వప్నకి ఎంసెట్‌లో మంచి ర్యాంకు రాలేదు. అయినా మొదటి ర్యాంకర్ చేరిన కాలేజీలోనే డబ్బుతో సీటు కొనేసి చేర్పించాడు. కూతురికి తండ్రే ప్రపంచం. ఇంజినీరింగ్ కాలేజి బస్సులో అబ్బాయిలు ఏడ్పిస్తారేమోనని హోండా యాక్టివా కొనిచ్చి నడపడం తనే నేర్పించాడు.

స్వప్న తన బైక్ మీద కాలేజీకి సరిగ్గా డ్రైవ్ చేస్తుందో లేదోనని నమ్మకం కల్గేంత వరకు తను వేరే బండి మీద 'ఫాలో' అయ్యేవాడు- స్వప్నకు తెలీకుండా! స్వప్నకు తండ్రి ఎంత సౌకర్యం కల్పించినా - ఎక్కడో ఒకచోట - ముఖ్యంగా స్వప్న ఫ్రెండ్స్ వాళ్ళింటికెళ్ళినప్పుడు వాళ్ళ మమ్మీల్ని చూస్తే - అదోలా అన్పించేది. తనకీ అమ్మ వుండి వుంటే బాగుండేది అన్పించసాగింది.

కానీ- తనని కాదని వెళ్ళిపోయిన అమ్మను ఎలా వెనక్కి తెస్తుంది? సిగ్గుమాలిన పనిచేసిన ఆడది - అసలు 'అమ్మ' ఎలా అవుతుంది? తలకు నూనె రాసి జడ అల్లాల్సిన అమ్మ- తన కడుపులో నొప్పిని పంచుకోవాల్సిన అమ్మ - తన మనసులోని అసౌకర్యాన్ని కళ్ళలోంచి చూసే పసిగట్టాల్సిన అమ్మ- ఇప్పుడెక్కడుందో? ఏం చేస్తుందో? నాన్న ఏదంటే అది క్షణాల్లో తెచ్చిస్తాడు.. ఒక్క అమ్మని తప్ప.

ఇది తన దురదృష్టమా?

నాన్న దౌర్భాగ్యమా?

లేక అమ్మ కర్మనా? !

**వెంకటేశ్వర్లు:**

ఆ ఏడుకొండల వాడికి ఇద్దరైతే, తనకున్న ఒక్క పెళ్ళాం కూడా తనకి నచ్చిన వాడితో లేచిపోవడం - తనని ఎవరైనా వెంకటేశ్వర్లూ అని పిలిచినప్పుడల్లా గుర్తొస్తుంది.

కొత్తగాలి...

**పూర్వం**
**రానుపోనూ ఛార్జీలని**
**బాధపడేవాళ్లం!**
**ప్రస్తుతం సెల్‌లో**
**చార్జింగే పెద్ద బాధ!!**

– జి. శైలూషి, హైదరాబాద్

అయినా రేవతికి తానేం తక్కువ చేశాడని? ! అన్నీ ఎక్కువే చేసి నెత్తికెక్కించుకున్నాడు. తను ఒక ప్రైవేటు సాఫ్ట్‌వేర్ కంపెనీలో క్లర్క్‌గా పనిచేసేది. బూమ్ టైంలో ఆ కంపెనీ మెల్లిమెల్లిగా మల్టీనేషనల్ లెవల్‌కి విస్తరించింది. దాంతో రేవతికి మేనేజర్‌గా ప్రమోషన్ ఇచ్చాడు, ఆ కంపెనీ ఓనర్. అందరికీ తలలో నాలికలాగా మెలగడం - లొడలొడా వాగడం ఆమె ఎస్సెట్స్.

కంపెనీ వార్షికోత్సవ పార్టీలో ఓనర్ కొడుకు రేవతిని చూసి మనసు పారేసుకున్నాడు. అది మొదలు - విలాసవంతమైన హోదా పూరిత జీవనాన్ని ఇష్టపడి, రేవతి - ఊళ్ళో వ్యవసాయం చేసి, చేయించి, చిట్‌ఫండ్లు, రియల్ ఎస్టేట్స్ వ్యాపారం చేసే 'లో ప్రొఫైల్' వెంకటేశ్వర్లు మీద అయిష్టం పెంచేసుకుంది. తానొక ఆడపిల్ల తల్లి అనే విషయం మరచి - ఆదమరిచి - కంపెనీ వారసుడి దాసోహానికి గర్వపడింది. ఆ దాసోహం, ఆ దాహం.. తీరని మోహంగా పరిణామం చెంది - విడాకుల దాకా వెళ్ళింది.

ఇష్టం లేని భార్యతో కాపురం కష్టమని - గప్‌చుప్‌గా విడాకుల మంజూరుకు వెసులుబాటు కల్పించాడు వెంకటేశ్వర్లు. ఆ క్షణం నుండీ తన కాన్‌సంట్రేషన్ అంతా ఎదిగే కూతురిపైకి మరలించి, కంటికి రెప్పలా చూసుకుంటున్నాడు. డబ్బుకు లోటేమీ లేదు - కానీ.. కానీ.. తోడులేని ఎడబాటు జీవితం.. దుర్భరంగా వుంది.

ఊళ్ళోని చుట్టాలంతా మళ్ళీ పెళ్ళికి తలా ఒక సంబంధం తెచ్చినా - తన కూతురికి అమ్మలాంటి అమ్మాయి దొరక్క పెళ్ళి ఆలోచన వదిలేశాడు.

తనకి ఇప్పటికే యాభై ఏళ్ళొచ్చేసినై. స్వప్నకి ఇంకో ఏడాదితో ఇంజినీరింగ్ చదువై ఉద్యోగానికెళ్ళిపోతుంది. వెంటనే పెళ్ళిచేస్తే- తన బాధ్యత తీరిపోతుందని - వెంకటేశ్వర్ల ఫీలింగ్.




*మోహన్ ప్రేమకథ:*

అనసూయ ముద్దుల కొడుకు మోహన్‌కు మొహమాటమెక్కువ. తండ్రి లేని జీవితం గడపడం వల్ల బాధ్యత ఎక్కువగా ఫీలవుతుంటాడు. తల్లి మనసును కష్టపెట్టొద్దని తనకి ఇంజినీరింగ్ ఇష్టమైనా ఇంటర్లో బైపీసీని తీసుకున్నాడు. మెడిసిన్‌లో సీటు రాగానే తల్లి కళ్ళలో ఆనందం హద్దులు దాటడాన్ని చూసి తాదాత్మ్యం చెందాడు. ప్రతి విషయాన్ని తల్లితో షేర్ చేసుకుంటాడు. నానమ్మకు తలకు నూనెతో మర్దన చేయడం, కాళ్ళకు ఫిజియోథెరపీ చేయడం అతని దినచర్యలు.

తను బోల్డంత ఆస్తికి ఏకైక వారసుడని ఎరిగినా - ఏమాత్రం డబ్బును వృథాగా పోనివ్వడు. తల్లి బైక్ కొనిస్తానన్నా వద్దంటూ సిటీబస్‌లోనే తిరిగే సాధారణ జీవన విధానం అలవర్చుకున్న వినయ విధేయుడు. ఇలాంటి కొడుకంటే ఎవరికిష్టం వుండదు?

స్వప్న కూడా ఇష్టపడింది.

మోహన్, స్వప్నలు ఒకర్నొకరు చూసుకుంది సిటీ బస్‌స్టాప్‌లోనే. అప్పటికి స్వప్న ఇంకా హోండా బైక్ కొనుక్కోలేదు. కాలేజీకి కాలేజ్ బస్‌లో వెళ్ళేది. అది సిటీ బస్టాప్‌లోనే ఆగేది. ఆ బస్టాప్‌లోనే మోహన్ తన బ్యాక్‌పాక్ బ్యాగేసుకుని బస్సుకోసం ఎదురుచూసేవాడు.

స్వప్నని చూస్తే మోహన్‌కి బాగా తెలిసిన అమ్మాయిలాగా తోచేది. పదేపదే తల తిప్పి ఆమెను చూసేవాడు. అప్పుడప్పుడు స్వప్న కూడా మోహన్‌ని చూస్తూ దొరికిపోయేది. స్వప్న కాలేజ్ బస్ ఎక్కి వెళ్ళిపోయేదాకా, మోహన్ తన బస్సులన్నీ మిస్ చేసేవాడు. ఇట్లా జరిగిన కొన్నాళ్ళకి ఒక వారం రోజులు స్వప్న బస్టాప్‌లో కనబడ్లేదు. ఆ వారంలో మోహన్, తను స్వప్నను 'మిస్' అయ్యాడని రియలైజ్ అయ్యాడు.

'ఇది ప్రేమా? ఇన్‌ఫాట్యుయేషనా? జస్ట్ మిస్సా? '

ఇలా ఆలోచిస్తూ తన 'లేక్ వ్యూ' అపార్ట్‌మెంట్ చేరుకుని మెట్లెక్కబోతున్న మోహన్‌కి లిఫ్ట్ డోర్ తీసుకుని వస్తోన్న స్వప్న ఎదురైంది.

మోహన్ స్థాణువై నిల్చుని, ఆమెను చూస్తుండగా స్వప్న "హాయ్!" అంది.

"మీరు.. మీరు.. ఇక్కడ.." తడబడే స్వరంతో అడిగాడు మోహన్.

"ఆc ఇక్కడే.. రెండ్రోజుల కిందటే షిఫ్టయ్యాం. మీరూ ఈ అపార్ట్‌మెంట్లోనే వుంటున్నారా? "

"అఫ్‌కోర్స్! పదేళ్ళుగా. మాది 403, మీది? "

"304, పోయిన నెలలో ఆ ఫ్లాట్ ఖాళీ చేయించి, మేమే వచ్చేశాం"

"అయామ్ మోహన్! యం.బి.బి.యస్. ఉస్మానియా మెడికల్ ఫైనల్ ఇయర్ అండీ! మీరు? "

"స్వప్న! సిబిఐటిలో థర్డియర్ ఇంజినీరింగ్ ఎలక్ట్రానిక్స్! నైస్ మీటింగ్ యూ!"

ఆ తర్వాత రోజు మోహన్ వెళ్ళేసరికే స్వప్న బస్టాప్‌లో వెయిట్ చేస్తోంది. ఇద్దరూ పలకరించుకుని పక్కపక్కనే నుంచుని సైలెంట్‌గా ఉండిపోయారు.

రెండ్రోజులయ్యాక ఒక పోకిరోడు స్వప్నను చూసి కన్నుగీటి, విజిలేశాడు. అది గమనించిన స్వప్న నవ్వుకుని ఊర్కొని తన బస్సు రాగానే ఎక్కేసి వెళ్ళిపోయింది. మోహన్ వెంటనే ఆ పోకిరి దగ్గరకెళ్లి.. "అమ్మాయిలతో అట్లా అసభ్యంగా ప్రవర్తించడం కరెక్టేనా అండీ? " ప్రశ్నించాడు మర్యాద పూర్వకంగా.

"నన్నడుగుతున్నావా? నాకు చెప్తున్నావా? " తిరిగి ప్రశ్నించాడతడు.

"సభ్యత కాదని చెప్తున్నాను" కటువుగా అన్నాడు మోహన్.

"సభ్యత అంటే? "

"డీసెంట్‌గా.. అని అర్థం"

"అవునా? నేర్పించండి మరి నాకు" వెటకారంగా అన్నాడతను.

"మీ యింటికెళ్ళి అడగండి! మీ చెల్లినో, తల్లినో. అదే మీ చెల్లిని చూసి, నేను విజిలేసి కన్నుకొడితే మీరు ఊర్కునేవారా? "

"నాకు చెల్లిలేదు, అమ్మ ఎక్స్‌పయిర్డ్!"

మోహన్‌కి మండింది. వాడలా కావాలనే బిహేవ్ చేస్తున్నాడని అర్థమైంది.

"అయితే ఒక మగాడే వచ్చి నీకు కన్నుకొట్టి విజిలేస్తే ఏమనుకుంటారు? " ఆవేశంగా ప్రశ్నించాడు మోహన్.

"వాణ్ణి 'గే' అనుకుంటాను. నేను 'గే' కాదు కాబట్టి రెస్పాండవ్వను. మరి మీ అనుభవం ఏంటి? " వాడు నవ్వు బిగపట్టి తిరిగి ప్రశ్నించాడు.

మోహన్ కూడా నవ్వేశాడు. ఆ పోకిరే తిరిగి అన్నాడు..

"మీరు నన్ను ఇంటర్వ్యూ చేస్తున్నట్టుంది గానీ, బెదిరిస్తున్నట్టుగా లేదు! ఇంకెప్పుడు నేర్చుకుంటారు అన్యాయాల్ని ఎదిరించడం? "

"మీరేంటి సంఘ సంస్కర్తా? "

"కాదు, మఫ్టీలో వున్న పోలీస్ కానిస్టేబుల్! అమ్మాయిలను జాగ్రత్తగా మసలుకోమని పోకిరి డ్రిల్లు వేస్తున్నాను"

"మిమ్మల్ని ఎవరైనా కొట్టేస్తే? "

"కొన్నిసార్లు జనాలు మీదికొస్తారు.

చమత్కారం

# ఒంటికంటి మన్మధుడు



తిరుమలరాయ ప్రభువుకు ఒకటే కన్ను. చూడడానికి కొంచెం వికారంగా ఉంటాడు. అలాంటి ప్రభువులవారు- తనను పొగుడుతూ మంచి పద్యం చెప్పాలని ఆస్థానకవుల్ని కోరారు.

అంతే! ఓ కవిగారు తటాలున లేచి-

**అన్నాతి కూడ హరుడవు**
**అన్నాతిని కూడకున్న అసురగురుండౌ**
**అన్నా! తిరుమలరాయా**
**కన్నొక్కటి లేదుగాని కంతుడవయ్యా!!**

అంటూ ఆశువుగా ఓ పద్యం చెప్పారు.

ఒంటికన్నువాడిపై అదీ అతిశయంగా పద్యం చెప్పడమంటే కష్టమే! అందుకే ఆ కవిగారు ఓ పడతిని అరువుతెచ్చుకున్నారు. ఎలాగంటే- ప్రభువులవారి పక్కన ఓ అందమైన పడతిని ఊహించి చూస్తే- మొత్తం మూడు (ఆయనది ఒకటి + ఆమెవి రెండు) కళ్లు.

మూడుకళ్లుగలవాడు ఇంకెవరు? 'ముక్కంటి' గదా! అందుకే అన్నాతికూడ హరుడవు అన్నాడు. అంటే- 'అయ్యా ఆవిడతో కలిస్తే శివుడివి..'

'.. ఆవిడను తప్పించినా నష్టంలేదు. అప్పుడు నీకు ఒకటే కన్ను. అనగా సాక్షాత్తూ అసుర గురువైన శుక్రాచార్యుడివి' అన్నాడు. అంతటితో ఊరుకోలేదు.. 'అయినా తిరుమలరాయప్రభూ.. కన్ను ఒకటి లేకుంటేనేం? నువ్వు అచ్చంగా మన్మధుడివేనయ్యా' అన్నాడు. అదీ కవి చమత్కారం.

ఇంత పొగిడాక ప్రభువులవారు సంతసించకుండా ఉంటారా? ధనకనక వస్తువాహనాలు, మణిమాన్యాలు అందించకుండా ఉంటారా?

– చంద్రప్రతాప్

అప్పుడు మా ఐడి కార్డు తీస్తాం. లేదా తన్నులు తింటాం. కానీ అవి చప్పటి పస లేని దెబ్బలు. నీ వెనకాతల మరో ఇద్దరు కానిస్టేబుల్స్ కూడా నించుని వున్నారు చూడు! వాళ్ళొచ్చి కాపాడుతారు నన్ను"

మోహన్ వెనక్కి తిరిగి చూశాడు. ఓ ఇద్దరు తనవైపే చూస్తున్నారు- కొత్త మొహాలే!

ఇంతలో తన సిటీబస్ రావడంతో 'బై' చెప్పేసి బస్సెక్కాడు మోహన్.

ఆ మరుసటి దినం జరిగిందంతా స్వప్నకు చెప్పాడు. స్వప్న మోహన్‌ని పై నుంచి కింది దాకా ఓ లుక్కేసింది. పకపకా నవ్వింది.

"ఏం? ఎందుకు నవ్వుతున్నావు? "

"మీరింత ఇన్నోసెంట్ అనుకోలేదు మోహన్!" అంటూ మళ్ళీ నవ్వింది.

అర్థం కానట్టు చూశాడు మోహన్.

"వాడు నాకు రెగ్యులర్‌గా బీటేసే పోకిరోడు, గత ఏడాదిగా. ఫన్నీఫెలో"

మోహన్ నోరుతెరిచాడు.

ఒక ఆదివారం పొద్దుటే స్వప్న జాగింగ్ షూస్‌తో పార్క్‌వైపు వెళ్ళడం గమనించాడు బాల్కనీ నుండి- మోహన్.

తానూ షూ వేసుకుని పార్క్‌కు బయల్దేరాడు.

"హే..! స్వప్నా..! మీరు రోజూ జాగింగ్ చేస్తారా? "

"ఎస్..! మీరు? "

"నేను కూడా"

"మీరు ఎట్లాగూ డాక్టర్ కదా! మీరే వాకింగ్ చెయ్యకుండా పేషంట్లకెట్లా చెప్తారు, గుడ్ హాబిట్స్!"

ఇద్దరూ చాలాసేపు జాగింగ్ చేశారు. మోహన్‌కు శోష వచ్చేసింది.. అలవాటు లేని పనికదా! 'డి' బెంచ్ మీద కూర్చుని అలసట తీర్చుకుంటున్న మోహన్, పక్కనే కూర్చుని వున్న ఒక పెద్దాయన్ని కాజువల్‌గా చూశాడు.

"హలో! యంగ్ మాన్!"

"హలో..! సర్!"

"యు కెన్ కాల్ మీ 'తాతా'. నా మనవడంత సైజున్నావు. అయామ్ త్రినాథ్. నిన్నెప్పుడూ ఈ పార్క్‌లో, ఈ టైంలో చూళ్ళేదు. కొత్తగా స్టార్ట్ చేశావా బాబు? "

మోహన్ తనను పరిచయం చేసుకుని తన పార్క్ ప్రవేశం గురించి చెప్పి నవ్వాడు.

"నువ్వా యంగ్ గరల్‌తో నడుస్తూ ముచ్చట్లాడుతున్నప్పుడు గమనించాను. ఆ అమ్మాయికి లైనేస్తున్నావా? నీ వయసుకది సహజమే!" అన్నాడు త్రినాథ్.

మోహన్‌కేం మాట్లాడాలో తోచక, లేచి పార్క్ గేటు వైపు బయల్దేరుతుండగా..

"సారీ..! ఏమైనా తప్పుగా మాట్లాడితే.."

"లేదు.. లేదు.. తాతాజీ! అలసిపోయా.. ఇంటికెళ్తున్నా"

"ఎక్కడ వుండటం? దగ్గరేనా? డ్రాప్ చెయ్యాలా? కారుంది నాకు"

"అబ్బే! ఎదురుగా మా ఫ్లాట్, లేక్ వ్యూలో. థాంక్స్ తాతాజీ!"

మోహన్ వెళ్ళింతర్వాత స్వప్న చాలాసేపు పార్కులో పిల్లల్ని చూస్తూ గడిపింది. ఆమెను చూస్తూ త్రినాథ్ గడిపాడు.

ఆమె వెనకాలే తనూ పార్కు నుండి నిష్క్రమించాడు.

అది మొదలు.. ప్రతీరోజు మోహన్ ప్రియదర్శిని పార్కులో వాకింగ్ సభ్యత్వం కొనుక్కొని జాగింగ్ మొదలెట్టాడు. అప్పుడప్పుడూ స్వప్న కంపెనీ ఇచ్చేది. త్రినాథ్ మాత్రం రోజూ కనబడి కాసేపు మాట్లాడి 'నిత్యజీవితంలో వ్యాయామం.. నడక.. దాని ఆవశ్యకత' అనే టాపిక్ మీద లెక్చరిచ్చేవాడు. ఆ రకంగా స్వప్నకు కూడా త్రినాథ్‌తో పరిచయం ఏర్పడింది.

ఇంటర్నల్ ఎగ్జామ్స్ దగ్గరపడటం వల్ల మోహన్ జాగింగు, కాలేజీ గోయింగు మానేసి పడీ.. పడీ.. చదువుతున్నాడు.

స్వప్న, త్రినాథ్ కలిసి పార్కులో గ్రీన్ టీ సిప్ చేస్తూ మోహన్ గురించి మాట్లాడుకుని నవ్వుకుని.. మోహన్‌ను సర్‌ప్రైజ్ విజిట్ చేద్దామని నిశ్చయించుకుని ఓ రోజు 'లేక్‌వ్యూ'కి బయల్దేరారు.

★ ★ ★

403 తలుపు తీసినావిడ్ని చూసి త్రినాథ్ అవాక్కయ్యాడు.

పాత హిందీ సినిమా హీరోయినా? అన్నట్టున్న ఆవిడ్ని నోరెళ్ళబెట్టి అలాగే చూస్తుండటం- ఆవిడకి నచ్చలేదు.

"ఎవరు మీరు, ఏం కావాలి? " అనడిగింది అనసూయ, స్వప్నని- త్రినాథ్‌వంక చురచురా చూస్తూ.

"ఆంటీ! మాది 304. మోహన్ గురించి వచ్చాం. తను, ఈ తాతాజీ, నేనూ వాకింగ్‌మేట్స్‌మి" మెల్లిగా చిరునవ్వుతో చెప్పి త్రినాథ్ వైపు చూసింది స్వప్న.

త్రినాథ్ నోరు మూసుకుని తెరుకుని-

"మేడమ్! నైస్ మీటింగ్ యు, మీరు మోహన్ అక్కయ్యానా? మదరా? అనే కన్ఫ్యూజన్‌లో.. ఎనీ వే.. అయామ్ త్రినాథ్‌రావ్, హోమియో డాక్టర్, రిటైర్డ్ గవర్నమెంట్ ఆఫీసర్.." నమస్కారం చేశాడు.

అనసూయ వాళ్ళిద్దర్నీ లోనికి రమ్మని, సోఫాలో కూర్చోమని సైగ చేసి మోహన్ గదిలోకి వెళ్ళింది. కాసేపటికి టీషర్టు తగిలించుకుంటూ మోహన్ హాల్లోకి వచ్చి-

"వ్హాటె సర్‌ప్రైజ్! స్వప్న, తాతాజీ.. ఇట్లా నాకోసం వచ్చేశారు? పార్కులో బోర్ కొడుతోంది కదూ!" అన్నాడు తనూ సోఫాలో కూలబడుతూ. కాసేపు ఆ మాటా ఈ మాటా మాట్లాడాక స్వప్న త్రినాథ్ లేవబోయారు. "ఉండండి లెట్స్ హేవ్ సమ్ కాఫీ.. మా మమ్మీ చేతి కాఫీ సూపర్బ్" అంటూ మోహన్ కిచెన్ వైపు వెళ్ళి బైటికి వస్తూ-

"సారీ..! పాలు ఇప్పుడే తోడేసింది మమ్మీ.. నెక్స్ట్ టైమ్" అన్నాడు నిరాశగా.

త్రినాథ్‌కు పాలు ఎందుకు లేవో అర్థం అయ్యింది.

★ ★ ★

స్వప్న కాలేజీవాళ్ళు స్టడీ టూర్ ఏర్పాటు చేశారు. నార్తిండియాలో ఆగ్రా, ఢిల్లీ, హరిద్వార్, రూర్కీ మొత్తం పదిరోజుల ప్రోగ్రామ్. మొదట్లో వెంకటేశ్వర్లు తానూ వస్తానని భీష్మించుక్కూర్చున్నా.. స్వప్న తండ్రిని పదేపదే బతిమాలడంతో "సరే వెళ్ళు. కానీ పూటకొకసారి నాతో స్కైపులో మాట్లాడాలి" అనే కండిషన్ మీద శాంతించాడు.

అప్పటికే ఫేస్‌బుక్, వాట్సప్‌ల్లో స్వప్న, మోహన్ ఫ్రెండ్సయ్యారు. బోల్డన్ని

> **కొత్తగాలి...**
>
> **అప్సరసలా ఉంది**
> **అపార్ట్‌మెంట్ చిన్నది**
> **రోడ్డుమీదకు 'చెత్తబేగ్' విసిరింది**
> **చెత్తచెత్తగా ఉంది!**
>
> – జి. హెచ్. సంతోషి,
> బెంగళూరు

ఫొటోలు, వీడియోలు షేర్ చేసుకున్నారు. తాజ్‌మహల్, కుతుబ్‌మినార్, గంగాహారతి రుషికేశ్‌లోని లక్ష్మణఝూలా తదితర ఫొటోలు స్వప్న ఫేస్‌బుక్‌లో ఎప్పటికప్పుడు అప్‌లోడ్ చేయగా ఆమె డాడీ, మోహన్, అనసూయ కూడా అవన్నీ చూసి ఆనందించారు.

ఉన్నట్టుండి ఒక ఉపద్రవం. వెంకటేశ్వర్లుకు బైక్ యాక్సిడెంటయ్యింది. మలక్‌పేట యశోద ఆస్పత్రిలో పోలీసులు అతన్ని చేర్పించారు. కుడికాలు, ఎడమ చెయ్యి ఫ్రాక్చరై తలకి చిన్నపాటి గాయమైంది. తండ్రి తన ఫోన్ కాల్ తీసుకోకపోవడంతో స్వప్న కంగారుపడి మోహ

న్‌ను వాకబు చేసింది. 304 తాళం వేసి వుండటంతో వాచ్‌మెన్‌ని అడిగి వెంకటేశ్వర్లుకు యాక్సిడెంటయిన విషయం తెల్సుకున్నాడు మోహన్. హుటాహుటిన ఆ ఆస్పత్రికెళ్లి వెంకటేశ్వర్లును కలుసుకుని పరామర్శించాడు. కట్లు తప్ప ఆయన పరిస్థితి బాగానే వుంది.

"బాబూ! మోహన్..! " పిలిచాడు వెంకటేశ్వర్లు.

"ఉత్త 'మోహన్' అనే పిలవండి సార్! 'బాబూమోహన్' కాదు.." నవ్వాడు మోహన్- పక్కనే వున్న కేరళ నర్సు వంక క్రీగంట చూస్తూ.

"సరే.. ఉత్తమోహన్.." అని వెంకటేశ్వర్లు అనంగానే అక్కడున్న అందరూ నవ్వేశారు. అందులో డాక్టర్ నరోత్తమరెడ్డి, దగ్గరుండి అంతా మేనేజ్ చేస్తున్నాడు. నరోత్తమ్‌ను, మోహన్ పరిచయం చేసుకుని హాస్పిటల్‌లో రాత్రిపూట తాను చూసుకునేలా వెంకటేశ్వర్లును ఒప్పించగలిగాడు. యాక్సిడెంట్ విషయం విని షాక్ తిని కన్నీరు మున్నీరై విలపిస్తున్న స్వప్నను వెంకటేశ్వర్లుతో స్కైప్‌లో మాట్లాడించి ఊరడించాడు. టూర్ ఎలాగూ రెండ్రోజుల్లో అయిపోతుంది.. కాబట్టి అందరితోపాటే వచ్చేయమని కన్విన్స్ చేశాడు స్వప్నని.

వెంకటేశ్వర్లుతో ఆ రాత్రంతా వున్నాడు మోహన్. "నీకెందుకయ్యా ఈ శ్రమ! నువ్వు ఇంటికెళ్ళిపో..! ఇక్కడ రాత్రింబగళ్ళూ నర్సులు, డాక్టరు.. పైగా నరోత్తమ్ ఎప్పుడూ ఒక ఫోన్ దూరంలో.. ఇంక నువ్వెందుకు రిస్కు పడటం? " అని సముదాయించబోగా, మోహన్ అస్సలు ఒప్పుకోలేదు.

టూర్ నుండి స్వప్న తిరిగి వచ్చేకే వెంకటేశ్వర్లును డిశ్చార్జి చేశాడు- నరోత్తమ్. ఇంకా ఆరువారాల బెడ్ రెస్ట్ తప్పనిసరిగా పాటించాలని సలహా ఇచ్చి, ఆ 'రెస్టు'-హౌస్ అరెస్టుగా అమలుచేసే పూచీ మోహన్‌కు అప్పగించాడు నరోత్తమ్.

మోహన్‌కు ఇంతకంటే మంచి ఛాన్సేం దొరుకుతుంది.. స్వప్నను వాళ్ళింట్లోనే కలుసుకోవడానికి? ! స్వప్న వాళ్ళడాడీని ఇంప్రెస్ చెయ్యడానికి అఫీషియల్‌గా ఛాన్సు లభించినందుకు నరోత్తమ్‌కి లక్ష థ్యాంక్సులు చెప్పాడు మనసులోనే.

మోహన్‌లో వున్న అమాయక ముఖం, కష్టపడే తత్వం, నవ్వించే గుణం వెంకటేశ్వర్లుకు నచ్చాయి. అందుకే మోహన్ తనని చూడ్డానికి వచ్చినప్పుడల్లా సంతోషంగా ఆహ్వానించి పక్కనే కూర్చోబెట్టుకుని మాట్లాడేవాడు. స్వప్నతో టీ, కాఫీ, టిఫిన్ చేయించి కలిసి తీసుకునేవాడు. వంటమనిషిని పురమాయించి, స్పెషల్ డిన్నర్లు తయారుచేయించేవాడు.

స్వప్న కాలేజ్‌కి లేటుగా వెళ్ళి, త్వరగా బయల్దేరే వీలు కల్పించడానికి కొత్త హోండా యాక్టివాను బుక్ చేసిన వెంకటేశ్వర్లును, మోహన్ చిరుకోపంతో మందలించాడు "అంకుల్..! మీరే బైక్ యాక్సిడెంటయ్యి ఇంట్లో పడుకున్నారు. మళ్ళీ స్వప్నకు కూడా ఇంకో బైకెందుకు? అసలే తనకి నడపడం రాదు. చూశారుగా..! ఈ హైద్రాబాద్‌లో బండి నడపాలంటే ఎంత కష్టమో! ప్లీజ్ మీ ఆలోచన మార్చుకోండి. కావాలంటే ఒక డ్రైవర్‌ను పెట్టి మీ కారే ఇవ్వండి" అన్నాడు.

కాసేపు నిశ్శబ్దం తర్వాత, నవ్వి.. వెంకటేశ్వర్లు ఇలా అన్నాడు.. "అదే తప్పు! యాక్సిడెంటనేది నేను పెట్టుకున్న డ్రైవర్ మాత్రం చేయడా? జరిగేది జరక్కమానదు. 2014లో మూడు మలేషియా విమానాలు ప్రమాదానికి గురయ్యాయి. అంత మాత్రాన అక్కడ ఎయిర్ పోర్టులు మూసేశారా? స్వప్న నాకు ఏకైక దిక్కు ఈ ప్రపంచంలో. ఇప్పటికే బాగా గారాబం చేసి ఫ్రీడం ఇవ్వకుండా పెంచాను. ఇకమీదట అట్లా వుండదల్చుకోలేదు. అందుకే తనకేం కావాలో అడిగి - చేస్తున్నా. తనకి

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, నవలావలోకనం ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ జులై 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసున ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 -23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

వంటలు యిష్టం. అందుకే వంట మనిషి వున్నా కూడా తననే వండమంటున్నా. తనకి డ్రైవింగ్ ఇష్టం. నేనే డ్రైవింగ్ నేర్పించి తనకి, బైక్ మీద తిరిగే కోరిక తీరుస్తా. ఇక కారు అంటావా, చదువుకునే పిల్లలు.. డ్రైవర్ వున్న కార్లో తిరగడం అంతస్తును సూచించేదే తప్ప అంత అవసరం కాదని నా ఉద్దేశ్యం. రోడ్లు నిజమే, బాగాలేవు. ప్రమాదం ఎక్కడైనా పొంచి వుంటుంది, మన బాత్రూంలో కూడా! దాని గురించి భయపడితే ఇంక జీవితం అల్మారాలో బంధించుకోవాల్సిందే!"

ఆయన చెప్పింది బానే వుంది.

"కానీ.. అంకుల్! మీరు తనకి బైక్ నేర్పించాలంటే ఇంకా నడవడానికే మీకు నాలుగు వారాలు పడుతుంది" - ఏదో అనబోయాడు మోహన్.

"అయితే? నేర్చుకునేటప్పుడు నేను వెన కాతల ఎక్కి నేర్పించాలని రూలేమైనా వుందా? ఏం అవసరం లేదు! తనకి సైకిల్ బాలన్సింగ్ వచ్చు. అయినా ఓ రెండు మూడుసార్లు బండి సైడుకి ఒరిగినా ఏం జరగదు. తనకే అలవాటవుతుంది. నేను జస్ట్ అబ్జర్వేషన్ చేస్తా. గైడెన్స్ ఇస్తా. అది చాలు నా ముద్దుల కూతురికి" వివరించాడు ఆ తండ్రి.

"మీరు భలే కొత్తగా ఆలోచించారు అంకుల్!" మెచ్చుకోలుగా అన్నాడు మోహన్.

"జీవితం- అది- నేర్పించింది బాబూ, నాకు" ఆయన కళ్ళలో చెమ్మ.

ఎందుకో వున్నట్టుండి ఆ రాత్రి వెంకటేశ్వర్లు తన కూతుర్ని దగ్గరికి తీసుకుని బాగా ఏడ్చాడు - గుక్కపెట్టి.

"మమ్మీ గురించే కదూ నాన్నా?" సముదాయించబోయింది స్వప్న.

"అదేం కాదమ్మా! తల్లి లేకుండా పెద్దదా నివవుతున్నావు. ఈ వయస్సులో నీకు తల్లి అవసరం, తండ్రి అవసరం కంటే ఎక్కువుంటుందమ్మా. మీ అమ్మను నేను నీ కోసం అట్టిపెట్టలేకపోయాను క్షమిం చమ్మా!" అంటూ వలవల ఏడ్చాడు.

అవును. ఎవరు కాదన్నా, ఎంత ఓర్చు కున్నా అదో చేదునిజం. తల్లి పాత్రకు ఏ అవార్డులు, రివార్డులు రాకపోయినా అవస రానికి మాత్రం తల్లి వుండి తీరాల్సిందే. స్వప్న ఎంత అల్లరి పిల్లలా ప్రవర్తించినా ఆఖరికి అమ్మలేని లోటు గురించి కూడా బాధపడుతుందన్నది నిజం. కానీ తను బాధపడుతోందని తెలిస్తే నాన్నకు గుండె పగిలి, రగిలిపోతుందని ఆ మింగుడు పడని రాళ్ళను దిగమింగి, నొప్పిని బయటికి కనబడనీయకుండా కడుపులోనే దాచుకుంటుంది. భగవంతుడా! ఒకరు చేసే తప్పుకు ఇద్దరు బలయ్యేలా కుటుంబ బంధాల్ని, సామాజిక అనుబంధాల్ని ఎందుకు కల్పించావయ్యా!

★ ★ ★

అంతా విని నిరోషా నిట్టూర్చింది.

"ఊ..ం! అయితే పార్క్‌కెళ్ళి మీరు సిని మాకు కథను తయారు చేసుకుంటున్నార న్నమాట!" అంది అదోరకంగా.

"అది నిజంగా జరిగిందే! కాకపోతే కథ సగమే తెలిసింది. ఆ తర్వాత ఏం జరి గిందో చెప్పడానికి త్రినాథ్ కనబడట్లేదు!" నిరాశగా నిరోషాతో అన్నాన్నేను.

"అయ్యో పాపం! అనసూయగారి ఇంటి కో, ఆ వెంకటేశ్వర్లు ఇంటికో వెళ్ళకపో యారా? " వెక్కిరించింది మా ఆవిడ.

"మంచి ఐడియా! అంతదాకా ఎందుకు! మోహన్‌నే ధైర్యం చేసి అడిగేయాలి. అతను రోజూ కన్పిస్తున్నాడు"

"త్రినాథ్‌గారికి ఫోన్ చెయ్యక పోయారా? వాళ్ళిల్లు ఎక్కడ? "

"ఏమో! ఆయన మొబైల్ నెంబర్ తీసు కోవాలనే ఐడియా తట్టనే లేదు. ఇల్లు సంగతి సరేసరి! మోహన్‌ను రేపు అడి గేస్తా - త్రినాథ్ తాతాజీ పార్క్‌కు ఎందుకు రావట్లేదోనని!" సాలోచనగా చెప్పాను.

"పోస్లెండి! త్రినాథ్‌గారి దెబ్బకి మీకు వాకింగ్ అలవాటయ్యింది. 'పార్కో.. పార్కో..' అని కలవరిస్తున్నారు. లేకపోతే పొద్దున్నే లేచిందగ్గర్నించి కాలేజీకెళ్ళే వరకు ఆ న్యూస్‌పేపర్లు బట్టీ పట్టడమే సరిపోయేది మీకు" అంది నిరోషా కిలకిలా నవ్వేస్తూ.. నేనూ జత కలిపాను.

మర్నాడు పొద్దున్నే నేను రెండు ప్రశ్నల అలారం నా మదిలో మోగగా లేచాను. మొదటిది మోహన్ లవ్ స్టోరీ ఎందుకు ఫెయిల్/ సక్సెస్ అయింది? రెండోది, అసలు త్రినాథ్ పార్క్‌కెందుకు డుమ్మా కొడుతున్నాడు? ! నాకు మిగతా స్టోరీ చెప్పాల్సి వస్తుందనయితే కాదనుకుంటా. మరయితే ఎందుకు? కళ్ళముందే మోహన్ కనబడుతున్నా 'ఆ తర్వాతేమ యింది? ' అని ఎందుకు అడగలేకపోతు న్నాను? 'నీకెందుకయ్యా! నీ పని నువ్వు చూసుకో!' అంటాడనా? ఏమో, అన్నా ఆశ్చర్యం లేదు!

రచయితగా పరిచయం చేసుకుని అడి గితే? అస్సలు చెప్పడు! కానీ.. చెప్పే ఛా న్సూ లేకపోలేదు.

కాకపోతే త్రినాథ్‌లాగ వివరించి చెప్పలే కపోవచ్చు.

'అయినా మీకేంటి మా స్టోరీ మీద ఇంత ఇంట్రెస్టు? ' అంటాడేమో?

నేను వాకింగ్ చేస్తున్నానన్న మాటేగానీ, ఆలోచనలన్నీ మోహన్ వెనకాతలే పరిగె త్తుతున్నాయి. మోహన్ నా వంక చూసి నప్పుడు పలకరింపుగా నవ్వుమొహం పెడుతూనే వున్నా అందులో సాన్నిహి త్యపు చూపు లేదు. అందుకే అతన్ని కదిపే ప్రయత్నం చేయజాలకున్నా.

ఛ! ఆ వెంకటేశ్వర్లుకు వాకింగ్ చేస్తే మంచిదని తెలీదా? ఇల్లెదురుగా పెట్టుకుని పార్కుకి రానీకే ఎందుకంత బద్ధకం? అసలు వాకింగ్ చెయ్యనోళ్ళందరికి రెండు కాళ్ళు కలిపి కుట్లేశేయాలి! ఆc...

పోనీ ఆ 304కి 403కి వెళ్ళేసి అసలేమయ్యిందని డైరెక్టుగా అడిగితే? తంతే చెరువులో పడతానేమో? వద్దులే! మోహన్‌తో పరిచయం వుంది కాబట్టి త్రినాథ్ నెంబరడిగి కాల్‌చేద్దాం.. ఎస్.. ప్రస్తుతం ఇంతకంటే ఏ ఛాన్సూ లేదు.

"బాబూ మోహన్! కొంచెం ఆ స్పీకర్లు తీస్తే నీతో మాట్లాడాలి. ఎందుకంటే చెవుల్లో ఆ పాటలు మోగుతుంటే నేను చెప్పేదాని మీద నీకు అంతగా కాన్‌సంట్రేషన్ వుండదు!" అన్నాను మోహన్ దారిన టకాయించి.

"సర్..! బాబూమోహన్ అని పిలవకండి! ఉత్త.. సారీ, 'మోహన్' అనే మూడక్షరాల ముద్దుపేరే పిలవండి. ఇంకోటి ఏంటంటే.. నేను చెవుల్లో వినేది పాతాలు. యూ ట్యూబ్‌లో మా మెడికల్ ఆడియో లెక్చర్సు వింటాను- అట్లా నాకు చాలా టైం సేవ్ అవుతుంది. చెప్పండి నన్నెందుకాపారు? " మోహన్ చాలా స్పష్టంగా, సూటిగా మాట్లాడాడు.

త్రినాథ్ చెప్పినట్టుగా ఇతడు అమాయకుడు కాదు.

"ఓకే..! మోహన్! త్రినాథ్‌గారు.. అదే నువ్వు 'తాతాజీ' అని విష్ చేశావే, ఆయన నాకు.. నువ్వు మోహన్ అనీ, నువ్వో మెడికల్ స్టూడెంటువనీ చెప్పారు. ఆయన మొబైల్ నెంబరు కావాలి. తను వాకింగ్‌కు ఎందుకు రావడంలేదో అడగాలి!" ఏకరువు పెట్టాను నా బాధని.

మోహన్ కాసేపు ఆలోచించాడు. జుట్టు గోక్కొని "మీరంటుంటే నాకు గుర్తుకొస్తోంది. నేనసలు ఆయన నెంబరే తీసుకోలేదు. బాగానే పరిచయం. కలిసి టీ కూడా తాగుతుంటాం. కానీ- మొబైల్ నెంబరు అవసరం ఎప్పుడూ పడలేదు!" తటపటాయిస్తూ చెప్పాడు మోహన్.

'ఆ తర్వాతేమయ్యింది అని అడగాలంటే' - త్రినాథ్ నాకు చెప్పిందంతా రిపీట్‌చెయ్యాలి. అది మోహన్‌కు నచ్చక, చిరాకు తెప్పించొచ్చు. త్రినాథ్ కనబడ్డప్పుడు 'ముసలోడా ఏం వాగావురా మా గురించి? ' అని దిష్టితీయొచ్చు...

అయినా నాకర్థం కాదూ.. లవ్‌స్టోరీలన్నీ మహా అయితే సక్సెస్ అవుతాయి. లేదంటే ఫెయిలవుతాయి. ఎన్ని నవలలు, సినిమాలుగా రావట్లేదూ? ! దీన్ని తెల్సుకోవడం కోసం ఎందుకింత ఆరాటం?

కానీ- త్రినాథ్ ఒకమాటన్నాడు. సక్సెసో, ఫెయిలో అర్థం కాలేదని!! తనవల్ల ఏదో మలుపు తిరిగిందని..?

ఎలాగబ్బా?

★ ★ ★

నేను రోజూ క్రమం తప్పకుండా ప్రియదర్శిని పార్క్‌కెళ్తున్నాను. నాకు ఇప్పుడు వాకింగు బాగా అలవాటైంది. ఎగ్గొట్టాలంటే ఎలాగో అన్పిస్తోంది. త్రినాథ్‌గారి పుణ్యమా అని ఇదేదో బానే వుంది. ఇంకా చెప్పాలంటే మాయావిడే త్రినాథ్‌తో కుమ్మక్కయి ఇట్లా నాకు వాకింగ్ అలవాటు చేయించిందా? అనే సందేహం కూడా కలక్కపోలేదు.

నిరోషాకి ఇట్లాంటి ప్రాంక్‌లు సరదా.

పెళ్లయిన కొత్తల్లో నా షర్టు, పాంటు ధరించి డోర్ తీస్తూనే నా ఎదురుగా నుంచునేది. నన్ను అవాక్కు చేసి పడీ పడీ నవ్వేది. ఇంకోసారి దండెం మీద ఆరేసిన చీర లాగి చుట్టుకుని చీర విప్పేస్తున్నట్లుగా నన్నాశపెట్టి మరో రంగు చీరలో ప్రత్యక్షమై కళ్ళెగరేసేది. కానీ మా పాప పుట్టాక ఇలాంటివెన్నడూ చేయలేదు. తన శ్రద్ధ అంతా కూతురి మీదకు మళ్ళించింది. విచిత్రమేంటంటే మధులిక కూడా ఈ

ప్రాంకులు పుణికి పుచ్చుకునే పుట్టింది.

ఒకసారి బట్టల కప్‌బోర్డ్‌లోకి ఎక్కి దాక్కుని తల్లిని నానా హైరానాకి గురిచేసింది. ఖాళీ పాలగిన్నెలో సుద్దముగ్గు నీళ్ళలో కరగేసి అమాయకంగా పొయ్యిపక్కన పెట్టింది - మధు, కొంచెం పెద్దయినాక. నిరోషా దాంతో టీ కాచుకుని తాగబోయింది. పకపకా నవ్వుతోన్న మధును, కోపంగా వాయించబోతుంటే నేను అడ్డంపడి నిరోషా వంక ఒక రింగు రింగుల చూపు చూశాను. ఫ్లాష్ బాక్ గుర్తొచ్చి - నిదానించింది.

కానీ- మధులిక మొట్టమొదటిసారి కడుపు నొప్పి అని చెప్పినప్పుడు కూడా దాన్ని 'ప్రాంకు'గా తీసుకోలేదు నిరోషా. అదే తల్లి మనసు! వెన్నెలకన్నా హాయి, తేనెకన్నా తీయనిది, ఐస్‌క్రీం అంత సున్నితమైన దేదయినా వుందంటే అది అమ్మ మనసే.

వారం తర్వాత...

ఒకరోజు నాకు పార్కు క్యాంటీన్ దగ్గర నుంచుని టీ జుర్రుతోన్న మోహన్ కన్పించాడు. అతని కూడా ఒక అమ్మాయి జాగింగ్ డ్రెస్‌లో వుంది. నేను కాజువల్‌గా వాళ్ళను సమీపించాను. నన్ను చూసి మోహన్ పలకరింపుగా నవ్వేడు. కానీ ఆ నవ్వులో 'దగ్గరి తనం' నాక్కన్పించలేదు.

"టీ? " అడిగాన్నేను ఆ అమ్మాయి వంక చూస్తూ.

"యా! గ్రీన్ టీ అంకుల్!"

"అంటే? " తెలియనట్టు నటిస్తూ అడిగాను. నా వుద్దేశ్యం మామూలు టీకి గ్రీన్ టీకి తేడా యేంటని? మోహన్ అందుకుని చెప్పడం మొదలెట్టాడు.

"మనం ఇంట్లో వాడే టీ పౌడర్ నల్లగా వుంటుంది కదా! దాన్ని బ్లాక్ టీ అంటారు. కానీ ఈ గ్రీన్ టీ తయారీ విధానంలో ఆకుల్ని తక్కువ ప్రాసెసింగ్ చేస్తారు. తక్కువగా ఆక్సీకరణ చెందడం వలన బ్లాక్ టీగా మారదు. గ్రీన్ లేదా బ్రౌన్ కలర్‌లోనే వుండి అధిక పోషకాల్ని కలిగి వుంటుంది. పాలీఫినాల్స్, ముఖ్యంగా ఎపిగాలో కాట్చిన్ గాలేట్ (ఇ.జి.సి.జి.) అనే యాంటీ ఆక్సిడెంట్ మన శరీరంలో అనునిత్యం తయారయ్యే హాని కారక ఫ్రీరాడికల్స్‌ని నిర్వీర్యం చేస్తుంది. క్యాన్సర్, షుగర్, హార్ట్ ఎటాక్ లాంటి జబ్బుల్ని నివారించడమే కాక బరువు తగ్గించి, మెమొరీ పెంచుతుంది. అందుకే అందరూ గ్రీన్‌టీని విచ్చలవిడిగా తాగాలి!"

"మరి గ్రీన్ టీని అందరూ ఎందుకు తాగట్లేదు? "

"మనం తరతరాలుగా పాలు, చక్కెరతో కూడిన బ్లాక్ టీని తాగుతూ వస్తున్నాం. దాన్నే మనం టీగా భావిస్తాం. గ్రీన్ టీ చేదుగా వుంటుంది. పైగా పాలు కలపడం కుదర్దు. అందుకే జనంలోకి ఇంకా చేరలేకపోయింది" వివరించాడు మోహన్.

"వాకింగ్ ప్లస్ గ్రీన్ టీ - గుడ్ కాంబినేషన్ అంకుల్!" అంది ఆ అమ్మాయి నన్ను చూస్తూ.

"హలో! అయామ్ అశోక్ రాణా, తెలుగు లెక్చరర్, బేగంపేట్ డిగ్రీ కాలేజ్, మీరో? "

ఆ అమ్మాయి నాకు షేకాండ్ ఇచ్చి "నా పేరు స్వప్న.. ఇంజినీరింగ్ ఫైనల్ సెమిస్టర్, సిబిఐటీ"

"సిబిఐటి అంటే..? "

"హాపీడేస్ సినిమా తీశారు కదా! అదే మా కాలేజ్ అంకుల్!"

"మీరిద్దరూ..? " అన్నాను మోహన్ వంకా, స్వప్న వంకా చూస్తూ.

కొంచెం గ్యాప్ తీసుకుని మోహన్ వంక చూస్తూ చెప్పింది స్వప్న.. "కజిన్స్!" ఆ పదం వినగానే మోహన్ గొంతు పొరబోయి దగ్గాడు.

కజిన్ అనే పదం చాలా కన్ఫ్యూజింగ్.

చాలారకాల సంబంధీకుల్ని కజిన్ అనే గంప కింద కమ్మేయొచ్చు. మోహన్ స్వప్నకు బై చెప్పి జాగింగ్ ట్రాక్ మీదకి దూకి వెళ్ళిపోయాడు.

నేను గ్రీన్‌టీకి ఆర్డర్ చేస్తుండగా స్వప్న కూడా మాయమైపోయింది.

★ ★ ★

నడుస్తూ, పార్కు నుంచి ఇంటికెళ్ళే దారి మళ్ళించి సరూర్‌నగర్ చెరువు కట్ట కిందుగా వున్న రోడ్డులోకి ప్రవేశించాను. అక్కడ్నుంచి వరుసగా బోలెడన్ని అపార్ట్‌మెంట్లు చెరువు వ్యూ పాయింట్‌గా కట్టినవి వున్నాయి. అందులో లేక్‌వ్యూ అని పేరున్న అపార్ట్‌మెంట్ కోసం వెదుకుతూ నడుస్తున్నాను.

అందులో మొత్తం మూడు అపార్ట్‌మెంట్లకి లేక్‌వ్యూ అని పేర్లున్నాయి.. లేక్‌వ్యూ పాయింట్ బ్లాంక్, లేక్‌వ్యూ బృందావన్, సరూర్ ప్రైడ్ లేక్‌వ్యూ! ఆ మూడింట్లో ఏది మోహన్ వాళ్ళదో కనిపెట్టడం ఎలా? ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నాను.

మధులిక స్కూల్‌కి రెడీ అవుతోంది. ఎనిమిదో తరగతికి పుస్తకాలు పెరిగి స్కూలు బ్యాగు బియ్యం సంచీ అంత బరువుకు చేరుకుంది. చిన్నప్పట్నించీ బరువైన బ్యాగులే మోయడం వల్లనేమో బ్యాగు బరువు గురించి పిల్లలు బెంగపడట్లేదు. బ్యాగు మీద ఏయే డిజైన్లుండాలో, ఏయే స్టిక్కర్లు అంటించుకోవాలో తెలీకే సతమవుతుంటారు!

★ ★ ★

ఆర్ట్ సినిమాల ప్రభావమో లేక నాకు స్వతహాగా నచ్చుతాయో ఏమో గానీ, నాకు రైలు ప్రయాణాలంటే బాగా ఇష్టం. వీలయినంత వరకు సిటీబస్సు, కారు, బైకు వాడకుండా ఎం.ఎం.టి.ఎస్. రైలులో బేగంపేట వెళ్ళడానికే ఇష్టపడతాను. ఆ రైలు కూత, ఇంజన్ శబ్దం, రైల్ స్టేషను, పల్లీ, బఠాణీ, చాయ్‌లు అమ్మే వాళ్ళ అరుపులు నన్ను ఏదో మత్తులో వుంచుతాయి.

## చిన్నప్పటి కల నెరవేరింది!



**డా. జి. సురేష్‌బాబు**

చతుర, విపులల్ని చిన్నప్పటి నుంచి చదువుతున్నాను. 2004 నుంచి రాయడం మొదలెట్టినా, 'చతుర'లో నా రచన అచ్చవటంతో చిన్నప్పటి ముచ్చట తీరింది. వైఫై, యఫ్.బిలతో నిరంతరం కనెక్టయ్యివున్న యువతరం తెలుగు సాహిత్యం వైపు కూడా తొంగిచూసేలా చేయాలని కంకణబద్ధుణ్ణయి రచనలు చేస్తున్నాను. 'అడిగినంత జాబిలొస్తె వెన్నెలెలా ఔనులే, కలే కనులే, హాలీవుడ్ మూవీ- ఎ క్విక్ రెంటల్ గైడ్, హృదయంలో ఉదయం, డాక్టర్స్ కాలేజ్' అనే పుస్తకాలు వెలువరించాను. పలు దిన, వార పత్రికల్లో నా కథలు అచ్చయ్యాయి. వృత్తిపరంగా వైద్యుణ్ణి. మెడికల్ కాలేజీలో బయోకెమిస్ట్రీ బోధకుడిగా, ఛాతి వ్యాధుల నిపుణుడిగా తృప్తిగా ఉన్నా. రచయితగా వచ్చే గుర్తింపు, సంతృప్తి ఎక్కువ ఇష్టం.

నాకు తారసపడ్డ సమాజంలోంచి కథను సందేశాత్మకంగా తయారుచేసి మీ ముందుంచాను. బహుశా మీకూ ఈ పాత్రలు ఇక మీదట తారసపడొచ్చు. అప్పుడు మీకు ఈ నవల ఒక్కక్షణం గుర్తొచ్చినా నా ప్రయాస ఫలించినట్లే!

చిరునామా:

డా. జి. సురేష్‌బాబు
అసిస్టెంట్ ప్రొఫెసర్,
బయోకెమిస్ట్రీ డిపార్ట్‌మెంట్,
నీలోఫర్ ఆసుపత్రి, రెడ్‌హిల్స్,
హైదరాబాద్-500004

రైళ్ళలో అడుక్కుతినే వాళ్ళు, స్వీపర్లు, ప్రయాణికులు, టికెట్టు ఎగ్జామినర్లు.. ఆ ప్రత్యేకత.. బస్సు ప్రయాణాల్లో మనకి తారసపడదు.

ఇంకా ప్రత్యేకం ఏంటంటే ఓ రోజు..

నా ఎదురుగా స్వప్న!

"హలో స్వప్నా!"

"హలో సార్! నా పేరు మీకు భలే గుర్తుందే! మీరు అశోక్‌గారు - లెక్చరర్ కదూ! నేనూ మర్చిపోలేదు"

"ట్రైన్లో ప్రయాణం ఎక్కడికి? "

"సికింద్రాబాద్ స్టేషన్‌కి సార్"

"ఇవ్వాళ కాలేజ్‌కి వెళ్ళలేదా? "

"ఇవ్వాళ మా కాలేజ్ లియోనియా రిసార్ట్స్‌కి షిఫ్టయింది!"

"అదేంటి? "

"ఔను! సికింద్రాబాద్ స్టేషన్ నుండి బస్ అరేంజ్ చేశారు రిసార్ట్స్‌కి. మా కాలేజి ఫెస్ట్‌కి కాంపిటీషన్లు అన్నీ ఈసారి వెరైటీగా ఒక్కో కాంపిటీషన్ ఒక్కో రిసార్ట్స్‌లో ఆర్గనైజ్ చేస్తున్నాం"

"ఐడియా బాగుంది! నువ్వేం పార్టిసిపేట్ చేస్తున్నావు? నీకు ఏమేంవచ్చు? "

"ఐ లైక్ మ్యూజిక్ సార్! నాకు ఫ్లూట్, శాక్సాఫోన్ వచ్చు చాలాకాలం నుండి నేర్చుకున్నాను"

ఆశ్చర్యం, ఆనందం నన్ను పట్టుకుని చెరోవైపు నుండి ముద్దాడిన ఫీలింగ్!

దొరికావు స్వప్నా!

"రియల్లీ!? నేనూ శాక్సాఫోన్ ప్లే చేస్తాను. గణేశ్ ఉత్సవాల్లో పెర్‌ఫార్మెన్స్ కూడా ఇచ్చాను. ఈసారి మళ్లీ ఇవ్వబోతున్నాను. రియల్లీ నైస్ స్వప్నా. మనిషనే వాడు ఏదో ఒక కళని తప్పకుండా అభ్యసించాలి. చిన్నదానివైనా ఆ విషయం తెలుసుకున్నావు. వెరీగుడ్!"

నా స్వరంలోని ఉత్సాహం స్వప్న గమనించింది. తన పక్కనే వున్న బ్యాగులోంచి చిన్న సైజు శాక్సాఫోన్‌ను బైటికి తీసి నాకు చూపించింది.

"ఒకసారి ప్లే చెయ్యండి సార్! వినాలనుంది!" అంది దాన్ని నాకిస్తూ.

"ఈ రైల్లోనా? రేపు మార్నింగ్ ప్రియదర్శినికి నా శాక్సా పట్టుకొస్తా. నువ్వూ తీసుకురా. కచ్చేరీ చేద్దాం"

"నాకు ఇంకో రెండు గంటల్లో కాంపిటీషనుంది. ఏం వాయించాలో కొంచెం నెర్వస్‌గా వుంది. మీరే ఏదయినా వాయించి విన్పిస్తే- నాకు కొంచెం ఇంటెన్సిటీ వస్తుంది ప్లీజ్ సర్!"

నాకు తప్పలేదు. చుట్టూ చూశాను.

అక్కడా ఇక్కడా ఒకటీ అర అన్నట్టుగా ప్రయాణికులున్నారు తప్ప ట్రైను దాదాపు ఖాళీగానే వుంది. ఫర్వాలేదు. ఎవరికీ డిస్టర్బెన్స్ కాదులే అని రూఢిగా అనిపించి - శాక్సాఫోన్ తీసుకుని శ్రుతి చేసుకున్నాను.

"వహ్వా! వహ్వా!!" అన్నారెవరో.

"ఇంకా మొదలు పెట్టలేదు బాబూ" అంది స్వప్న అతనుద్దేశిస్తూ. అతను లేచి వచ్చి నా పక్కనే కూర్చున్నాడు.

నేను ఆషికి - 2 లోంచి 'అబ్ తుమ్ హి హో' అనే గీతాన్ని ఆలాపిస్తుండగా రైలు నేను దిగాల్సిన బేగంపేట స్టేషన్ దాటి పోయి సికింద్రాబాద్ రీచయ్యింది.

స్వప్న కళ్ళు మూసుకుని తదేకంగా వింటూ తలవూపుతోంది.

నా పక్కన కూర్చున్న అతను "సార్ బాగా వాయించారు. మా కంపెనీ యాన్యువల్ మీట్‌లో మీ షో అరేంజ్ చేస్తాను. మీ మొబైల్ నెంబరివ్వండి.." అడిగాడు రైలు దిగుతూ.

రైలు దిగాక అతనికి నా నెంబర్ చెప్తుండగా స్వప్న కూడా తన మొబైల్‌లో ఫీడ్ చేసుకుంది. శాక్సాఫోన్ మౌత్‌పీస్‌ని కర్చీఫ్‌తో తుడిచి ఆమెకిచ్చేశాను.

"ఎక్సలెంట్ అంకుల్! మిమ్మల్ని 'సార్' అని కాకుండా 'అంకుల్' అని పిలుస్తాను. మీ అంత బాగా కాకపోయినా ఈ పాట

ఎలా ప్లే చెయాల్నో నాకర్థమైంది. ఇదే పాట వాయించి ప్రైజు కొట్టేస్తా. బై అంకుల్.." అంటూ స్వప్న కాలేజ్‌మేట్స్ ఇంకొందరక్కడ కన్పడ్డంతో వాళ్ల వైపుగా వెళ్ళిపోయింది.. నాకు టాటా బై చెప్తూ.

నేను బెస్ట్ విషెస్ చెప్పడానికి నోరు తెరుస్తుండగానే కనుమరుగయ్యింది స్వప్న. ఇప్పుడు నేను మళ్ళీ ఇదే ట్రైన్‌లో వెనక్కి వెళ్ళాలి - బేగంపేటకి.

మళ్ళీ వారం దాకా నాకు స్వప్న కన బడ్లే. తర్వాత కూడా కనబడ్లేదు. కానీ నా మొబైల్‌కు ఫోన్ చేసి మాట్లాడింది. తనకి కాంపిటీషన్‌లో ప్రైజు రాలేదని. శ్రోతల్ని ఆకట్టుకోలేకపోయానని. అందుకే కాస్త డిప్రెషన్‌లో వుండి రిజల్ట్సు చెప్పలేకపో యానని అంది. తనకి రెగ్యులర్‌గా వాకింగ్ చేసే హాబీ లేకపోయినా అప్పుడ ప్పుడూ పార్క్‌లో ప్రత్యక్షమవ్వచ్చు - అప్పుడు ఇంకాస్త వివరంగా మాట్లాడతా నని కూడా చెప్పింది. త్రినాథ్‌రావుగారి జాడ ఇంకా తెలీనందున ఈ రకంగా స్వప్నతో పరిచయం కలగడం అసంపూర్తి కథకు కాళ్ళు తెప్పించగలదని ఆశపడ్డాను.

నా ఆశ - నిరాశగా మారకముందే స్వప్న నన్ను పార్కులో కలిసింది.

"అంకుల్! మిమ్మల్ని మా డాడీకి పరి చయం చేస్తాను. ప్లీజ్ మా ఇంటికి రావాలి మీరు!" బతిమాలింది స్వప్న. వెళ్ళక తప్పలేదు నాకు. ఇంకా చెప్పా లంటే.. నా రొట్టె విరిగి నేతిలో పడింది!

నన్ను చూడగానే లేచి నుంచుని నమ స్కారం పెట్టాడు వెంకటేశ్వర్లు. చదువుకు న్నవాళ్ళన్నా కళాకారులన్నా తనకెంతో గౌరవమని చెప్పి నా కోసం అల్లం టీ తెప్పించాడు కిచెన్లోంచి.

"సార్! మీరు శాక్సాఫోను మంచిగ ప్లే చేస్తరని విన్న. సప్పి (స్వప్న) చెప్పింది. ఈమెకు బాగా నేర్వాలని ఇంట్రెస్టుండె. ప్రైజు రాకపోయె. జర ట్యూషన్ గిట్ల చెప్పుండ్రి" దండం పెట్టి అడిగాడు.

యాస వినడానికి బాగుంది. కొంచెం పల్లెటూరి పోకడలున్నా మనిషి హ్యాండ్‌స మ్‌గానే వున్నాడు.

"ఛ.. ఛ.. మీరు దండం పెట్టడమేంటి! చాలా చిన్న విషయం. స్వప్నని వచ్చే యేడాదికల్లా బాగా తయారుచేస్తా. నాకు కూడా మరీ బాగా ఏం రాదు. కానీ నేను కూడా నేర్చుకుని తనకి నేర్పిస్తా. ప్రైజు రావాలి.. అంతేకదా!"

"అహ..! ప్రైజెట్ల వస్తది? ఈ యేడాది దాని సదువైపోతుండె. ఇంగ ఏదో జాబ్ చెయ్యబోతది. జస్ట్ బాగ నేర్పుండ్రి. అది దాని కోరిక. నేను తీర్చాలి. గంతే!"

స్వప్న నవ్వుతూ నావైపు చూసింది. నేను టీ కప్పు టీపాయ్‌మీద పెట్టి లేస్తూ "ప్రతి ఆదివారం సాయంత్రం ఓ రెండు గంటలు నీకు కేటాయిస్తాను. నువ్వు మా యింటికొచ్చినా సరే లేదంటే నేనే ఇక్కడి కొస్తాను.. ఓకే!"

"థాక్సంకుల్!"

★ ★ ★

స్వప్న ప్రతి ఆదివారం మా ఇంటికే రావడానికి డిసైడైనట్లు వాట్సప్‌లో మెసేజ్ పెట్టింది నాకు. ఈ విషయం నిరోషాతో చెప్పాను - ఎగ్జయిటింగ్‌గా.

"ఇంకేం! ఆడబోయిన తీర్థం ఎదురైె నట్లు.. ఆ పిల్లే మీ దగ్గరికొస్తోంది. మొత్తం విషయం కూపీ లాగొచ్చు"

ఆదివారం మధ్యాహ్నం మూడు గంట లకు స్వప్న శాక్సాఫోన్ మోసుకుని మా ఇంటికొచ్చింది. నిరోషాకి, మధులికకి తనని పరిచయం చేశాను. కాసేపున్నాక తనని ముందుగా వాయించమన్నాను. 'మహాగణపతిం' వినిపించింది. ఏమాత్రం వినసొంపుగా లేదు! 'డ్యూయెట్' అనే సినిమాలో ఒక పాటలో వచ్చే శాక్సాఫోన్ బిట్స్ అన్నీ కలిపి ప్లే చేసింది. ఆమె చెబితే కానీ - అది ఆ పాట అని గుర్తుప



ట్టలేకపోయా. వెంటనే అదే పాటను నా శాక్షా మీద ప్లే చేసి చూపించా. నిరోషా, స్వప్న కలిసి చప్పట్లుకొట్టారు.

దాంతో నేను గురువుని, స్వప్న శిష్యురాలు అయిపోయాం.

ఇట్లా మూడు ఆదివారాలు గడిచాక పెరిగిన చనువుతో నాలుగో ఆదివారం నన్నే వాళ్ళింటికి రమ్మని మెసేజ్ పెట్టింది. నాకేమి అన్పించలేదు గానీ నిరోషాకి అది నచ్చలేదు. అయినా ఈసారికి వెళ్ళిరమ్మంది.

వెంకటేశ్వర్లుకు తను నేర్చుకుంది వినిపించడం స్వప్న ఉద్దేశ్యం. రెండు మూడు పాటలు వినిపించాక వెంకటేశ్వర్లు తృప్తిగా తలాడించి ఒక కవర్లో కొన్ని ఐదొందల నోట్లు పెట్టి నా చేతిలో పెట్టి మళ్ళీ దండం పెట్టాడు. అవసరం లేదని చెప్పినా, వినకుండా తనకేదో బైట పనుందని వెళ్ళిపోయాడు.

"ఇవాళ్టికిది చాలు అంకుల్! ఇంకేదయినా చెప్పండి!"

నాకిది కరెక్ట్ ఛాన్స్. "నేనొకటి అడుగుతాను. నువ్వేమీ ఫీలవ్వవు కదా"

"మీరు నా టీచర్, అంకుల్! ఫీలయ్యేది అడిగినా ఫీల్ కాను" అభయమిచ్చింది నా శిష్యురాలు.

"ఈమధ్య పిల్లలంతా డిగ్రీ చదువులకు రాగానే- ప్రేమా దోమా అంటూ.. నువ్వేమో చాలా సిన్సియర్‌గా అన్పిస్తావు. నీకేమీ లవ్‌స్టోరీ లేదా? " బాంబు బద్దలు



కొట్టేశాను.

స్వప్న నా ప్రశ్నకు నన్ను ఆశ్చర్యంగా చూసి తన శాక్సాఫోన్‌ను చేతిలోకి తీసుకుని దాని బటన్లను చేతితో పీకుతూ ఆలోచిస్తోంది.

"నాకు చెప్పొచ్చమ్మా! నేనెవరికీ చెప్పను. ఎవర్నయినా ప్రేమించావా? లేక ఎవరైనా నీకు ప్రపోజ్ చేశారా? "

"..కాదంకుల్! మీతో చెప్పుకోవచ్చు ఇబ్బందేం లేదు! బట్! అది ఏంటేంటో అయిపోయిందంకుల్.. బహుశా లవ్ అనేంత పెద్దది కాదేమో.." అంది స్వప్న సిగ్గు పడుతూ.

"బ్రీఫ్‌గా చెప్పమ్మా! నాకేదైనా వీలయితే హెల్ప్ చేస్తాను. మా మిస్సెస్ తెల్సుగా - నిరోషా, తను కూడా నీకు మంచి సలహాల్ని ఇస్తుంది. మేం మోడ్రన్‌గా ఆలోచిస్తాం" అభయమిచ్చాను.

"నేను చెప్పలేను కానీ, నా ఫీలింగ్స్ అన్నీ ఒక మెయిల్ పెడతాను. బహుశా - రాస్తే - నా ఎక్స్‌ప్రెషన్స్ సరిగ్గా వుంటాయనుకుంటా!"

"నా ఈ- మెయిల్ ఐడి నీకు వాట్సప్‌లో పెడ్తా. నీ మెయిల్ కోసం ఎదురు చూస్తుంటా. అన్నట్టు ఈ డబ్బుల కవర్ నాకు వద్దు. నేనేమీ శాక్సాఫోన్ ఎక్స్‌పర్ట్‌ని కాను. నాకంత సీను లేదు. జస్ట్ నీకు హెల్ప్ చేస్తున్నానంతే" అంటూ డబ్బు కవర్ టీపాయ్ మీద పెట్టి 304 నుండి బయటకొచ్చాను.

అప్పుడే లోపలికొస్తున్న నలభై ఐదేళ్ళ ఆవిడ్ని చూసి - భ్రుకుటి ముడిచాను. ఆమె కూడా నావంక అదోలా చూసింది. రెండు సెకండ్లు.. కేవలం రెండు సెకండ్లు ఆమెను నేను, నన్ను ఆమె - కళ్ళలో కళ్ళు పెట్టి చూసుకున్నంతలో... ఆమె, 'అన సూయ' అని నాకు తెల్సిపోయింది!

త్రినాథ్ చెప్పినట్టు - సౌందర్యరాశే!

మర్నాడు స్వప్న పంపిన ఈ- మెయిల్ చూసి చాలా కోపమొచ్చింది. తెల్లకాగితం మీద వెక్కిరిస్తున్న కోతి బొమ్మను గీసి ఎటాచ్‌మెంట్ పెట్టింది. నిరోషాకయితే అరికాలిమంట నెత్తికెక్కింది.

"చెప్పానా? ఇంకొకళ్ళ విషయాలు మన కెందుకంటా? మీకీ శాస్తి జరగాల్సిందే! ఎప్పట్నుంచో చెబుతున్నానా? వేరేవాళ్ళ పర్సనల్ విషయాలు మనకవసరమా అని! ఇకనైనా మీ పనులేవో మీరు చూసు కోండి. ఆ ప్రియదర్శిని పార్క్‌కు వెళ్లడం మానేసి మన కాలనీ కమ్యూనిటీ పార్కుకె ళ్ళండి. ఇంకోసారి ఆ స్వప్న నాక్కనబడనీ యండి, దాని పని చెప్తా" అరిచింది.

చెప్తానే వుందా? ఎప్పుడు చెప్పింది? ! ఏదేమైనా ఇక నిరోషా చల్లారే దాకా స్వప్న మాటెత్తకూడదని నిశ్చయించుకున్నాను.

వారం దాకా వాట్సప్‌లో ఏ సందేశమూ లేదు. పార్కులోనూ స్వప్న కనబడ్లేదు.

కానీ- నా మనసు నా మాట విన్లేదు. లేక్‌వ్యూ బృందావన్ మీదుగా నడవడం నా ఛాయిస్ చేసుకున్నాను, పొరపాట్న ఎవరైనా ఎదురవుతారేమోనన్న ఆశ!

ఆ ఆదివారం నిరోషా, స్వప్న విషయం చర్చకు పెట్టి అన్నీ తనే మాట్లాడింది.

"అసలు- ఈ త్రినాథ్ చెప్పిన కథలో అంత గొప్ప ట్విస్ట్ ఏముంది? ఆ కథలోని పాత్ర స్వప్న మీకు శిష్యురాలైనంత మాత్రాన మీరు ఆసక్తి పెంచుకునేంత ఏముందందులో? ఎన్ని సినిమాల్లో, టీవీ సీరియల్స్‌లో ఇలాంటి కథల్లేవూ?

అయినా అంతా తెలుసుకున్నాక ఏం చేస్తారు? నవల రాస్తారా? సిన్మా తీస్తారా? లేక హరికథాగానం చేస్తారా? శ్రీరామ నవమికి, వినాయక చవితికి"

స్వప్న నా వయసులో సగం వుం టుంది. అయినా కూడా నా భార్యలో ఈర్ష్య లేపగలిగింది. తనమీద నా ఇంట్రెస్టు ఈమె సహించలేకపోతోంది. ఇదే స్థానంలో మోహన్ వుండి ఉంటే నిరోషా ఇంత ఘాటుగా ప్రతిస్పందించేది కాదు.

★ ★ ★

"సార్! మీకో బ్రేకింగ్ న్యూస్.." మోహన్ పరిగెడుతూ వచ్చి నా దగ్గర ఆగి, స్పీకర్లు చెవిలోంచి పీకి చెప్పాడు.

"ఓ! మోహన్! బ్రేకింగ్ న్యూసా? అదీ నాకా? " ఆశ్చర్యంగా అడిగాను.

"త్రినాథ్‌గార్ని పట్టుకున్నాను! యా!"

"త్రినాథ్‌గారినా.. ఎక్కడా? "

"హాస్పిటల్‌లో. ఆయనకి బైపాస్ ఆపరే షన్ అయ్యింది. కార్డియాక్, ఐసియూలో చూశాను. పాపం బాగా చిక్కిపోయారు. బహుశా రేపో ఎల్లుండో వార్డ్‌కి చేరుస్తారు. మొబైల్ నెంబర్ కూడా తెచ్చాను. కావాలంటే మీకు వాట్సప్ చేస్తాను. హాస్పిటల్ మాత్రం గచ్చిబౌ లిలో. జిపియస్ సహాయంతో మీరు డ్రైవ్ చేస్తూ వెళ్ళొచ్చు. మీ నెంబర్ స్వప్న మొబై ల్‌లో వుండటం చూశాను. ఐ విల్ టేక్ ఇట్!" నవ్వాడు.

అడక్కుండానే అంతా చెప్పేసిన మోహన్‌ను చూస్తే ముచ్చటేసింది.

"స్వప్న ఎలా వుంది? ఈమధ్య టచ్‌లో లేదు నాతో!" అడిగాను.

"ఓ! షి ఈజ్ ఫైన్! ఎగ్జామ్స్ ఏవో వున్నట్టున్నయి, రమ్మని ఫోర్స్ చేసినా రావటంలా"

నన్ను ఫేస్ చేయడం అంత ఈజీ ఏం కాదు, తనకిప్పుడు. అందుకే రావడంలేదని నాకు తెలుసు! అయితే తన ఫ్లాట్

# భారత్‌లో యు.ఎస్. సైనికులకు శిక్షణ!

చతుర సమాచారం

ఇండియన్ ఆర్మీ, ఎయిర్‌ఫోర్స్, నేవీ, ఇండియన్ కోస్ట్‌గార్డ్ అనే నాలుగు విభాగాలు భారత దేశాన్ని శత్రువుల నుంచి కాపాడుతున్నాయి. వాటి గురించిన విశేషాలు.

✤ సముద్రమట్టానికి అత్యంత ఎగువ



(5000 మీటర్లు) ప్రదేశాన్ని భారతదేశం కాపలా కాస్తోంది. ఇది సియాచిన్ గ్లేషియర్. ప్రపంచంలో కాపలాకాసే అతి ఎత్తైన ప్రదేశం.

✤ తప్పనిసరిగా మిలిటరీలో చేర్చుకోవచ్చనే నిబంధన మన రాజ్యాంగంలో ఉన్నా దాన్నింతకాలం భారతదేశం ఉపయోగించుకోలేదు.

✤ ఇండియన్ ఆర్మీకి చెందిన 'హై ఆల్టిట్యూడ్ వార్ ఫేర్ స్కూల్' ఎత్తయిన మంచు ప్రదేశాల్లో యుద్ధానికి శిక్షణ ఇచ్చే స్కూల్. ఆఫ్ఘనిస్థాన్‌పై దాడికి ముందు యు.ఎస్. స్పెషల్ ఫోర్సెస్ ఇక్కడ రహస్యంగా శిక్షణ తీసుకున్నాయి.

✤ 1970లలో, 1990లలో న్యూక్లియర్ ఆయుధాలని భారత్ పరీక్షిస్తోందన్న సంగతి అమెరికన్ గూఢచారి సంస్థ 'సిఐఏ' పసిగట్టలేకపోయింది. ఆ సంస్థ వైఫల్యాలలో ఒకటిది.

✤ ఇతర ప్రభుత్వ మంత్రిత్వ శాఖల్లోలా మన రక్షణ సంస్థల్లో, మతం, కులాలని బట్టి రిజర్వేషన్స్ ఉండవు.

✤ డిసెంబరు 1971లో భారత్,పాకిస్తాన్‌ల మధ్య లాంగీవాలాలో జరిగిన యుద్ధంలో మన సైనికులిద్దరే మరణించారు. దీని ఆధారంగా తీసిన బాలీవుడ్ సినిమా 'బార్డర్'లో ఎక్కువమంది మరణించినట్లుగా చూపించారు.

✤ 2013లో ఉత్తరాఖండ్‌లో వరదలు రావడంతో ప్రజలని ఇండియన్ ఎయిర్‌ఫోర్స్ హెలికాప్టర్లు రక్షించాయి. ప్రపంచంలో ఏ ఎయిర్‌ఫోర్స్, అన్నివేల మంది సివిలియన్స్‌ని ఇంతదాకా రక్షించలేదు.

✤ కేరళలోని ఎజియాలా నేవల్ అకాడమీ, ఆసియాలోనే అతిపెద్ద నేవీ శిక్షణకేంద్రం.

✤ ఇండియన్ ఆర్మీకి అశ్వదళం ఉంది. మరో రెండు దేశాలకే ఇలా అశ్వదళం ఉంది.

✤ తజకిస్తాన్‌లో మనకి అవుట్ స్టేషన్ బేస్ ఉంది. ఆఫ్ఘనిస్థాన్‌లో కూడా బేస్‌కి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

---

బెడ్రూం కిటికీలోంచి పార్కులోకి స్పష్టంగా చూడొచ్చు- ఎవరెవరొస్తున్నారో. బహుశా ఇప్పుడు డెఫినెట్‌గా నన్నూ, మోహన్‌ని చూస్తూ వుండి ఉంటుంది.

ఆ విషయం మోహన్‌కు చెప్పకుండా అపార్ట్‌మెంట్ వైపుగా చెయ్యిని పదే పదే వూపాను.

మోహన్ ఆశ్చర్యపోతూ - "స్వప్నను విష్ చేస్తున్నారా సార్?" అనడిగాడు స్పీకర్లు మళ్ళీ చెవుల్లో దూర్చుకుంటూ.

నేను సన్నగా నవ్వి నా నడక కంటిన్యూ చేశాను.

★ ★ ★

ఫైవ్‌స్టార్ హోటల్‌ని మరిపించేలా వున్న ఆ హాస్పిటల్లో అడుగుపెట్టాను. త్రినాథ్‌ను కలిసేసరికి అప్పుడే ఆయన్ని రూంకి మారుస్తున్నారు. కొంచెం టైం తీసుకుని నన్ను గుర్తుపట్టాడు. కష్టంగా నవ్వుతూ విష్ చేశాడు. నాకు బాధ కలిగింది. ఆయన పరిస్థితికి కళ్ళలో నీళ్ళు కూడా వచ్చాయి. ఆయన పక్కన ఎవరూ లేరు. భార్య, పిల్లలు.. మనవళ్ళు.. నోబడీ!

త్రినాథ్‌ని రూంకి మార్చి పడుకోబె

ట్టారు. నర్సు ఏదో పెయిన్‌కిల్లర్ గుచ్చ గానే కాసేపటికే నిద్రపోయాడు త్రినాథ్.

అక్కడున్న నర్సును అడిగి కేస్‌షీట్ తీసుకుని త్రినాథ్ ఇంటి అడ్రసు చూశాను. కర్మన్‌ఘాట్ హనుమాన్ దేవస్థానం దగ్గర్లో.. అంటే ప్రియదర్శినికి దాదాపుగా మూడు కి.మీ. వుంటుంది. ఇంటి నెంబరు, కాలనీ పేరు గుర్తుపెట్టుకుని "ఈయనతో పాటు అటెండర్ ఎవరు న్నారు? " అనడిగాను నర్సుని.

"ఒకాయన వున్నాడు. రోజూ కాసేపు వచ్చి వెళ్తుంటాడు. లేడీస్ ఎవరూ లేరు!"

నేను అవాక్కయ్యాను.

★ ★ ★

"ఇప్పుడేంటి? మీరు త్రినాథ్ ఇంటికెళ్తా స్తారా? మీరు ఇన్‌వెస్టిగేటివ్ జర్నలిస్టుగా కూడా పార్ట్‌టైం జాబు చేస్తున్నారా యేం.. నాకు తెలీకుండా? " అడిగింది నిరోషా.

"నేను డిసైడయ్యాను నిరోషా! దయచేసి ఈ స్టోరీని ఛేదించనీ, నన్ను నియంత్రిం చకు ప్లీజ్!"

"ఇట్సాల్‌రైట్.. బట్ - స్వప్నను నిషే ధించాను!"

"నాకు తెలుసు! నాకు తెలుసు!"

"ఏంటి? వంకాయ పులుసు!"

★ ★ ★

త్రినాథ్ ఇంటికెళ్ళి, దగ్గరగా వేసున్న గేటు తలుపు తోశాను. ముఖద్వారం వద్దకు వెళ్ళడానికి చెట్లమధ్యలోంచి బండలు పరచిన దారి వుంది. ఒక పక్కన ఆయన ఉపయోగించిన మారుతి ఆల్టో కారు పార్కుచేసి వుంది. నా అడుగుల చప్పుడు విని ఒక పెద్ద వయసున్న పనా విడ బైటికొచ్చి అంది. "ఎవరు కావాలి? "

"ఆc!" అన్నాన్నేను.

ఆవిడ 'చారిసాబ్' అంటూ కేకేసి 'పేషంటు.. కూర్చబెట్టాల్నా? ' అనడిగింది లోనికిచూస్తూ.

రెండు నిముషాలాగి చారిసాబ్ బైటికి వచ్చి దర్శనమిచ్చాడు. "పేషంటా? డాక్టర్ సాబ్ లేడు. నాకు అంత సరిగ్గ రాదు. అయినా చూడమంటే చూస్త.. ఫర్లేదు" అన్నాడు నా దగ్గరగా వస్తూ.

"త్రినాథ్‌గారితో హాస్పిటల్‌లో వుండేది మీరే కదూ" అనడిగాను.

అర్థం కానట్టు చూశాడాయన.

"మీకేం కావాలి? " సూటిగా అడిగాడు.

"ఆయన పక్కన ఎవరూ లేరేంటి? " సూటిగా ప్రశ్నించాను, పాయింటుకొస్తూ.

"ఎవరూ లేరు గనక!" ఇంకా సూటి సమాధానం!

నాకు ఏడుపొచ్చినంత పనయ్యింది. ఎవరూ లేరా? ఈ వయసులో ఎవరూ లేకుండా ఎవరైనా ఎలా వుండగలరు?

"మరి అమెరికా నుండి మనవళ్ళు ఎవరో వచ్చారని చెప్పారు- నాతో? "

"వాళ్లు నా పిల్లలు, మనవళ్ళు. నేనూ త్రినాథ్ చిన్నప్పట్నుంచి ప్రాణస్నేహి తులం. త్రినాథ్ బ్రహ్మచారి. పెళ్ళి చేసుకో లేదు. నా భార్య చనిపోయాక మేమిద్దరం కలిసే వుంటున్నాం. నా వారసులు అంతా అమెరికాలో. వాడికి తోడుగా వుంటేనే నాకు రోజు గడుచుద్ది. చాన్రోజులుగా హార్టుపేషంటు. బైపాస్‌ను వాయిదా వేశాడు. ఈసారి నేను పట్టుబట్టి చేయిం చాను. నాకు తెల్సు మీరు అశోక్ రాణా. వాడు చెప్పేవాడు.. మీ సెల్‌నెంబర్ లేక పోవడం వల్ల మీకు కాల్ చెయ్యలేకపో యాను. 'మీకో మాట చెప్పాల్సుండె..' అని ఫీలయ్యాడు పాపం! మీరిల్లు కనుక్కొని మరీ వచ్చేశారే! థాంక్స్- వాడి మీద కన్సర్న్ చూపిన రెండో వ్యక్తి మీరు"

చారిసాబ్ దగ్గర కాఫీ తాగి - పక్క వీధిలోనే వున్న కర్మన్‌ఘాట్ ధ్యానాంజ నేయ మందిరంలోకి వెళ్ళి దర్శనం చేసుకు న్నాను. కాసేపు ధ్యానంలో కూర్చున్నాను.

ఉన్నట్టుండి నాకు బాగా దుఃఖం పొంగి పొరలివచ్చింది. త్రినాథా? అనాథా?

ఈ గుడి బయట అడుక్కుతినేవాడి క్కూడా కొడుకో, బిడ్డో, పెళ్ళామో వుంటారు. వాళ్ళకి కష్టమొస్తే, కడుపునొస్తే పక్కనే ఎవరో ఒకరు ఇరవైనాలుగు గంటలూ ఉంటారు. పక్కనే వుండి వాళ్ళేమీ చేయరు.. అయినా వుంటారు. అది తృప్తినిచ్చే విషయం. గుండె ఆపరే షన్ అయి మత్తులోంచి కళ్ళు తెరిచి చూస్తే భార్యో, తల్లో, తండ్రో, తాతో, నానమ్మో, అమ్మమ్మో, కొడుకో, కూతురో, కోడలో, చెల్లో, బావో.. వుండటం వేరు. ఒక స్నేహితుడు వుండటం వేరు. స్నేహి తుడు మాత్రమే వుండటం వేరు!

హే భగవాన్! హే హనుమాన్! బహు శా త్రినాథ్ నీ గుడికి రోజూ వస్తూండుం టాడు. నిన్ను బాగా ప్రార్థించే వుండుం టాడు. నీకుమల్లే బ్రహ్మచారి కూడానూ. డబ్బు తీసుకోకుండా హోమి యో వైద్యం చేస్తున్నాడు. ఉన్న ఆస్తిపాస్తుల్ని ఓల్డేజీ హోమ్‌కి, అనాథ శరణాలయానికి రాసిచ్చే స్తున్నాడు.

కదా! కదా!!

ఏం?

కర్చీఫ్ అడ్డం పెట్టుకుని దుఃఖాన్ని పూడుస్తుండగా ఎదురుగా..

స్వప్న నా వైపు కంగారుగా చూస్తూ నుంచుని వుంది!

కళ్లూ, ముక్కూ తుడుచుకుని - స్వప్న ముఖంలోకి చూసి పలకరింపుగా నవ్వేను.

"ఏమైందంకుల్? ఎందుకట్లా బాధపడు తున్నారు?" స్వప్న చీరకట్టులో ఆకర్షణీ యంగా కనిపించింది. ఆ పక్కనే ఇంకాస్త దూరంలో ఇంకా ఆకర్షణీయమైన అన సూయ కనిపించింది. ఆమె కూడా నావైపే చూస్తోంది జాలిగా..

"ఏంలేదు స్వప్నా! ఇవాళ మా నాన్న గుర్తొచ్చాడు. దుఃఖం ఆగలేదు. ఆయన్ని నేనింతగా మిస్సవుతున్నానని నాకిప్పుడే తెల్సింది" అంటూ బైటికి నడిచాను. స్వప్న, అనసూయ వెనకాతలే నడిచారు.

నేను చెప్పులు తొడుక్కుని కార్ పార్కింగ్ వైపుగా వెళ్ళబోతూ ఆ ఇద్దరికీ 'బై' చెప్పాను. కార్ స్టార్ట్ చెయ్యబోతుం డగా- స్వప్న నా దగ్గరకి వచ్చి - "సారీ అంకుల్! నేను మీకు చెప్పాలనుకున్నది మెయిల్‌లో ఎడిట్ చేసి.. చేసి.. చివరికి ఫైనలైజ్ చేశాను. నా గురించి మీకు ఇం కా ఇంట్రెస్టు మిగిలుండుంటే- దాన్ని మీకు మెయిల్ చేస్తా" అంది సంజాయిషీగా.

"ప్లీజ్! అంత మాట అవసరం లేదు. నా రిలేషన్‌షిప్స్ అన్నీ కూడా వీలైనంత అన్‌కండిషనల్‌గా ఉంచే ప్రయత్నం చేస్తాను. తప్పకుండా చదువుతాను"

"అయితే ఒక కండిషన్"

## కొత్తగాలి... 

**గొప్పవారెపుడూ నిరాడంబరులే**
**నాటి సత్యాన్వేషి వివేకానందుడు**
**నేటి నోబెల్ గ్రహీత సత్యార్థీ!**

– కన్నెపల్లి నారాయణమూర్తి,
జీడిమెట్ల, సికింద్రాబాద్

"ఏంటో!?"

"ప్రతి మనిషికి ఇంకోడి లవ్‌స్టోరీ ఇంట్రె స్టింగ్‌గా వుంటుంది! నేను కూడా దీనికి అతీతురాలిని ఏమీకాదు. కాబట్టి.."

"నాక్కూడా ఏదైనా లవ్‌స్టోరీ వుంటే గనక అది నీతో చెప్పేయాలన్నమాట!"

"భలే కనిపెట్టేశారంకుల్. డెఫినెట్‌గా మీక్కూడా వుండుంటది. కళాకారులు- ప్రేమపిపాసులు కదా!"

"నయం! ప్రేమ పిశాచులు అన్లేదు"

ఇద్దరం నవ్వుకున్నాం. నా మనస్సు తేలి కపడింది.

నేను ఇంటిముఖం పట్టే ముందు -

స్వప్నకు కమిటయ్యాను - తన మెయిల్ అందగానే దానికి రిప్లైగా నా ప్రేమ కథ పంపుతానని.

నేను శాక్సాఫోన్, పార్వతి అనే అమ్మాయి దగ్గర నేర్చుకున్నానని నాకు తప్ప ఎవరికీ తెలియదు. ఆ రకంగా.. నేను శాక్సా మోగించినప్పుడల్లా పార్వతిని తలుచుకుంటానని నాకు మాత్రమే తెలుసు. ఇంకా- చెప్పాలంటే.. పార్వతిని మర్చిపోతే - శాక్సా వాయించడం కూడా మర్చిపోతాను. దాదాపుగా ఇక పార్వతిని కలిసే ఛాన్స్‌లేదని రూఢిగా అనుకునే సమయంలో - ప్రియదర్శిని పార్క్‌లో నేను ఇంకో పార్వతిలాంటి అమ్మాయిని చూశాను. అచ్చం అలాగే వుంటుందని కాదుగానీ - ఫలానా పోలిక వుంది అని చెప్పలేను గానీ, ఈ అమ్మాయిని చూసినా, మాట్లాడినా - నాకు పార్వతి తప్పకుండా కళ్ళముందు కదలాడుతుంది.

ఆ అమ్మాయి మరెవరో కాదు.. స్వప్నే! స్వప్న కూడా శాక్సాఫోన్‌తోటే నాకు కనెక్ట్ అయ్యింది!

పార్వతిని పాలరాతి విగ్రహం అనుకుంటే, స్వప్న ఆ విగ్రహపు ఒక ముఖ్యమైన శకలం లాంటిదని చెప్పగలను. ఇప్పుడు ఈ పర్టిక్యులర్ విషయాన్ని స్వప్నకు చెప్పలేను. చెప్పినా నేనేదో కావాలని చెప్తున్నట్లు తీసిపారేస్తుంది. ఇంకా అతి ముఖ్యమైన విషయం - ఈ రూప సారూప్యం - నిరోషాకి అస్సలు తెలియకూడదు. అలా తెలియకూడదూ అంటే - స్వప్నకు కూడా తెలియకూడదు.

స్వప్నకు రిప్లైగా పంపడానికి - నా ప్రేమ కథను చాలా క్లుప్తంగా టైప్ చెయ్యడం మొదలుపెట్టాను, నా కంప్యూటర్లో.

డియర్ స్వప్న!

నువ్వన్నది నిజమే.

ప్రతి కళాకారుడికి ఒక ప్రేమ కథ వుంటుంది. అందరికీ తెలిసిందో - ఎవ్వరికీ తెలియందో! నా ప్రేమ కథ ఆల్రెడీ మా అమ్మనాన్నలకి, నిరోషాలకి తెల్సుకానీ - ఎవరికీ తెలియంది ఒకటుంది.

అదేంటంటే- నేను నా ప్రేమ కోసమే కళాకారుడ్ని అయ్యాననే విషయం. ఐమీన్- నా లవ్ - నన్ను శాక్సా నేర్చుకోమని పోరుపెట్టింది. తీరా నేర్చుకున్నాక - దాంతో నా తలమీద కొట్టి - వెళ్ళిపోయింది. అంటే, ఆ టైముకు - తను నా జీవితం నుండి నిష్క్రమించేసింది. నా కుటుంబం - అప్పట్లో విశాఖపట్నంలో వుండేవాళ్ళం. నాన్న వైజాగ్ స్టీల్ ప్లాంట్‌లో క్లర్కు ఉద్యోగం చేసేవాడు. అమ్మ చీరలమ్మేది. నేనొక్కడ్నే సంతానం. అలాగని గారాబంగా ఏం పెరగలేదు. నన్ను గారాబం చేసే టైమే వుండేది కాదు అమ్మానాన్నలకి. అమ్మవాళ్ళది బాగా బతికివున్న ఫ్యామిలీ అవడంతో, ఆమెకు బాగా డబ్బులుండాలనే కోరిక వుండేది. నాన్న జీతం మామూలుగానే వుండటం ఆమెకు మింగుడుపడక - ఏదైనా బిజినెస్ చెయ్యమని పోరుపెట్టి పెట్టి- చివరికి తానే ఇంట్లో చీరలమ్మే బిజినెస్ పెట్టుకుంది. నాన్నేమో సాయంత్రం ఇంటికొచ్చే సమయానికి అలిసిపోయుండేవాడు. రాగానే కూరగాయల్లేవనో, కిరాణ సామాన్లు తెమ్మనో, అదనో.. ఇదనో మళ్ళీ ఏదోపని పురమాయించేది అమ్మ. గయ్యాళి టైపేం కాకపోయినా - తనకున్న అసంతృప్తిని అంతా ఏదోలాగా నాన్న మీద వెళ్ళగక్కేది. రాత్రాను నాన్న అమ్మనెదిరించడం మానేసి కుక్కినపేన్లా తయారయ్యాడు. 'ఒక్కడితోనే సరిపెడతారా? ఇంకో నలుసు వద్దా?' అని జనాలు అడిగేవాళ్ళు అమ్మని. ఆ విషయం వాళ్ళింకోసారెత్తకుండా వాళ్ళ నోటికి వాతలు పెట్టేది అమ్మ. దాంతో నాన్న యోగ అంటూ, ఆధ్యాత్మికం అంటూ ఏదో అంటించుకుని వంట బట్టించుకునే ప్రయత్నాలు చేశాడు.

దేవుడి పట్ల నమ్మకం కల్పించుకుని భక్తి, యాత్రలు, భజనలు, సత్సంగ్‌లు గట్రా చేయాలని ప్రయత్నించి చివరికి మనసు మాటే వినేవాడు. నేను డిగ్రీ పూర్తిచేసి పీజీకని ఆంధ్రా యూనివర్సిటీ కాలేజ్‌లో చేరినప్పుడు, మా అమ్మ తన బిజినెస్ సంపాదనతో ఒక అపార్ట్‌మెంట్లో ఫ్లాట్ కొనగలిగింది.

మా నాన్న ఎట్లాగూ తన జీతభత్యాల్ని అమ్మకే ఇచ్చేసేవాడు - ఆమె ఇంకో మాట అనకూడదని.

★ ★ ★

టైపు చేయడం ఆపి, నేను రాసిందంతా ఒక్కసారి చదువుకున్నాను. చెత్త కథలాగా అన్పించింది. అయినా నా సోది అంతా ఒక ఆత్మకథలాగా పాపం ఆ స్వప్న ఏమీ అడగటం లేదే!? జస్ట్ నా లవ్‌స్టోరీ మాత్రమే అడిగింది. దానికీ అమ్మ చీరల మ్మడానికి ఏంటీ కనెక్షన్? రాసిందంతా డిలీట్ చేసేశాను.

కానీ - ఏదో రిలీఫ్ మొదలవుతోంది మనసులో.. ఇట్లా జరిగిందంతా గుర్తుకు తెచ్చుకుని రాస్తుంటే డైరీ రాస్తున్నట్టుగా వున్నప్పటికీ - లోపలి విషపూరిత వ్యర్థాలు బయటికి పంపేస్తున్నట్టుగా వుల్లాసం దొరుకుతోంది నాకు. బహుశా ఒక్కసారి రచయిత అయినవాళ్ళు ఇంక పదేపదే రాసుకుంటూ పోవడానికి ఇదే కారణము న్నట్టుంది! నేనైతే ఎప్పుడూ ఇట్టాంటివి రాసిన పాపాన పోలేదు. అప్పట్లో పార్వతి బలవంతపెట్టినప్పుడు - తన పుట్టిన రోజుకి ఒక కవిత రాశాను.

"పుట్టిన రోజు పండుగే అందరికీ -
మరి పుట్టింది ఎందుకో, తెలిసేను
కొందరికీ - కొందరికీ.."

"ఛస్.. ఏంటిదీ? ! ఇది పాత తెలుగు సిన్మాపాట! అది కూడా తెల్దామీకూ? " గల గలా నవ్వింది పార్వతి - కాగితాన్ని ముక్కలు ముక్కలు చేస్తూ..

తను ఆ పొడవాటి చేతులతో ఏం చేసినా - ఆమె చేతులకున్న అరడజను మట్టిగాజులు ఆమెకు జయజయ ధ్వానాలు పలికేవి. ఆమె మాట్లాడ్డం మొద లుపెట్టకముందే ఆ ఎర్రని జ్యూసీ పెదాలు పదాల్ని వదలడానికి దారిస్తూ తెరుచుకుని మరింత ముద్దొచ్చేవి.

"ఓకే పార్తూ (పార్వతికి నేను పెట్టిన నిక్ నేమ్), సరే - నేను రాయలేను. నాలాంటి అభాగ్య ప్రేమికులకు నువ్విచ్చే సలహా? "

"దొరక్కుండా కాపీ కొట్టేసి - ప్రియురాలి మనసుని దోచేయమని!"

"ఊహూ.. నేను కాపీ కొట్టను"

"వూర్కోండి అశోగ్గారూ! పిల్లలు పెద్దల్ని కాపీకొట్టే కదా అన్నీ నేర్చుకునేది? "

"వచ్చే నా పుట్టిన రోజుకల్లా - మీరు ఏదైనా సంగీతమో, సన్నాయో నేర్చేసు కోండి. నాకు మ్యూజిక్ ఎంతో యిష్టం"

"కానీ నాక్కష్టం. నాకు గాత్రశుద్ధి లేనం దుకు చిన్నప్పుడే మా సంగీతం టీచరమ్మ తన యింటి చాయలక్కూడా రానివ్వలేదు. గిటార్ నేర్చుకోబోయి వేళ్ళు తెగ్గోసుకున్నా. పోనీ రచనలు చేసి సాహిత్య సేవ చేసు కుందామని ట్రై చేస్తుంటే - అది కాపీ.. ఇది టీ అంటూ జనాలు వెంట వెంటనే గుర్తుపట్టేస్తున్నారాయె. హర్రె. నేన్నిన్ను ప్రేమిస్తున్నానని నీకు ఆల్రెడీ తెలిసినంక -

## కొత్తగాలి...

**ఇల్లు, వాకిలి, వీధులు**
**స్వచ్ఛ భారత్‌తో కావాలి శుభ్రం!**
**మన మనసులు కూడా**
**అంతే స్వచ్ఛంగా ఉంచుకుందాం!**

*- అద్దంకి శ్రీరామచంద్రమూర్తి,*
*హైదరాబాద్*

ఇంక అట్టాంటి గోలెందుకో? "

"మీరు లవ్ సేత్తే సరిపోదండీ! దానికో అర్హత వుండాలి. నేనూ తిరిగి మిమ్మల్ని లవ్ చేయడాన్కి నాకూ ఓ అది, ఇది వుండాలి. రేప్పొద్దున ఎవరైనా అడుగుతా రండీ - నన్నే - మిమ్మల్నే. 'ఏం చూసి ప్రేమించావు?' అంటూ నిలదీస్తారు. అప్పుడు చెప్పుకోవడాన్కి - ఏదో వుండాలి కదా! ఫలానా చూసేసి ప్రేమించా అంటే - 'పోస్లే- పాపం!' అనుకుంటారు. ఏమం టారు? "

ముడిచిన పెదాలు ముడిచినట్టే వున్నయి - ఇదంతా క్షణకాలంలో నాకు చెప్పేసిందంటే నేన్నమ్మలేదు.

అసలు- ఒక ఆడదానికి ఒక మగవాడు ఇష్టం లేకపోతే - ఇంతసేపు మాట్లాడుకునే రోజులు కావవి - వైజాగ్‌లో ప్రేమికులకు సరైన అడ్డాలు బోల్డెన్ని. కానీ ఆ ప్రేమి కులు - ఆ అడ్డాల వల్లే - నిజమైన ప్రేమ అంటే ఏంటో తెల్సుకోలేక పోయేవాళ్ళు.

పార్తూ, గీతం ఇంజినీరింగ్ కాలేజీలో థర్డియర్ చదువుతుండేది. రుషికొండ బీచ్, భీమిలి, కైలాసగిరి.. డాల్ఫిన్ నోస్.. ఇట్లా - అనేకానేక ప్రదేశాలున్నా, మా స్నేహం మేం అప్పుడే దిగిన అపార్ట్‌మెం టుని దాటుకుని ఎటూ వెళ్ళలేదు.

వెళ్ళాల్సిన అవసరమే రాలేదు. ఎందు కంటే మాది, వాళ్ళది - పక్కపక్క ఫ్లాట్స్ అవడం మూలాన! జస్ట్ - ఒక గోడ మాత్రమే అడ్డం - తన బెడ్రూంకి - నా బెడ్రూంకి. ఇద్దరం ఒకేసారి బాల్కనీల్లో గనక నిల్చుంటే చేతులు చేతుల్లోకి తీసు కుని మాట్లాడుకునేంత దగ్గర.

నిజానికి తను పరిచయమైందే - అట్లా.

★ ★ ★

పొద్దున్నే కాలింగ్ బెల్. తలుపు తీసిన నాకు - స్వయనా సూర్యుడే దిగివచ్చినంత వెలుగు. బహుశా అది నా మనసులోని చీకటి ఎక్కువగా ఉండటం వల్ల అట్లా అనిపించుంటుంది. ఆమె ముఖారవిందం అంత గొప్పగా ఏం లేకపోయినా - చూడంగానే చటుక్కున దగ్గరికి తీసుకోవా లనేంత ఆర్ద్రత వుందా మొహంలో. నా మనోగర్భాన ఒక ప్రేమికుడు ఊపిరి పోసుకోవడం మొదలుపెట్టాడు.

"పెరుగుకు తోడు కావాలండీ. మేం మీ పక్కింట్లో కొత్తగా దిగాం. ఆంటీ వున్నారా? "

'కానీ - నాకు నీ తోడు కావాలే!! ఎట్లా? గ్లాసుతో వచ్చావు. నేను దేనితో నీ ఎదు రుగా వున్నానో నువ్వు గుర్తుపట్టావా? '

అమ్మ నన్ను పక్కకు తోసి "ఏమ్మా! పెరుగా? రా! గ్లాసు ఇటీయ్" అంటూ ఆ అమ్మాయి చేతిలోంచి గ్లాసు తీసుకున్న ప్పుడు - అరడజను మట్టిగాజులు గలగల మన్నాయి. ఆమె కూడా నన్ను తప్పించు కుంటూ అమ్మ వెనకాతలే వంట గదిలోకి వెళ్తున్నప్పుడు - కాలి వెండి మువ్వలు ఘల్లుమంటూ గుండె ఝల్లుమనేలా మోగాయి.

గ్లాసు తీసుకుని తిరిగి వెళ్తూ - "నా పేరు పార్వతి! మీరు? " అంది పరిచయా నికి షేక్‌హాండ్ ఇస్తూ.

'అరె! పిల్ల యమఫాస్టు! ఇంకేం!' అని పించింది. "నా పేరు అశోక్ రాణా. యూనివర్సిటీ పీజీ కాలేజ్‌లో ఎమ్మే తెలుగు, ఫస్టియర్"

"ఓహో! నైస్ మీటింగ్ యు" అంటూ తలుపు దాటి కనుమరుగైంది.

"ఆ పిల్ల - గీతమ్స్‌లో ఇంజినీరింగ్ అంట! మొన్నే దిగారు పక్కింట్లో. ఆ ఫ్లాట్ ఓనర్‌కి వీళ్ళు బంధువులంట. వీళ్ళమ్మ కెజిహెచ్ ఆస్పత్రిలో స్టాఫ్‌నర్స్. డాడీ - సోషల్ యాక్టివిస్టు అంట"

పేపరు విప్పుతూ నాకు కావాల్సిన ఇన్ఫ ర్మేషన్ ఇచ్చాడు నాన్న.

"ఏంటీ? పొద్దున్నే అన్ని 'అంట' లేస్తు న్నారు? భోజనాలెవరికి? " అంది అమ్మ

# షార్క్ పిల్లలు వాటికి ఆటవస్తువులు!




సముద్రజీవులైన డాల్ఫిన్స్‌కి శిక్షణ ఇవ్వడం చాలా తేలిక. అందంగా నవ్వే ఆ డాల్ఫిన్స్‌కి చెందిన కొన్ని ముచ్చట్లు..

✤ డాల్ఫిన్స్‌కి షార్క్ చేపల వల్ల కలిగే గాయాలకి వేగంగా దానంతట అదే చికిత్స జరిగి, శరీరం మామూలుగా అవుతుంది. కొంతకాలానికి అక్కడ గాయమైన గుర్తులు కూడా కనిపించవు.



✤ సగటున ప్రపంచంలో ఏటా పద్నాలుగు మంది డాల్ఫిన్స్ దాడికి గురవుతున్నారు.

✤ 1960లలో ఓ శాస్త్రజ్ఞుడు డాల్ఫిన్స్‌కి ఇంగ్లీష్ నేర్పే ప్రయత్నంలో వాటికి ఎల్ఎస్‌డి (మాదక ద్రవ్యం) ఇచ్చాడు. కానీ విజయం సాధించలేకపోయాడు. అవి అతి తెలివైన జలచరాలు.

✤ డాల్ఫిన్స్ ఓ కన్ను తెరిచే నిద్రపోతాయి.

✤ తిమింగలం, డాల్ఫిన్ల కలయికలో పుట్టే జలచరాన్ని 'హోల్ఫిన్' అంటారు.

✤ నిద్రలో డాల్ఫిన్స్ కుడి మెదడు మాత్రమే విశ్రాంతి తీసుకుంటుంది. ఎడమ మెదడు గాలి పీల్చడానికి మెలకువగా ఉంటుంది!

✤ ఓ మహిళ గర్భవతి అయితే, ఎకో లొకేషన్ పద్ధతి ద్వారా డాల్ఫిన్స్ కనుక్కోగలవని నిపుణులు చెప్తున్నారు.

✤ అద్దంలో తమ ప్రతిబింబాన్ని చూసిన డాల్ఫిన్ అది తానే అని గుర్తు పట్టగలదు.

✤ మగ డాల్ఫిన్, ఆడ డాల్ఫిన్‌ని బంధించి తనతో రతికి అంగీకరించేదాకా ఆహారం తీసుకోనివ్వదు.

✤ మనుషుల తర్వాత ఆత్మహత్య చేసుకునే జీవుల్లో ఒకటి డాల్ఫిన్! (కోతి, తిమింగలం కూడా ఆత్మహత్యలు చేసుకుంటాయి)

✤ డాల్ఫిన్స్ షార్క్ పిల్లలని వాలీబాల్‌లా ఉపయోగించి ఆడుకుంటాయి.

✤ డాల్ఫిన్స్ తమకి పెట్టిన పేర్లని గుర్తుంచుకుంటాయి. ఇతర డాల్ఫిన్స్ పేర్లని కూడా గుర్తుపడతాయి.

✤ ఇరవై ఏళ్ల తర్వాత కూడా డాల్ఫిన్స్ విడిపోయిన తమ సహచరులని గుర్తు పట్టగలవు.

✤ గాయపడ్డ లేదా మునిగి పోతున్న మనుషుల్ని డాల్ఫిన్స్ అనేక సార్లు రక్షించాయి.

---

వంటింట్లోంచి వ్యంగ్యంగా.

★ ★ ★

మానాన్న- ఎప్పుడూ ఖాళీగా కూర్చోడు. ఏదో ఒక పని చేస్తుండే తత్త్వం - మాట్లాడుతూనో, రిపేర్లు చేస్తూనో, గుండీలు కుడుతూనో, ఫర్నీచర్ తుడుస్తూనో!

డబ్బులొచ్చే పనేదైనా చేయమని అమ్మ నసిగేది. ఈలోపల ఎవరో ఆంటీలు చీరలు కొనడానికో, ఆ పేరున కబుర్లాడ్డానికో వచ్చేవాళ్ళు. నాన్న బతికిపోయేవాడు. పార్వతి వాళ్ళ అమ్మ కూడా మా అమ్మకు కష్టమరైపోయింది. ఏ మాత్రం ఖాళీ దొరికినా వచ్చేసి చీరల షెల్ఫ్ వంక చూస్తూ అమ్మతో వాటి వివరాలు కనుక్కునేది.

ఆమె పేరు లిల్లీ! మళయాళీ. కానీ చాలా సంవత్సరాలుగా ఆంధ్రదేశంలో సెటిలై వుండటం వల్ల తెలుగుతనం, భాష, ఆచారం బాగా వంటబట్టిచ్చుకుంది. ఒక హెల్త్‌క్యాంప్‌లో హడావిడి చేస్తున్న మురళికి సమాజ సేవంటే బాగా యిష్టం. అతనంటే ఈవిడకిష్టం. పెళ్ళయిపోయింది. కార్పొరేటర్‌గా ఐదేళ్ళు పనిచేశాక మురళి, మళ్ళీ ఎన్నికవ్వకపోయినా తనవంతు సేవ నిజాయితీగా చేస్తూనే వుండేవాడు. అందు

వల్ల - డబ్బు సంపాదన కోసం లిల్లీమీదే ఆధారపడేవాడు. వీళ్ళద్దరి ఏకైక పుత్రికారత్నమే - పార్వతి.

మురళికున్న ఒకే ఒక బ్యాడ్ హాబిట్- సిగరెట్ తాగడం. అతనో చైన్ స్మోకర్. ఇంట్లో వున్నప్పుడు అప్పుడప్పుడూ నా బెడ్రూం వైపున్న తమ బాల్కనీలోకొచ్చి సిగిరెట్లు వూదేవాడు. ఆ పొగ సరాసరి నా గదిలో దూరి- నన్నిబ్బంది పెట్టేది. అయినా - పార్వతివాళ్ళ నాన్న కదా! కాబోయే మామగారు కదా - అని చాలా ఓర్చుకున్నాను. ఎవ్వరూ ఏవీ అనట్లేదని కాబోలు - ఆయన వీలు చిక్కినప్పుడల్లా మరిన్ని వూదడం మొదలుపెట్టాడు.

అమ్మ, నాన్న - మురళితో మర్యాదగా

కొత్తగాలి...

**చట్టాలు చుట్టాలైతే**
**'నిర్భయ'లు నిష్ఫలం**
**ఆడవాళ్ల శీలం**
**కామాగ్నికి ఇంధనం!**

– డి. శ్రీనివాస దీక్షితులు,
నరసరావు పేట, గుంటూరు జిల్లా

చెప్పి చూశారు. లిల్లీ ఎప్పుడో వాళ్ళాయన్ని మానసికంగా వదిలేసింది. ఇంక మిగిలిన రెండు ఆప్షన్లు.. నేను మురళికి చెప్పడం - లేదా పార్వతితో చెప్పించడం.

ఒకరోజు తీరిగ్గా మురళి వుఫ్.. వుఫ్ మని వూదుతున్నప్పుడు ఇంక నేను ఓ డాక్టర్ అవతారం దాల్చాను. స్మోకింగ్ వల్ల నష్టాలు ఏకరువుపెట్టి - మానేయాలని లేదా బాల్కనీలో కాల్చొద్దని గట్టిగా చెప్పాను.

ఆ తర్వాత రెండ్రోజులపాటు పొగవాసన రాలేదు. నా డోసు పన్జేసిందని మురిసిపోయా.

"రెండ్రోజుల్నించి మనిషి పత్తాలేడు. ఎక్కడ సంఘసేవలో పాల్గొంటున్నాడో" అంది వెటకారంగా లిల్లీ - అమ్మతో.

నా మురిపెం ఫట్‌మంది.

"అదేంటాంటీ? మీరు నర్స్‌కదా! ఎవరైనా డాక్టర్‌తో గట్టిగా చెప్పించొచ్చుగా? " నేను కెలుక్కున్నాను.

"చొచ్చునుకో! చొచ్చాను కూడా! కేరళ మందులు కూడా తెప్పించి వాడించాను.. గొడవలు పడ్డాను"

"మరేమైందీ? "

"మా డాక్టరు - నా ఛెస్ట్ ఎక్సరే చూసి - లిల్లీ - నువ్వు సిగరెట్లు తాగడం మానేస్తేగాని - మీ ఆయన మానేయలేడు అని సెలవిచ్చాడు"

అందరం నవ్వేశాం.

మళ్ళీ తనే అంది - లిల్లీ..

"ఆ విషయంలో నేనూ - డిప్రెస్ అయ్యా. మురళికి సిగరెట్లు అలవాటైంది - పార్వతికి డయాబెటిస్ వుందని తెలిసినప్పుడు!" బాంబు పేల్చింది.

"వ్వాట్? ఆంటీ ఏంటి మీరు చెప్పేది? పార్వతికి షుగరా? " అరిచినంత గట్టిగా అడిగాను.

"ఔనశోక్! చిన్నతనంలోనే తనకి షుగర్ డిటెక్టయ్యింది. పగలు రాత్రిళ్ళు ఇన్సులిన్ ఇంజెక్షన్లు తీసుకోవాలి. బోల్డన్ని మాత్రలు మింగాలి. నియమంగా వుండాలి జీవితం - అన్నివిషయాల్లో. మాకున్న ఒక్కగానొక్క కూతురికి ఇట్లా అవడంతో - ఇంక మరో బిడ్డ మాకు వద్దనుకున్నాం! పార్వతి అట్లా ఇంజెక్షన్ల మీద బతకాల్సి రావడం మురళిని డిప్రెషన్‌లోకి తీసుకెళ్లింది. అందుకే తను - స్మోకింగ్ మానలేడు"

★ ★ ★

పార్వతికి షుగర్ అని తెలిశాక ఆమె మీద ప్రేమ పదిరెట్లు పెరిగింది. మా అమ్మకి పదిరెట్లు తగ్గింది. కానీ నాన్నకు మేమిద్దరం చిలకా గోరింకల్లా అనిపించే

వాళ్ళం. బాల్కనీలో అటో కుర్చీ ఇటో కుర్చీ వేసుకుని గంటలు గంటలు బాతాఖానీ కొట్టేవాళ్ళం. అమ్మ ఒకరోజు వార్నింగిచ్చింది.

"రేయ్ వెధవా! ఆ పిల్ల, పేషంటు! ఎందుకా అమ్మాయిని కెలుక్కుంటావ్? ప్రేమ గీమా అని నిన్ను వల్లో వేసుకుని ఆడుకుంటారు"

"అదేంటమ్మా? షుగర్ కావాలని తెచ్చుకునే జబ్బేమీ కాదుగదా! అయినా తను ఇప్పుడు నార్మల్‌గా వుందిగా. ఈ ప్రపంచంలో ఇన్సులిన్ మార్కెట్లో దొరికినంత కాలం పార్వతికొచ్చిన ప్రాబ్లెం ఏం లేదు!"

"నాకేమీ పార్వతి మీద ద్వేషం లేదయ్యా. ఎటొచ్చీ - మీ ఇద్దరి మధ్యా స్నేహం ముదరకూడదని ముందే చెబ్తున్నా! పిచ్చివేషాలేస్తే - తాటతీస్తా"

అమ్మ అట్లా అనడం అరవడం నాకూ, నాన్నకి మామూలే. అమ్మ మాటలకి నేను నొచ్చుకోవడం నాన్న గమనించి - "ఇప్పుడు అమ్మ మాత్రం ఏమన్నదిరా? బుద్ధిగా చదువుకుని మంచి జాబ్ తెచ్చుకుంటే బంగారంలాంటి పిల్లని కోడలుగా తెచ్చిస్తానని ఇండైరెక్ట్‌గా చెబుతోంది. దానికే నువ్వు అప్‌సెట్ అయితే ఎలా? అయినా నువ్వు పార్వతితో ఎగస్ట్రా స్నేహం ఏవీ చెయ్యట్లేదుగా, ఇంకేంటి ప్రాబ్లెం? " నచ్చజెప్పబోయాడు.

అప్పుడు చెప్పాను, నాన్నకి..

"పార్తూ అంటే నాకిష్టం నాన్నా! ఆ అమ్మాయిని పెళ్ళాడటం నా అదృష్టంగా భావిస్తాను. నన్ను తను బాగా అర్థం చేసుకుంటుంది. నాకా నమ్మకం వుంది"

"అందుకే, అమ్మ పసిగట్టింది. నావరకైతే నువ్వు ఇష్టపడ్డ అమ్మాయికి షుగరున్నా, సాల్టున్నా - నాకేం అభ్యంతరాలుండవు. ఎందుకంటే అది నీ ఛాయిస్ కాబట్టి. కానీ - నీకు ఇంకా జాబ్ రావాల్సి వుంది. లైఫ్‌లో సెటిలవ్వాలి - ఈ పీజీలు ఎంఫిల్ అయిపోవాలి.."

"అన్నీ అయిపోయాక ఓ నలభై ఏళ్ళొచ్చాక నింపాదిగా షుగర్, బీపీల్లేని అమ్మాయిని టెస్టులన్నీ చేయించి ప్రేమించాలని నీ తీర్పు! అంతేకదూ నాన్నా!"

"ఆరి భడవా! నేనట్లా అన్లేదు. సపోజ్ ఇదే పార్వతిని పెళ్ళాడాలన్నా - నీకింకా టైముందని చెప్తున్నా. బట్.. అమ్మ మనసు అర్థంచేసుకో. ఆమెకు ఎదురీదావంటే - జీవితకాలం యావజ్జీవ.."

"అర్థమైంది డాడ్! నీలాగే అన్నమాట!" అంటూ బాల్కనీలోకొచ్చి చూస్తే - పార్వతి నుంచుని అంతా వింటూ వుంది. ఒక్క క్షణం నా వంక ఓ చూపు చూసి తన బెడ్రూంలోకెళ్ళి దభాల్న తలుపేసుకుంది.

★ ★ ★

రామకృష్ణ బీచ్ దగ్గరి కాళికామందిర్లో అమ్మవారికి మొక్కుకున్నాను - 'తల్లీ! ఒక మనిషి జీవితంలో సహజంగా వచ్చే సమస్యలు పక్కకు పెడితే - జబ్బుల వల్ల కలిగే అసహనం, ధనవ్యయం, అనారోగ్యం, అనాదరణలకు - పార్వతిని - పార్వతిలాంటి అమ్మాయిల్ని అతీతంగా వుంచి - వాళ్ళని కాపాడు' అని.

గుడిగంటలు ఠంగుఠంగుమని మోగవేం? నా ఆవేదన, నా రోదన - మాతకి వినబడ్లేదా? ఇంక చేసేదేం లేక నేనే వెళ్ళి వాటిని మోగించాను. కాసేపయ్యాక ఆ పూజారి 'ఇంక చాల్లేబాబూ!' అన్నట్టు నా వంక చూట్టంతో ఆపేశాను.

గుడి వెనకాతలే ఆర్కేమఠం పక్కనే చిన్న రోడ్డుగుండా అట్లా నడుస్తూ వెళ్ళాను పరధ్యానంగా. ఒక తియ్యని సంగీతం - మంద్రస్థాయిలో వినబడుతూంటే- అటుకేసి నడిచాను. ఆహా! సన్నాయిలాగే వుంది. ఎంత కమ్మగా వాయిస్తున్నారు. మనసు ప్రశాంతతకు లోనయ్యేట్టుగా.. ఆలోచిస్తూ ఆ ఇంట్లోకి అడుగుపెట్టాను.

'సింహాద్రి మ్యూజిక్ క్లాసెస్' అన్న

బోర్డుంది. ఇచ్చట గిటారు, డ్రమ్స్, పియానో నేర్పబడును. రెండో అంతస్తులో విశాలమైన గది - కిటికీలోంచి సముద్రం దృశ్యం ప్లస్ గాలి తెమ్మెరలు. ఎదురుగా శాక్సాఫోన్ వాయిస్తూ జాకోబ్ మాస్టర్.

"నేనూ నేర్చుకుంటా" డిక్లేర్ చేశాను.

"నీ అర్హతలేంటి? "

"మ్యూజిక్ నేర్చుకోవడానికి అర్హతలెందుకు? అది వుండాలి. కరెక్ట్‌గా నేర్చుకుంటూ వుండాలి. అంతేగా!" తెలివిగా జవాబిచ్చాను- అనుకున్నాను.

జాకోబ్ మాస్టర్ నా భుజం తట్టి - కిటికీ దగ్గరికి తీస్కెళ్ళి - నా కళ్ళలో తన చూపులు నిలిపి అడిగాడు "లవ్ చేశారా ఎవర్నయినా? లవ్ ఫెయిల్యూర్ అయిందా? "

"ఏంటట్లా అడుగుతున్నారు సార్? "

"అలాంటప్పుడే - మనలో మ్యూజిక్ పట్ల ఇంటెన్సిటీ వుంటుంది. కరెక్టుగా, త్వరగా వస్తుంది! మామూలు వాళ్ళకి సంవత్సరం పట్టేది - నేనొక నెలలో నేర్చుకున్నాను - నా లవ్ ఫెయిల్యూర్ అయిన కొత్తలో"

ఆయన మాటలు నా మనసులో సూటిగా, గంటల్లా ఠంగుఠంగున మోగాయి.

"సార్! మనసులో ఏదో ఆవేదన, ఆక్రోశం వున్నాయి. లవ్ ఫెయిల్యూర్ అని చెప్పలేను. బహుశా లవ్ అనేది రెండువైపులా వుంటేనే కదా.. ఫెయిల్యూర్ వుండేది!"

"కరెక్ట్! ప్రేమకి, సంగీతానికి, సాహిత్యానికి ఉండే సహజ సంబంధమే ఇది. ఒక దాన్నొకటి ప్రేరేపిస్తుంది. మనసుకి సాంత్వన కల్గిస్తాయి. గుడ్! అయితే శాక్సాఫోన్ అంత ఈజీగా రాదు. ఇంట్లో కూడా ప్రాక్టీస్ చెయ్యాలి"

"డన్!"

ఆ తర్వాత కొద్దిరోజులకే - జాకోబ్‌సార్ నన్ను "వెల్‌డన్" అన్నాడు.

★ ★ ★

కానీ - నాన్న - "వెరీ బ్యాడ్" అనేశాడు.

"నువ్వు పార్వతి విషయంలో ఇంత సీరియస్ అని నేననుకోలే!" తల పట్టుకుని కుర్చీలో కూలబడ్డాడు నాన్న. నా శాక్సాఫోన్ ప్రాక్టీసు పక్కనపెట్టి, నేనూ మంచం మీద వొరిగాను.

'రేయ్- అశోక్! ఈ లవ్ అని ఏదైతే నువ్వు అనుకుంటున్నావో - అది - ఉత్త ట్రాష్‌రా. ఇది కామం. జస్ట్ మోహం. అంతా టైంవేస్ట్. ఇదో రోగం రా, రోగం!"

"ఏంటి నాన్నా? ఎందుకల్లాగ నన్ను నిరుత్సాహపరచడం? "

"పార్వతి నాతో చెప్పిందిరా. తనకి 'ఐ లవ్ యూ' చెప్పావంట! నిన్ను కంట్రోల్లో పెట్టమని చెప్పింది. తన గురించి ఆలోచించి జీవితం పాడుచేసుకోవద్దని సలహా ఇచ్చింది"

"మరి - నువ్వేమన్నావ్? తను నన్ను ఇష్టపడట్లేదా? "

"ఇష్టం వేరురా. ప్రేమ వేరు. నువ్వేమో తనని ప్రేమిస్తున్నావు లేదా కామిస్తున్నావు. తనేమో నిన్ను స్నేహితుడిలాగా ఇష్టపడుతోంది. అంతకంటే ఏంలేదు! ఆలకిస్తున్నావా? "

"ఊర్కో నాన్నా! కామించడం ఏంటి సిల్లీగా? పెళ్ళాడాలని వుందని చెప్పాగా"

"నీకు తెలియట్లేదు అశోక్! ఇది పార్వతి పట్ల నీ యవ్వన స్పందన. అంతకంటే ఏం వుండదు. ఆ కాస్తా తీరిపోగానే - ఈ ప్రేమ నాటకం ముగిసి, లోపల జ్ఞానోదయం అయ్యి - 'ప్రేమ అంటే ఇంతేనా? ' అని అసంతృప్తి చెలరేగి - ఆపైన ఇంకో వ్యక్తిని ప్రేమించి.. ఇట్లా వుంటుంది ఈ ప్రేమ అనే రోగం"

నేనింక ఆయన్తో వాదించదల్చుకోలేదు.

★ ★ ★

పార్వతి, నేను బాల్కనీలో పెట్టే బాతా

ఖానీల్లో ఏ మార్పూ లేదు. నా శాక్సాఫోన్‌లో వచ్చే మార్పును పార్వూ స్పష్టంగా గమనించి నన్ను ఎంకరేజ్ చేస్తుండేది. ఓరోజు అదే పనిగా వాయిస్తుండగా కింద ఇండిపెండెంట్ ఇల్లు ఓనర్ లక్ష్మీపతి "అయ్యా! అశోక్‌బాబూ! ఏందయ్యా రోజూ ఈ గోల!? ఛస్తున్నాం. నేర్చుకొని వూదవయ్యా బాబూ! - అట్లా గాలి బెలూన్లు నింపే వూదుడులాగా ఎంతసేపు వాయిస్తావు? చెవులు చిల్లులు పడ్తున్నాయిక్కడ.." అంటూ అసహనం వ్యక్తపరిచాడు - బ్రష్ చేసుకుంటూ.

అది విన్న పార్వూ నా పక్షం వహించి - "లక్ష్మీ అంకుల్, మీరూ మీ మేడం

**కొత్తగాలి...**

**ప్రకృతి ప్రకోపించింది**
**ప్రళయ భీకర రూపం దాల్చి**
**తల్లడిల్లింది నేపాల్ నేలతల్లి**
**ఆదుకోవాలి ఏకమై మనమందరం!**

– బి.వి నరసింహారావు,
పేరాల, ప్రకాశం జిల్లా

పెట్టుకునే గొడవలు, అరుపులు అశోగ్గారి శాక్సాఫోన్ కన్నా వినసొంపుగా వుంటాయండి. దయచేసి మానేయకండేం!" అంది వెటకారంగా.

ఓ రోజు రాత్రి పన్నెండింటికి..

నా బాల్కనీ తలుపు చప్పుడై లేచి తీసి చూస్తే.. పార్వూ!

నేను అవాక్కయాను- బాల్కనీ దూకి మరీ రిస్కు చేసి వచ్చినందుకు.

"ఏంటి మతిపోయిందా? ఏంటీపని? జారిపడ్డావనుకో సరాసరి పైకే.." అరిచాను మెల్లగా.

"ఛ! వూర్కోండి అశోగ్గారూ! రండి, ఇవి తినేద్దాం.." అంటూ చిన్న ప్లాస్టిక్ డబ్బా తెరిచి రొయ్యల వేపుడు ముక్కల్ని పుల్లకి గుచ్చి నా నోట్లోపెట్టింది. అన్నీ తినిపించాక - "మీ ఫ్రిజ్జులో ఐస్‌క్రీం వుండాలి కదూ! తేనా? తిందాం.." అంది - లేస్తూ.

"హే- పిచ్చిపిల్లా.. ఈ టైంలో నిన్ను ఈ ఇంట్లో చూస్తే మా అమ్మ నిన్ను.."

"అచ్ఛా.. ఛా.. చూద్దాం.." అంటూ డోర్ తెరిచి మెల్లిగా అడుగులో అడుగేస్తూ హాల్లోకి వెళ్ళి పిల్లిలాగా, డీప్ ఫ్రీజర్ డోర్ తీసి ఐస్‌క్రీం డబ్బా తీసి డోర్ మూతేసి - కిచెన్‌లోకెళ్ళి చెంచాలు తీస్తుండగా శబ్దం అయింది.

"ఎవర్రా.. అశోకూ? ఏమైంది? ఏం కావాలి? " అంది అమ్మ, ఇంకో బెడ్రూం లోంచి అరుస్తూ.. వెంటనే నేను అమ్మ బెడ్రూం తలుపెదురుగా నుంచుని "ఏం లేదమ్మా..! నువ్వు పడుకో!" అంటూ తలుపు దగ్గిరగా వేసి వచ్చి చూస్తే - పార్వూ ఐస్‌క్రీం బుక్కేస్తూ నవ్వింది. నోటి చుట్టూ ఐస్‌క్రీం మీసాలు..

"నువ్వూ తిను.. ఇంద.."

నేను తిన్నాను. కానీ- ఆమె పెదాల మీది ఐస్‌క్రీంను మాత్రమే! "ఊఁ.. అయితే, నా కోసం ఎంత రిస్కైనా చేసి రాగలవన్నమాట!" అడిగాను తమకంగా.

"ఛస్! ఊర్కోండి! తీపి తినాలని ప్రాణం లాగేస్తోంటే మీ ఫ్రిజ్‌లో వున్న ఐస్‌క్రీం గుర్తొచ్చింది. దానికోసమే వచ్చా" క్రూరంగా నవ్వింది.

ఆ రాత్రి - ఆమె గాఢమైన వెచ్చని కౌగిలి, తియ్యని తొలిముద్దు మనసులో సునామి.. ఎంతో బాగుంది. చాలా చాలా కమ్మగా వుంది. కాసేపటికి నాన్న ఎప్పుడూ అనే 'కామించా'ననే పదం గుర్తొచ్చి పార్వు నుండి దూరం జరిగి - "ఇవాల్టికిది చాలు! వెళ్ళిపో! మా అమ్మ చాటుగా వుండి కూడా చూసే రకం -" అన్నాను.. నీళ్ళు నములుతూ.

"ఛస్..! ఏంటండీ అశోగ్గారూ! చూస్తే

చూణ్ణివ్వండి. మనం లేచిపోయి అయినా సరే - పెళ్ళి చేస్కుంటాం కదా! ఏవంటా రండి? " అంది టీజింగ్‌గా చూస్తూ.

"ఔనౌను! అందుకే కదూ మా నాన్నతో 'నీ కొడుకును కంట్రోల్లో వుండమనండి' అన్నావు. ఇట్లా బాల్కనీలు దూకి మరీ వస్తోంటే- ఎట్లా వుండాలండీ కంట్రోల్లో? ఆయ్? " బెదిరించాను - బయటకి నెట్టుతూ.

"సర్లెండి! నన్నటువైపుకి జాగ్రత్తగా తొయ్యండి.. జారితే సరాసరి పైకే అన్నారుగా.." అంది బాల్కనీ గోడ ఎక్కి.

ఆమె చెయ్యి, కాలు పట్టుకుని - అవతలి వైపుకి దిగేదాకా జాగ్రత్తగా గుండె చిక్కబట్టుకుని వూపిరాపి చూస్తుండగా.. చిన్న దగ్గు.. కింద నుండి లక్ష్మీపతిగారు. వెన్నెల వెలుగుకు ఆయనకంతా కనబడే వుంటుంది. క్షణ కాలంలో ఫెడేల్‌మంటూ నా భుజం తన్నేసి తన బెడ్రూంవైపు దూకింది పార్వతి. అది వూహించని నేను - దఢేల్‌మని కేన్ కుర్చీలో కూలబడ్డాను.

ఆ శబ్దానికి - అమ్మ నాన్న వచ్చి - చుట్టూ చూసి - ఏం జరిగింది? అంటూ ఆరా తీశారు.

కింద నుండి లక్ష్మీపతి చెప్పాడప్పుడు - "దొంగలమ్మ - దొంగలు.. మీ బాల్కనీ మీదుగా దూకేసి పారిపోయారు. అశోక్ బాబూ - దెబ్బలేమి తగల్లేదుగా? "

రక్షించాడు. ఆ తెల్లారి - ఇదో పెద్ద న్యూస్ అపార్ట్‌మెంటంతా. మా బాల్కనీలో దొంగలు దూరడం, నేను సాహసోపేతంగా తరమడం - విని, నేనూ, పార్వతి తెగనవ్వుకున్నాం. ఆ రోజు నేను శాక్స వాయిస్తోంటే - కింద నుంచి లక్ష్మీపతి - ఆ..c! అది.. ఇప్పుడు బాగా వస్తోందయ్యా రాగం - అంటూ మెచ్చుకోవడం - నన్నిబ్బంది పెట్టింది.

అవసరం లేకపోయినా నన్ను పార్వతి ఎందుకు తన్నాల్సి వచ్చిందో నాకర్థంకాక - అడిగేశాను.

"ప్రతిచర్య! తొలిముద్దుకు తొలి తన్ను!" అంది పెదాలు, కళ్ళు మూసి.

★ ★ ★

నా పీజీ అయిపోయింది. హైదరాబాద్‌లో లెక్చరర్‌గా జాబ్ కూడా వచ్చేసింది. వచ్చే సోమవారమే జాయినవ్వాలి. లేకపోతే ఉద్యోగం నా తర్వాతి క్యాండిడేట్‌కు ఆఫర్ చేసేస్తారు. పేజర్ల కాలం చెల్లి సెల్ ఫోన్లు ప్రాచుర్యంలోకి వస్తున్న రోజులవి.

నాన్న నాకు అమ్మకు మొబైల్ కొనిచ్చాడు. క్వెర్టీ కీ పాడ్‌తో ఉన్న బరువైన ఆ ఫోన్లు, అప్పుడో హోదా చిహ్నంగా ఉండేవి. పార్వతి కూడా ఒకటి కొనుక్కుంది. మేం యస్సెమ్మెస్‌లు ఇచ్చుకోవడం మొదలుపెట్టాం. తనకి పెళ్లి సంబంధాలొస్తున్నాయని మెసేజిచ్చింది. ఈ నేపథ్యంలో మురళి అంకుల్‌ని కలవాలని - నా ప్రపోజల్ చెప్పాలని నిర్ణయించుకున్నాను. నాన్నను తీసుకెళ్లి జగదాంబ సెంటర్లోని దస్‌పల్లా రెస్టారెంట్లో ఆయన్ని కలిశాను. ముగ్గురం వడలు తినేసి - మాట్లాడుకున్నాం. నాన్న - మురళి సంఘ సేవ గురించి కదల్చాడు. ఆయన మొదలుపెట్టాడు - చెప్పడం..

"సార్! ఒకప్పుడు తెలియక సమాజసేవ అంటూ రాజకీయాల్లోకి వచ్చాను. పెళ్లాం సంపాయిస్తోంటే ఒళ్లు తెలియక సొంత డబ్బులు ఖర్చుచేసి మరీ జనాలకి సహాయం చేశాను. ఇప్పుడు జ్ఞానోదయమైంది. నాకున్న రాజకీయ, సామాజిక వర్గపు సంబంధాలన్నీ ఇప్పుడు మరో పనికొచ్చే కోణంలో నాకు డబ్బు తెచ్చిపెడుతున్నాయి"

"అంటే? ! ఎట్లా? " అడిగాను.

"ఎలక్షన్లప్పుడు డబ్బు సంచులు పంచిపెట్టడం! ఔను - నేను ఈ కోస్టల్ బెల్ట్‌లో డిస్ట్రిక్ట్ ఇంఛార్జిపర్సన్‌ని. మన జిల్లాలో ప్రతి నియోజకవర్గానికి సంబంధించిన ఆడ మగ ఓటర్ లిస్టుల డిజిటల్ డాటా నా

దగ్గరుంటుంది. కులాలు, మతాలు, చిన్నా, పెద్ద హోదాలు గట్రా.. ఎవరెవరు స్లమ్స్ లో ఉంటున్నారు? ఎవరు డబ్బు తీసుకుని ఎవరికి ఓటేస్తారు? అనే ప్రిడిక్షన్లన్నీ చేస్తుంటాను. దాన్నిబట్టి మా పార్టీ ఫైనాన్స్ సెక్షన్, మాకు ఎంత డబ్బు పంపాలో వివరాల్ని పంపిస్తా. ఆ ప్రకారంగా డబ్బు సంచులు నా దగ్గరికొస్తాయి. వాటిని నా టీమ్ ఊళ్లకి సరఫరా చేస్తుంటుంది"

"ఇది అందరికీ తెల్సిన విషయమే కదా! మరి ఇదంతా ఆర్గనైజ్ చేయడం వల్ల మీకొచ్చే లాభం? " అడిగాడు నాన్న.

మురళి తలగోక్కుని - "సార్! అన్ని డబ్బు సంచులూ ఓటర్లకు చేరవు. ఎందుకంటే- రాత్రికి రాత్రి ప్రిడిక్షన్లు మారిపోతుంటాయి. జనాలు కూడా అన్నిపార్టీల దగ్గర డబ్బులు గుంజుతుంటారు. వాళ్లనుకున్న వారికే చివరికి ఓటేస్తారు. పక్కాగా మా క్యాండిడేట్ కే ఓటేస్తారు అనుకున్న వర్గానికి చెందిన ఓటర్లకి మేం డబ్బులు పెద్దగా పంచం. అట్లాగే వాళ్లు అసలు మనకు ఓటేసే ఛాన్స్‌లేదు అని రూఢిగా తెలిసినా డబ్బులు పంచం. ఆ మానిప్యులేషన్స్ అన్నీ బాగా ఆపోశన పట్టాను. ఆ లెక్కన ప్రతి ఎలక్షన్లకు నాకు కనీసం కోటి రూపాయలైనా మిగులుతాయి. ఓ యాభై మా టీం అంతా పంచుకున్నాక, మిగిలిన యాభై పార్టీ ఆఫీసు ఖజానాలో తిరిగి డిపాజిట్ చేస్తాం. అట్లా నమ్మకం నిలబెట్టుకుంటాం" వివరించాడు.

"ఈ లెక్కన - మీరు బోల్డన్ని కోట్లు సంపాదించి ఉండాలి గదూ అంకుల్!" అన్నాను ఆశ్చర్యపోతూ.

ఆయన అడ్డంగా తలూపాడు లేదన్నట్లు. "చాలాసార్లు- దొంగ నోట్లు కూడా వస్తుంటాయి. జనాలకి ఫేక్ కరెన్సీ పంచితే - బ్యాడ్‌నేమ్ వస్తుంది. అందుకని జాగ్రత్తగా స్క్రీన్ చేసి డబ్బు సర్దాల్సి ఉంటుంది. జనాలు ఫేక్ ఆల్కాహాల్‌ని ఒప్పుకుంటారు గానీ, ఫేక్ మనీని ఒప్పుకోరు. మా టీమ్‌కొచ్చిన దొంగనోట్లని నేనే రిప్లేస్ చెయ్యాల్సుంటుంది. అట్లా, ఒక్కోసారి నాకు మిగిలేది పెద్దగా ఉండదు. నేనీపని చేస్తున్నందుకు నాకూ బాధగానే ఉంది. నన్ను ప్రేమించి పెళ్లాడిన లిల్లీ - నన్ను నిరసిస్తోంది. పార్వతికి ఇవన్నీ తెలియదు" అంటూ సిగరెట్ వెలిగించాడు, లాబీలోకి నడుస్తూ.

"అన్నట్టు చెప్పడం మర్చిపోయా. అశోక్! నేనిక సిగరెట్లు మానేయాల్సిన అవసరం లేదని తెల్సిపోయింది" అన్నాడు తనే మళ్ళీ.

"ఎందుకంకుల్? "

"నాకు లంగ్ క్యాన్సర్ డిటెక్టయ్యింది. జోకేంటో తెల్సా?! ఇది స్మోకింగ్ వల్ల వచ్చే రకపు క్యాన్సర్ కాదంట! అరుదుగా వచ్చే రకమంట. అయినా - ఇంకో ఐదేళ్ళు బతకొచ్చని అంచనా వేశారు డాక్టర్లు" చెప్పి - గట్టి దమ్ము పీల్చి వదిలాడు.

ఇంక మనం వచ్చినపని మాట్లాడుకుందామా? అన్నట్టు నాన్న చూట్టంతో - నేను "పార్వతిని అడగటానికి వచ్చా"నని చెప్పాను.

మురళి కాసేపాలోచించి-

"నాకు తెల్సు. మీరిద్దరూ క్లోజ్ ఫ్రెండ్సని. తనకి చిన్నప్పట్నుంచీ షుగర్ ఉంది. చాలా కష్టపడుతూ పెరిగింది తను. ఇప్పటికి తన ఇంజినీరింగ్ పూర్తయింది. కానీ - రానున్న కాలంలో తను ఆరోగ్యంగా ఉండాలంటే తనకి అమెరికానే కరెక్ట్ అని నేనూ, లిల్లీ అనుకున్నాం. ఈ మధ్యే ఒక అమెరికా మ్యాచ్ చూశాం. అబ్బాయి కూడా షుగర్ పేషంటే. పార్వతిని నచ్చాడు. బాగా రిచ్ పార్టీ. త్వరలో ముహూర్తాలు.." అన్నాడు, ఇంకో సిగరెట్ చేతిలోకి తీసుకుని.

"కానీ - అంకుల్! తను నన్నిష్టపడుతోంది. మేం ప్రేమించుకుంటున్నాం.."

అన్నాను నీళ్లు నములుతూ.

మురళి పకపకా నవ్వాడు - నే చెప్పింది విని నా వంక జాలిగా చూశాడు.

నాన్న ఏదో సర్ది చెప్పబోతుండగా - మురళి చెయ్యి అడ్డంపెట్టి-

"అశోక్! నేను చెప్పేది బాగా విను. నిజం చెప్తున్నాను. లిల్లీ నన్ను ప్రేమించింది. ఆ విషయం తెలిసి నేనూ తననిష్టపడ్డాను. మా పెళ్లి జరిగింది. కాలం గడిచే కొద్దీ - మా ప్రేమకి ప్రాముఖ్యం అంటూ ఏమీ లేదని తేలింది. ఎందుకంటే అరేంజ్డ్ మ్యారేజీలతో పోలిస్తే - నా కాపురం పెద్ద గొప్పగా ఉన్నదేం లేదు. మరి అట్లాంటప్పుడు - ఈ 'లవ్' అనే దానికి అర్థం ఎక్కడుంది? అదంతా యవ్వనంలో కలిగే మనోవికారం అని నా ఫీలింగ్. పార్వతిని నువ్విష్టపడు. వద్దనట్లే. తనూ నిన్నిష్టపడనీ! ఎవరికీ ఏ ఇబ్బందీ లేనంత కాలం - అందరం ఇష్టపడుకోవచ్చు. ప్రేమిస్తే పెళ్లాడాలని ఎవరు చెప్పారేంటి? అసలు ప్రేమకు - పెళ్లి, కరెక్ట్ కాదు. నువ్వు పార్వతిని జీవితాంతం ఇష్టపడాలంటే - తనని పెళ్లి చేసుకోవడం గురించిన ఆలోచన తీసెయ్! ఓ ఇరవై ఏళ్ల తర్వాత తను నీకు గుర్తొస్తే - నీ నరాలు జివ్వుమనాలి. తను నీకు కనిపిస్తే గుండె జిల్ మనాలి. నిజమైన ప్రేమకు, నిజమైన ఇన్సూరెన్స్ ఏదైనా ఉందంటే, ఇదే!"

నాన్న నన్ను తీసుకుని తన స్కూటరెక్కించుకుని ఇంటికి తీసుకొచ్చాడు. వచ్చే సోమవారం నేను రైలెక్కి హైద్రాబాద్ వెళ్లాలి. మళ్లీ నెలదాకా రావడం కుదర్దు. ఈలోపు పార్వూకి పెళ్లయిపోతే? !

ఆ తర్వాత ఏం జరిగిందో తెలీదుకానీ - నాన్న, ఆదివారం సాయంత్రానికి రెండు రైలు టికెట్లు విడివిడిగా తెచ్చి ఇచ్చాడు. ఆ రెండోది - పార్వతికి.

"పార్వతిని రైలెక్కించే పూచీ నాకొదిలెయ్" అని భరోసా ఇచ్చాడు- నాన్న!

కానీ, శనివారం మధ్యాహ్నం అమ్మ ఛాతిలో నొప్పితో సెవెన్ హిల్స్ ఆస్పత్రిలో అడ్మిట్టయింది. ఐసీయులో మగతలో ఉన్న అమ్మ నన్ను దగ్గరికి లాక్కుని - నా తలని తన ఎడమ రొమ్ముకానించి - "అశోక్! హార్ట్ ఎటాక్ అంటున్నార్రా డాక్టర్లు. నా హార్ట్ నువ్వేనని వాళ్లకి తెలీదురా" అని కన్నీళ్లు పెట్టుకుంది. మా అమ్మ - ఇంత ఎమోషనల్‌గా మాట్లాడగలదని నాకప్పటిదాకా తెలీదు.

ఆ రాత్రి - గుండె డాక్టరు - అమ్మకు మైల్డ్ ఎటాక్ వచ్చిందనీ, ప్రాణాపాయం తప్పినట్టేనని చెప్పడంతో నా దుఃఖం ఆగింది. నాన్న తన తల నేలకేసి తన అసహాయతని వ్యక్తపరిచాడు. పార్వతి టికెట్టు తీసి అక్కడే చించేశాను.




సికింద్రాబాద్‌లో రైలు దిగి సరాసరి బేగంపేట డిగ్రీ కాలేజీలో జాయినింగ్ రిపోర్టిచ్చాను. పార్వతి సెల్ స్విచాఫ్ వస్తోంది. అమ్మ ఫర్వాలేదు. గండిపేట చెరువు, లుంబినీ పార్కు, ప్యారడైజ్ బిర్యానీ ఇలా ఏవీ కూడా నా మనసును స్థిమితం చేయలేకపోయాయి.

వారం గడిచాక, ఉండబట్టలేక కాలేజీ ప్రిన్సిపాల్‌ని బతిమిలాడి ఐదు రోజులు సెలవు పెట్టి బస్సులో వైజాగ్ చేరుకున్నాను. అమ్మ డిశ్చార్జయి - ఇంట్లో ఇంకా మంచం మీదే ఉంది. నాన్న అమ్మ దగ్గ

ర్నుంచి కదలట్లేదు.

నన్ను చూడంగానే అమ్మ దగ్గరికి తీసుకుని కౌగిలించుకుని దుఃఖించింది.

"రేయ్! నీ కోసం - నేనే వెళ్లి, స్వయంగా నేనే వెళ్లి - పార్వతిని ఇవ్వమని అడిగేన్రా. చూడు - నన్ను తిట్టేసి పంపించేశారు. మీ నాన్నను కూడా బెదిరించారు. ఆ పిల్ల నిశ్చితార్థం చేసేశార్రా" అంటూ వలవల ఏడ్చింది.

నాన్న వివరించాడు - "అమ్మకు విషయాలన్నీ తెల్సినై. ఆస్పత్రి నుంచి డిశ్చార్జై రాగానే ముందుగా లిల్లీ దగ్గరికి వెళ్లేసి అడిగింది. పేషంటని కూడా చూడకుండా ఆవిడ - అమ్మను కసిరింది. నన్ను ఇంకో సారి మురళితోగానీ పార్వతితోగానీ మాట్లాడొద్దని ఒట్టు పెట్టించింది"

వారం తర్వాత నేను, అమ్మ - నాన్నతో హైదరాబాద్ వచ్చేశాను. చుట్టాలింట్లో ఉంటూ, ఒక డబుల్ బెడ్రూం ఇల్లు వెతుక్కుని షిఫ్టయ్యాం. అమ్మ దగ్గరి చుట్టాలు తెచ్చిన పెళ్లి సంబంధం చూడాలని - అమ్మ నాతో ప్రమాణం చేయించుకుంది.

అట్లా నిరోషా నా జీవితంలోకి ఎంటరైంది. పెళ్లి చూపుల్లో 'సెపరేట్'గా మాట్లాడి - పార్వతి గురించి మొత్తం చెప్పేశాను నిరోషాకి. ఫర్లేదంది. కొన్నేళ్లకు అదంతా మర్చిపోతాం అంటూ హామీ ఇచ్చింది.

మా కుటుంబ సంప్రదాయం ప్రకారం - మా ఇంటి పెళ్లిళ్లన్నీ సింహాచలంలో జరగాలి. పెళ్లికి ఇంకో నెలరోజుల టైం ఉంది. వారం ముందే వైజాగ్ వెళ్లిపోయాం.

పార్వతి పుట్టిన రోజు మళ్లీ వచ్చింది. అదేరోజు ఆమెను పెళ్లి కూతుర్ని చేసే రోజు! సన్నాయి మేళం డప్పు వాద్యం హోరులో నేను బాల్కనీలో నించుని మోగించిన శాక్సా స్వరం ఇద్దరికి మాత్రమే వినిపించింది వారు.. ఒకరు - లక్ష్మీపతి, ఇంకొకరు పార్వతి. తన బాల్కనీ డోర్ దాకా పరిగెత్తుకుంటూ వచ్చి అక్కడ ఆగి డోర్ దగ్గర చతికిలబడి - నా పాట వింటోంది పార్వతి. లక్ష్మీపతి నా వంక జాలిగా, ఆర్ద్రంగా చూస్తున్నాడు - బ్రష్ చేయడం ఆపి.

కాసేపయ్యాక బాల్కనీలోకి దూసుకొచ్చి - నా చెంప ఛెళ్లుమనిపించింది - "ఒక్క మాట.. ఒక్కమాట - నన్ను హైదరాబాద్ వస్తావా - లేచిపోదాం - రా - అని ఉంటే వచ్చేదాన్ని కదండీ అశోగ్గారూ..!" అని గట్టిగట్టిగా ఏడ్చేసింది. మా ప్రేమ సాక్షి - లక్ష్మీపతి చూస్తుండగా.

ఆయన నోట్లోంచి బ్రష్ జారి కింద పడిపోయింది.

అదే- నేను, పార్వతిని చివరిసారి చూట్టం. నా పెళ్లిరోజు నాకు ఉపనయనం చేస్తూ, బాసిగాలు కడుతూ నా పంచె సరి చేస్తూ నాన్న పదేపదే ఒక్కటే మాట చెప్పాడు - "పెళ్లాన్ని అన్ కండిషనల్‌గా ప్రేమించేవాడే నిజమైన మగాడు! చివరికి మగవాడ్ని కాపాడేది - ఆ ప్రేమే!" అని.

ఆ తర్వాత కొద్దిరోజులకే నాన్న - నిద్రలోనే నిష్క్రమించాడు. ఇంకా విచిత్రంగా, అమ్మ - నాన్న చనిపోయిన పదకొండో రోజున కర్మకాండ ముగించి - మళ్లీ ఛాతి నొప్పి తెచ్చుకుంది - పుట్టెడు దుఃఖంతో అమ్మ - ఆ నిమిషంలో మళ్లీ నా తలని తన రొమ్ముల కానించుకుంది.

## కొత్తగాలి...

**వసంతం**
**తొడిగింది**
**కొత్త సొగసుల్ని**
**చెట్లకు!**

– వి. మురళీకృష్ణ,
హైదరాబాద్

"నాకు కూడా హార్ట్ ఎటాక్ వచ్చినాక - ఇంక నేనెట్లా బతుకుతానురా! నా వల్ల - నీ పెళ్లి వేరొకళ్లతో జరిగింది. నువ్వు నవ్వడం లేదు. నీ మనసులో దుఃఖం నా కళ్లకు కనిపిస్తోంది. నాన్న కూడా అదే చింతతో పోయాడు. ఇప్పుడు నాకూ అదే గతి పడుతోంది. అశోక్! మీ నాన్న నన్ను ప్రేమించినట్టుగానే నువ్వు కూడా నిరోషాను ప్రేమించు నాన్నా.. గతం మర్చిపో.."

ఆ తర్వాత రెండేళ్లకే పోయింది. పుట్టిన పాపకి - అమ్మ పేరే పెట్టాను. మధుమతి - మధులిక.

★ ★ ★

నా లవ్‌స్టోరీ అంటే ఇదేగా!? త్రినాథ్ గుర్తొచ్చాడు. ఈ ప్రపంచంలోకి వచ్చింది, నా మనసు, తేలికై. ఆ తర్వాత నాకు వీలైనన్నిసార్లు త్రినాథ్ మంచం పక్కనే గడిపాను. ఆయనకు ఆపరేషన్ అయ్యాక కూడా గుండెపోటు రావడంతో చాలా రోజుల్నించి, చారి, డిశ్చార్జ్ కానివ్వకుండా అక్కడే ఉంచుతున్నాడు. త్రినాథ్ ఒకటి రెండు పలకరింపులు తప్ప పెద్దగా మాట్లాడగలిగేదేమి లేదు. ఆయనకి సంపూర్ణ ఆరోగ్యం చేకూరాలని, తిరిగి 'ప్రియదర్శిని'లో మేమిద్దరం కలిసి వాకింగ్ చెయ్యాలని దేవునికి దండాలు పెడుతూనే ఉన్నాను.

ఈలోపు, స్వప్న తన వృత్తాంతాన్ని పంపించింది. ఇంగ్లీష్‌లో రాయాల్సి రావడం వల్లనేమో, తన భావావేశాల్ని ఎక్కువ వాక్యాల్లో చెప్పాల్సి వచ్చింది. తను ప్రకటించిన విషయం 'లోతు'పాతులు నాకు చెప్పే ఆరాటం స్పష్టంగా కనబర్చింది.

*టు, డియర్ అశోక్ అంకుల్!*

*ఆ రోజు బాగా వర్షం కురుస్తోంది. రెండు రోజులుగా కుండపోతగా పడింది. కరెంటు కూడా లేదు. అయినా మా మమ్మీ ఆఫీసు నుండి రాలేదు. ఇంట్లో నేనొక్కదాన్నే బిక్కు బిక్కుమంటూ. ఆటోలో స్కూల్ నుండి వచ్చేశాక విపరీతమైన ఆకలి. పండ్లు, బిస్కట్లు, స్నాక్స్. ఏవీ లేవు. మామూలుగా అయితే, మమ్మీ ఇంటికొచ్చే టైం. మరీ ఆలస్యంగా రావటం మొదలెట్టింది. అప్పుడు నాకు బాగా గుర్తు- ఎయిత్ స్టాండర్డ్‌లో హాఫ్ ఇయర్లీ పరీక్షల టైం.*

*డాడీ బాగా డ్రింక్ చేసి ఆ వర్షంలో బైక్ మీద తడిసి ముద్దయ్యి ఇంటికొచ్చాడు. నేను సోఫాలో ఒక మూల కూర్చుని భయంగా డాడీని గమనిస్తున్నాను. ఆయన మమ్మీవాళ్ళ ఆఫీసుకు ఫోన్ చేస్తే ఏం చెప్పారో ఏమోగానీ - ఫోన్ రిసీవర్ గోడకేసి కొట్టాడు. రాత్రి ఎనిమిది - ఇద్దరం చెరో సోఫాలో చేరగిలబడి మమ్మీ కోసం ఎదురుచూస్తున్నాం. మమ్మీ రావడంతోనే డాడీ గట్టి గట్టిగా అరుస్తూ వీపు మీద చరిచాడు. దాంతో మమ్మీ కూడా రెచ్చిపోయి బూతులు మాట్లాడింది. ఇద్దరూ బాగా తిట్టుకున్నారు. ఆ రాత్రి, తెల్లారి ఉదయం పొయ్యి వెలగలేదు. పాలు వేడిచేసి వాళ్ళిద్దరికీ ఇచ్చి నేను తాగి నా ఆకలి చల్లార్చుకున్నాను.*

*ఇట్లాంటి సీన్లు బహుశా ఓ ఆర్నెల్ల పాటు జరిగాక మమ్మీ పోలీస్ కంప్లైయింట్ ఇస్తే నాన్నని పోలీసులు పట్టుకెళ్ళి రెండ్రోజులు జైల్లో వుంచారు.*

*ఆ తర్వాత నెలకు - ఓ ఉదయాన్నే డాడీ కొన్ని పేపర్లు పట్టుకుని కన్నీరు మున్నీరుగా విలపిస్తుంటే వెళ్లి అడిగాను.*

*"విడాకులు సంతకం చేసిన అర్జీని వదిలి - చీరెలు, డబ్బులు, నగలతో వెళ్ళిపోయిందమ్మా మీ మమ్మీ!" అని చెప్పంగానే ఇద్దరం మళ్ళీ ఏడ్చాం.*

*ఆ సంఘటన నా జీవితపు దిశనే మార్చేసింది. నాన్నకు కూడా.*

*ఆ రోజు నుంచి నాన్న డ్రింక్ మానేసి నన్ను కంటికి రెప్పలా చూసుకోవడం మొదలుపెట్టాడు. ఎవరెన్ని చెప్పినా మళ్ళీ*

పెళ్లి కూడా చేసుకోలేదు.

ఆయన ఆశయం ఒక్కటే - నాకు పెళ్లి చేసి అమెరికా పంపించి సమాజం ముందు ఒక బాధ్యత గల తండ్రిగా తలెత్తుకోవడం!

అంతేనా అంతకు మించి ఏం లేదా?

నాకు నా తండ్రి - తండ్రి పట్ల నాకేమి బాధ్యత లేదా? నా తల్లి వదిలేసినట్లు నేను కూడా ఈయన్ని వదిలేసి వెళ్లిపోవాలా? 'మీ మమ్మీ అమెరికాలో సాఫ్ట్‌వేర్ కంపెనీకి అధినేత - వీలైతే ఆమె కంపెనీలోనే నువ్వు జాబ్ సంపాదించి ఆమె ముందు గర్వంగా తలెత్తుకుని తిరగాడితేనే నా కోపం చల్లారుతుంది! మీ అమ్మకు తానెంత తప్పు చేసిందో జ్ఞానోదయమై చిన్నబుచ్చుకోవడం నువ్వు కళ్ళారా చూడాలి' అనే లక్ష్యం పెట్టుకున్నాడు డాడీ.

నిజం చెప్పాల్నా అంకుల్! నాకిప్పుడు మా మమ్మీ మొహం సరిగ్గా గుర్తులేదు. గుర్తుకు తెచ్చుకోను కూడా.

ఒకరోజు బస్టాప్‌లో మోహన్ పరిచయమయ్యాడు. తీరా చూస్తే మా అపార్ట్‌మెంట్‌లోనే వాళ్ళ ఇల్లు.

నాకు మోహన్‌ని చూసిన మరుక్షణం లోనే ఇతను నాకు బాగా తెల్సు ననిపించింది. ఒకరకమైన గుబులు, కన్ఫ్యూజన్. దేవుడున్నాడు.. నన్ను చూస్తున్నాడు అనుకున్నాను. కానీ.. కానీ - మోహన్‌తో బాగా పరిచయం పెరిగి - వాళ్లింటికి వెళ్లినప్పుడు అక్కడ ఒక దేవతనే ప్రత్యక్షంగా చూశాను. మోహన్ వాళ్ళ మమ్మీ - అనసూయ గురించి చెప్తున్నా.

నన్ను ఆమె చూడంగానే లైక్ చేసింది.

నా చిన్నప్పటి ఫొటోలున్న ఆల్బమ్ అన్నీ తీయించి మరీ చూసింది. మనమీద ఎవర్నికైనా ఇంట్రెస్టు కలిగింది అనడాన్కి ఇదో సంకేతం కదూ! మా మమ్మీ గురించి ఆరా తీసి ఆమెను ద్వేషించవద్దని - ఆమెకు నచ్చినట్టు ఆమె జీవించాలని నిర్ణయం తీసుకుందని - అంత నిర్భయంగా బతకగలగడం కూడా ఒక కళ అని విడమర్చి చెప్పింది.

గత ఏడాదిగా నా తలకు నూనె రాసి - జడ అల్లి, నుదుట బొట్టు పెట్టి దిష్టితీసి.. మా మధ్యలో ఉండటాన్కి - మోహన్‌కే బోరుకొట్టేటంత బాగా చూసుకుంటోంది!

మోహన్ నా సోల్‌మేట్. అనసూయాంటి అంతకంటే ఎక్కువే అనిపిస్తుంది. బహుశా మా మమ్మీకి నేను దూరమవ్వడం వల్ల అనసూయ ఆంటీకి బాగా దగ్గరైపోయానేమో అనిపిస్తుంది.

అంకుల్! ఇవన్నీ మీరడిగిన ప్రశ్నకి ఆన్సర్ కాకపోవచ్చు - కానీ ఈ విషయాలు మీతో పంచుకోవాలని నాకెందుకు అన్పించిందో అర్థం కావట్లేదు.

మిమ్మల్ని రైల్లో కలిసిన రోజు - శాక్సాఫోన్ పోటీలో నాకే ప్రైజు వచ్చింది. కావాలనే మీకు చెప్పలేదు. డాడీకి కూడా! మీతో పరిచయం పెంచుకోవడానికి, మీరు నన్ను ఓదార్చి, శాక్సా నేర్పిస్తారనే ఆశతోనే మీకబద్ధం చెప్పాను. క్షమించండి. మీరు నాపట్ల చూసే చూపులో - ఎంతో సానుభూతి, దయ, ప్రేమ నిండివుంటాయి. నా గురించి మీకు అంతా ముందే తెలుసు అన్న భావన కలిగింది. మీ మాటలు నాకు సాంత్వన నిచ్చేవి. మీరు శాక్సా వాయిస్తుంటే మైమరచేదాన్ని.

అంకుల్! ఇలా రాస్తున్నానని మీరేమీ ఫీల్‌కావద్దు. నాకు ఈ ప్రపంచంలోని విషయాలు ఎక్కువగా తెలియదు. మమ్మీ చేసిన మోసానికి నా రియాక్షన్ ఏంటంటే నాకు నచ్చిన వాళ్ళందర్నీ 'ఓన్' చేసుకోవడం. కౌమార దశలోకి అడుగుపెట్టిన పదమూడేళ్ళ అమ్మాయికి అమ్మ అవసరం ఎంతో వుంటుందని నాకప్పుడు తెలియదు. మా మమ్మీకీ తెలియకపోవడం శోచనీయం. అనసూయాంటీ గనక నా జీవితంలోకి రాకపోయి ఉంటే - నా ద్వేషాన్ని మరవగలిగేదాన్నే కాదు. అట్లాగే 'కన్సర్న్'

అంటే ఏంటో మీరే నాకు తెలియజెప్పారు.

మోహన్ నాకు ప్రేమించడం నేర్పాడు అని చెప్పుకోవడం కంటే - ఒక పురుషుడితో స్నేహం ఎట్లా వుంటుందో నా పిచ్చి బుజ్జి మెదడుకు జ్ఞానోదయం కలిగించిన రుషి అని చెప్పొచ్చు.

ప్రస్తుతం నా దృష్టంతా చదువుమీదే!

ప్రేమిస్తున్నానా? అంటే మోహన్ గురించేగా మీకనుమానం?

మోహన్‌తో మంచి స్నేహం అయితే ఉంది. అది ప్రేమగా మారిందని ఎవరైనా చెప్తే తెలుస్తుందేమో! లేదా రానురానూ అవుతుందేమో! ఇప్పుడైతే అనసూయాంటీనే నేను ప్రేమిస్తున్నాను. మా నాన్న గురించే ఆలోచిస్తున్నాను. మా అమ్మను ద్వేషించడం మానుకున్నాను. నేనీ ఉత్తరం రాసేటప్పుడు ఆంటీ నా పక్కనే టీవీ చూస్తోంది! ఆమె క్రీగంటితో చూస్తూ చదువుతున్నట్లుంది కాబోలు!

ఇట్లు,
మీ అభిమాని,
స్వప్న

నోట్: నిరోషా మేడమ్, మధులిక అంటే నాకిష్టం.

దయచేసి ఈ లెటర్‌ని మేడమ్‌కు చూపించకండి. నాకు మెచ్యూరిటీ లేదని నా మీద ఉన్న ఇంప్రెషన్ కూడా పోతుంది.

★ ★ ★

ఉత్తరం చదివి నిరోషా నిట్టూర్చింది. కాసేపటికి నావైపు చూసి పకపకా నవ్వింది.

"నేను ముందే చెప్పానా? చెప్పండి ఆ పిల్ల మీకు ఏం ఎగస్ట్రా ఇన్ఫర్మేషనిచ్చిందో. వెరీ చైల్డిష్. ఇమ్మెచ్యూర్" అంది.

నేను వెంటనే స్వప్నకు కాల్ చేశాను.

# చతుర ప్రవేశిక

## జులై చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. అనసూయ కొడుకు?
జ.
2. స్వప్న తల్లి?
జ.
3. మోహన్ తాతాజీ అని పిలిచేదెవర్ని?
జ.
4. అశోక్ రాణా కూతురు?
జ.
5. త్రినాథ్ బాల్య మిత్రుడు?
జ.
6. పార్వతికున్న జబ్బు?
జ.
7. త్రినాథ్, అశోక్‌లు కలుసుకునే పార్క్?
జ.
8. అశోక్ భార్య?
జ.
9. పార్వతి తండ్రి?
జ.
10. 'పూర్వా సంధ్యా ప్రవర్తతే' రచయిత్రి?
జ.

పంపినవారి పేరు: ---------------------------------------------వయసు (    )

చిరునామా: --------------------------------------------------------

---------------------------పిన్‌కోడ్ :                ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

"స్వప్నా! ఉత్తరం బాగా రాశావమ్మా! కొంచెం ట్రైచేస్తే మంచి రచయిత్రివి కాగలవు. నీ ఇంగ్లీషు పర్‌ఫెక్ట్‌గా వుంది"

"థ్యాంక్స్ అంకుల్"!

"నాకు మోహన్ అభిప్రాయం కూడా వినాలని ఉంది. వీలున్నప్పుడు అతనితో పార్క్‌లో మాట్లాడతాను. త్రినాథ్ తాతాజీ కూడా మోహన్ విశేషాలు కొన్ని నాతో షేర్ చేసుకున్నారు"

"కానీ.. వై? అంకుల్? ఇదంతా దేనికి? "

"దేనికో? త్రినాథ్‌గారికి ఆరోగ్యం పాడైంది కాబట్టి తెలియడం లేదమ్మా! అనసూయ గార్ని కూడా పరిచయం చేస్తావు కదూ"

కొంచెం గ్యాపుతో "ఓకే అంకుల్! ఇప్పుడే వాళ్ళిద్దరికీ చెప్తా. అన్నట్టు - గుర్తుందిగా, రిప్లైగా మీ లవ్‌స్టోరి పంపిస్తున్నారు కదూ, వెయిట్ చేస్తున్నా, గుడ్‌నైట్" అంటూ స్వప్న ఫోన్ పెట్టేసింది.

నిరోషా నావైపు కొరకొరా చూసి- "ఎవ్వరూ తమ పర్సనల్ విషయాలు ఒక అపరిచితుడితో పంచుకోరు! మీరంటే వాళ్ళందరికీ గౌరవమో, అభిమానమో వుండొచ్చుగాక, అవసరం కూడా వుండొచ్చు. కానీ - వాళ్ళు చెప్పేదంతా నిజమని ఏమిటి గ్యారంటీ? అసలు, మీకెందుకండీ ఇదంతా అని నిలదీస్తే మీ దగ్గర సరైన జవాబుందా? " నన్ను వాయించేసింది.

నిరోషాకి కోపం వచ్చిందంటే - ఇల్లు మూగవోతుంది. సరిగ్గా మాట్లాడదు. ఏదైనా చెబితే వినదు. విన్నా - స్పందించదు. టీ పెట్టాలా అని అడగడానికి - రెండు చూపుడు వేళ్ళని ఇంగ్లీషు 'టి' ఆకారంలో పెట్టి చూపిస్తుంది. నేను ఎట్లాగూ ఆమె కరుణా కటాక్ష వీక్షణాల కోసం కాసుకుని కూర్చుంటాను కాబట్టి ఆమె సైగలకు స్పందిస్తూనే వుంటాను. మధులిక మీద అకారణ కోపం చూపిస్తుంది. నేను

పాపను దగ్గరికి తీసుకుని ఓదారుస్తుంటే - అంతా అయ్య గారాబమే - అందుకే కూతురికి ఏది మంచో ఏది చెడో తెలియడం లేదు. - అంటూ ఒక డిబేట్‌కి తెర లేపుతుంది. కిచెన్‌లోంచి గ్లాసులు, గరిటెలు శబ్దం చేస్తూ పనిచేస్తుంటాయి. అంట్లు తోమడానికొచ్చే పనావిడకు ఇదంతా ఏమాత్రం అర్థం కానీయకుండా చాలా సౌమ్యంగా - రెండు మూడు మాటలు ఎక్కువే మాట్లాడుతుంది.

నాకిష్టంలేని గోరుచిక్కుళ్ళు, పెసరపప్పును మార్చి మార్చి వండుతుంది. గోధుమ రవ్వ ఉప్మాను మన జాతీయ వంటకంగా ప్రకటించాల్సిన అవసరం ఏదో ఉన్నట్టు ఉదయం, సాయంత్రం అదే.. అదే.

ఇక రాత్రి విషయానికొస్తే -చేయీ కాలూ తగలనంత దూరంలో బియ్యం బస్తాలో కుక్కి కుట్టేసినట్లు బెడ్‌షీట్‌లో ముడుచుకుని దీక్ష ప్రకటిస్తుంది. పొరపాటున పిలిచినా, కదిపినా.. లేచి హాల్లోకి వెళ్ళి సోఫాలో పడుకుంటుంది. లేదా శిఖరాగ్ర సమావేశం నిర్వహించి సంధి ఒడంబడికలు చేస్తుంది.

సపోజ్ - నాకే కోపం వచ్చిందనుకుందాం! తనదే తప్పని రుజువైనాక నాకే కోపం వచ్చి అప్‌సెట్ అయ్యానే అనుకుందాం.. పొద్దున్న లేచిన దగ్గర్నుంచీ - టీ కావాలన్నా, టిఫిన్ కావాలన్నా ఆమెనే కదా అడగాలి! ఉద్యోగానికి వెళ్లబోయే ముందు ఓకే, బై, జాగ్రత్త.. అంటూ చెప్పాలి కదా - చెప్పకపోతే సీన్ రివర్సయి చిన్నగీత పక్కన పెద్దగీత సామెతలాగా నా తప్పే పెద్దదిగా రిజిష్టరైపోతుంది! ఇంటికి రాగానే మునక్కాడల పప్పుచారో, సేమియా పాయసమో రెడీగా వుంచుతుంది. అప్పటికే తనని క్షమించేసి వుండటం వల్ల - అవన్నీ ఆరగించేసి శాంతియుత వాతావరణం నెలకొల్పి - కళ్ళలోకి చూసి నవ్వినా - రాత్రయ్యాక హోరోస్కోప్ బాగుంటుందని నమ్మకమైతే లేదు! ఎగరేసిన శాంతి కపోతాలన్నీ ఆకలేసి మళ్ళీ మన పెరట్లోకే దూరినట్లు..

ఇవన్నీ జరిగి జరిగి - గొడవల ఫ్రీక్వెన్సీ బాగా తగ్గించేశాం. అయినా- ఈ త్రినాథ్ పుణ్యమా అని మళ్ళీ తప్పట్లేదు. చూద్దాం.

★ ★ ★

రెండు రోజుల తర్వాత త్రినాథ్ పక్కనే మేగజైన్ చదువుతూ చారి కనబడ్డాడు.

"థాంక్స్ అశోక్! ఇట్లాంటి ఆత్మీయ బంధువులే వీడికి మిగిలారు. ఆ మెడికో అబ్బాయి మోహన్ కూడా చాలాసార్లు వచ్చాడు. ఆ అబ్బాయి ఈ హాస్పిటల్లో నైట్‌డ్యూటీ చేస్తూ త్రినాథ్‌ని గుర్తుపట్టిన క్షణం నుంచీ - అబ్బో - ఏం హెల్పండీ, నేనిట్లా వీణ్ణి వదిలేసి తిరుగుతున్నానంటే అతనున్నాడనే ధీమానే!" చెప్పాడు చారి.

త్రినాథ్ పరిస్థితి కొంచెం మెరుగైంది. కానీ - ఇంతకు ముందులాగ వాగ్ధాటి లేదు. చాలారోజులు వెంటిలేటర్ ట్యూబ్ గొంతులో వుండటం వల్ల ఆయనకి ఉచ్చారణ సరిగా రావడం లేదు. డాక్టర్లు కూడా గొంతుకి రెస్ట్ ఇవ్వమన్నారు. ఆయన్ని డిశ్చార్జ్ చేయకుండా - చారి, మోహన్‌తో సిఫారసు చేయిస్తున్నాడు. ఏమాత్రం రిస్కు తీసుకోవడం వాళ్ళిద్దరికీ ఇష్టంలేదు. బహుశా నాక్కూడా.

నేను చారితో కలిసి హాస్పిటల్ క్యాంటీన్లో కాఫీ తాగాక అడిగాను.

"త్రినాథ్‌గారు నాతో మోహన్ పర్సనల్ లైఫ్ గురించి కొంత చెప్పారు. ఆ అబ్బాయి ఏదో ప్రేమను త్యాగం చేశాడనో, ఏదో సమ్‌థింగ్.. అది పూర్తిగా చెప్పేలోపే - ఇట్లా హాస్పిటల్‌లో జాయినయ్యాడు. ఆ కథ 'సశేషం'గానే మిగిలిపోయింది. మీకేమన్నా ఆ విశేషం తెలుసా? "

"మోహన్ గురించైతే వాడు నాకు ఏమీ చెప్పలేదు. కాకపోతే.. ఒక ఆర్నెల్ల క్రితం ఏదో జరిగింది. కొంచెం ఛెస్ట్‌పెయిన్

## జూన్ - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ ఐదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **ఆర్. లక్ష్మి**
   - మోతీనగర్, హైదరాబాద్
2. **సయ్యద్ జమిలాబేగం**
   - కమలానగర్, కర్నూలు
3. **పి. విజయలక్ష్మి**
   - కాకినాడ, తూ.గో. జిల్లా
4. **పి.వి. రంగాచార్యులు**
   - వనస్థలిపురం, హైదరాబాద్
5. **జి. శ్రీహరి**
   - పాకాల, చిత్తూరు జిల్లా

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. కరుణాకర్ | 6. శారదాదేవి |
| 2. స్వామినాథం | 7. కావిలిపాటి విజయలక్ష్మి |
| 3. కరుణాకర్ అసిస్టెంట్ | 8. జానకమ్మ |
| 4. దొరై సింగం | 9. కృష్ణ |
| 5. జమీందారు కూతురు | 10. వత్సల |

కూడా వచ్చింది. అప్పట్నించే వీడు సిక్ అయ్యాడు. ఏం జరిగిందని నేనూ గట్టిగా అడగలేకపోయాను. వాడూ చెప్పదలుచుకోనట్టుంది!"

"అదే.. చారిసాబ్.. అదే తెలియాలి. ఏదో పర్పస్ లేకుండా ఇవన్నీ జరగవు! దీన్ని గాఢంగా నమ్ముతున్నాను"

"దేన్ని? "

"ఇదంతా! నేను మా యింటికి దగ్గర్లో వున్న మూడు పార్కుల్ని వదిలేసి ప్రియదర్శినికే వెళ్ళడం.. అక్కడ నాకు త్రినాథ్‌గారు కలవడం, నాకు మా నాన్నలాగా అనిపించడం, ఆయనో కథ చెప్పడం.. యాదృచ్ఛికంగా ఆ కథలోని పాత్రలు నాకు పరిచయమవ్వడం.. ఇట్లా ఈయన సిక్ అయ్యి మంచానపడి ఆ కథ అసంపూర్ణంగా మిగిలిపోవడం.. ఇదంతా ఏదో పర్పస్ లేకుండా జరుగుతోందంటారా? "

"అంతా దైవేచ్ఛ అశోక్! జరిగేది జరక్క మానదు. మనమంతా జగన్నాటకంలో జస్ట్ పాత్రధారులం"

★ ★ ★

ఆ రోజు నేను శాక్సాఫోన్ తీసుకుని చాలాసేపు పాడాను. నాకు తెలిసిన రాగాలు, తెలియని రాగాలు నా మనసులోని టెన్షన్ అంతా వదిలేదాకా పాడాను. మధులిక వచ్చి నా పక్కనే కూర్చుని నావైపు ఆరాధనగా చూస్తూ పాట వింటోంది. నిరోషా కొంచెం ముభావం మెయింటెయిన్ చేస్తున్నప్పటికీ - పాట ప్రభావంతో కొంచెం సడలింది.

నా మాట నిలబెట్టుకుంటూ, స్వప్నకు అత్యంత క్లుప్తంగా నా ప్రేమకథను మెయిల్ పెట్టాను. తను వాట్సప్‌లో "చాలా బాధగా వుందంకుల్ - మీ లవ్ ఫెయిల్యూర్ కథ విని" అని సందేశం పెట్టింది. కాసేపటికి - "మళ్ళీ తను మీ జీవితంలో ఎప్పుడైనా, ఎక్కడైనా తారసపడిందా? " అని అడిగింది.

"పడింది, ఫేస్‌బుక్‌లో తను నా ఫ్రెండ్. తను ఆరోగ్యంగానే వుంది. ఇద్దరు మగపిల్లలు. ఒకడి పేరు రాణాప్రతాప్. ఇంకోడు అశోక్ సామ్రాట్"

"హే- దొరికిపోయింది! మీ పేర్లే పెట్టింది కదూ! వాళ్ళ హజ్బెండుకి తెలిస్తే తాటతీస్తాడేమో? "

"దొరికే ఛాన్సులేదు! ఎందుకంటే అతను లాటరీలో తనకిష్టమైన పదిమంది కింగ్స్ పేర్లు వేసి తీస్తే బెస్టాఫ్ త్రీలో ఈ రెండు పేర్లు అతనికి నచ్చాయట"

"బెస్టాఫ్ త్రీ? ఆ మూడో పేరెందుకు నచ్చలేదో? "

"ఎందుకంటే - ఆ మూడో పేరు - తన పేరే కాబట్టి!"

"వ్వాట్? ఏంటో అతని పేరు? "

"విక్రమాదిత్య"

"సర్‌ప్రైజింగ్ హ్యూమర్!"

"అండ్ సర్కాస్టిక్ ఫర్ పార్తూ!"

"గాడ్ ఈజ్ గ్రేట్! ఇంతకీ మీకాపేరు మీ మమ్మీడాడీ ఎట్లా పెట్టారో కదా? వాళ్ళు డెఫినెట్‌గా విక్రమ్‌లాగా లాటరీ అయితే వేసి వుండరు!"

"అవును! నా అసలు పేరు రాణా! అశోక్ నా కవల సోదరుని పేరు. మేమిద్దరం ఒక్క రెండు నిమిషాల గ్యాప్‌లో పుట్టిన ట్విన్స్. మొదట అశోక్ పుట్టాడు. పుట్టిన రెండ్నెల్లకే నిద్రలోనే పోయాడు. సడెన్ ఇన్ఫాంట్ డెత్ సిండ్రోమ్ అట. కారణం తెలీదు. ఆ తర్వాత మా నాన్నమ్మ- 'రాణా పోయాడు అశోకే మిగిలాడు' అని గట్టిగా నమ్మింది. దాంతో అమ్మానాన్న ఇక చేసేది లేక - నా పేరును 'అశోక్ రాణా'గా రాయించారు స్కూల్లో వేసేటప్పుడు"

"వావ్! ఇంట్రెస్టింగ్ స్టోరీ. ఊc! ఆ తర్వాతేమైంది? "

"నానమ్మ పోయింది. నాకా పేరు మిగిలింది"

"గుడ్‌నైటంకుల్! నాన్న పడుకోమని పురమాయిస్తున్నాడు. ఫోన్లో ఈ ఛాటింగులు ఆయనకిష్టముండవు"

"బై గుడ్‌నైట్.. పా.. సారీ - స్వప్నా!"

★ ★ ★

మోహన్ నైట్‌డ్యూటీలు వరసబెట్టి చేస్తుండటం వల్ల మార్నింగ్ వాక్‌కి రావడంలేదు. వచ్చేనెల - అంటే జనవరి దాకా డ్యూటీలు చేస్తానని కాంట్రాక్ట్ చేసుకున్నట్టు నాకు వాట్సప్‌లో సందేశం పెట్టాడు. ఉదయం కాలేజ్, హాస్పిటల్ ట్రెయినింగ్, సాయంత్రం కొంచెం చదువుకుని తిని మళ్ళీ గచ్చిబౌలికి నైట్‌డ్యూటీలకు వెళ్తూ చాలా బిజీ అయిపోయాడు.

త్రినాథ్, చివరికి డిశ్చార్జయ్యి కొత్త సంవత్సరం వెల్కం ఇంట్లో జరుపుకున్నాడు. చలి ఎక్కువగా ఉండటం వల్ల తన ఇంట్లోంచి బైటకి రాకుండా బ్లాంకెట్, శాలువాల వెచ్చదనాన్ని ఆస్వాదిస్తూ తనకిష్టమైన దాశరధి రంగాచార్యులవారి శ్రీమద్రామాయణం పారాయణం చేసుకుంటున్నాడు.

"రామయ్యా! రఘురామయ్యా! రావయ్యా! నన్ను తీసుకుపోవయ్యా! నాకు నిన్ను చూడాలనుందయ్యా!" ఇదే జపం.

★ ★ ★

రేవతి:

చికాగో నగరం, అమెరికా.

మిషిగాన్ సరస్సు ప్రశాంతంగా కనిపిస్తోంది బాల్కనీ నుండి.

కానీ, చూస్తున్న రేవతి మనస్సు మాత్రం అల్లకల్లోలంగా వుంది.

ఆమె ఇల్లు కం ఆఫీసది. ఆఫీసు గది బాల్కనీలోంచి ప్రపంచం తూర్పుదిశగా కన్పిస్తోంది ఆవిడకు. చూపు సరిపోదు గానీ, భూమి గుండ్రంగా లేకుండా బల్లపరుపుగా వుంటే ఆమె తీక్షణమైన దృక్కులకు ఇండియాలో ఎర్రకోట మీద జెండా తప్పకుండా కనబడేది. ఆ చూపులకు భయపడే ఆమె పర్సనల్ సెక్రెటరీ జెన్నీ దూరంగా నుంచుని ఆమె కరుణాకటాక్ష వీక్షణానికై ఎదురుచూస్తోంది.

జెన్నీ ఆపుకోలేక గొంతు సవరించుకోగానే రేవతి ఒక్క ఉదుటన ఈ లోకంలోకి వచ్చి తన సీట్లో ఆసీనురాలైంది.

"ఇవాళ మనం ముగ్గురికి అప్పాయింట్‌మెంట్ ఇచ్చాం. మధ్యాహ్నం లంచ్ లూయీవిల్లి ఫ్రెండ్ రెస్టారెంట్లో, కొరియా కంపెనీ వాళ్ళతో. ఇవాల్టికింతే మేడమ్!" చెప్పింది జెన్నీ.

"పిలవండి"

రేవతి హైదరాబాద్‌లో పనిచేసిన సాఫ్ట్‌వేర్ కంపెనీ కాలక్రమేణా పలు అవతారాలెత్తి ప్రస్తుతం మొబైల్ ఫోన్స్‌లో వాడే ఆండ్రాయిడ్ అప్లికేషన్స్ తయారుచేసే కంపెనీగా అవతరించింది. ఇట్లాంటి కంపెనీలు కోకొల్లలుగా వున్నా, రేవతి అదృష్టమో ఏమోగానీ, ఆమె నిర్వహించే ఆఫీసులో ఇంజినీర్లు కనిపెట్టిన గేమ్స్, అప్లికేషన్స్‌కి డౌన్‌లోడ్స్ విపరీతంగా పెరిగి కుప్పలు కుప్పలుగా ఆఫర్లు వచ్చిపడ్డాయి. దాంతో డాలర్ల వర్షం కురిసి - రేవతి, ఆమె కేర్‌టేకర్ ప్రియుడు సుందర్ పటేల్ - 'డాలర్ కపుల్'గా ప్రసిద్ధిచెందారు.

ఈ రోజుల్లో మార్కెట్లో ప్రతి వస్తువుకి ప్రచారం తప్పనిసరి. అది లేకపోతే ఎంత నాణ్యమైనదైనా ఎంత అందమైనదైనా ఎంత అరుదైనదైనా - మూలన దుమ్ముకొట్టుకుపోవాల్సిందే!

సుందర్‌పటేల్- రేవతిలో ఒక అందమైన అడ్వర్టైజింగ్ దేవతని చూశాడు. తన రూపంతో, బాడీ లాంగ్వేజీతో, మాటలతో, కనుల కదలికలతో, చిరునవ్వుతో - కస్టమర్‌కి సునామీ బ్రెయిన్‌వాష్ చెయ్యగల సమర్థతని పసిగట్టాడు. రేవతి, ఒక పెళ్లయిన పరస్త్రీ, ఆడపిల్ల తల్లి అని తెలిసి కూడా - ఆమెలోని టాలెంట్‌ని పూర్తిగా వాడుకోవాలని భావించి - తన శాయశక్తులు ఒడ్డి ఎట్టకేలకు రేవతిని లోబరుచుకోగలిగాడు.

తనకున్న టాలెంట్ ఏంటో రేవతికి స్పష్టంగా ఎరుకే. అందుకే ఆమె తన జీవితాన్ని సంపూర్ణంగా ఆస్వాదించడానికి రెడీ అయ్యింది. తన కటాక్షం కోసం నానాకష్టాలు పడుతున్న సుందర్‌ని తన పర్సనల్ స్పేస్‌లోకి ఆహ్వానించి కండిషన్లు వివరించింది. తన ప్రపంచాన్ని దోసిళ్ళతో ధారపోసి రేవతిని అమెరికాకి తీసుకెళ్ళాడు సుందర్.

సుందర్ పటేల్ ఇప్పుడు అత్యంత ధనికులైన ఎన్నారైలలో ఒకడు. అతని భార్యగా రేవతి - ఎంత ధనికురాలో, అంతకన్నా ఎక్కువ పాపులర్! సుందర్ విజయదరహాసం వెనక తన విన్యాసం దాగుందని రేవతి గ్రహించడానికి ఎక్కువ సమయం పట్టలేదు. వాళ్ళకు రెండు ఎబార్షన్ల తర్వాత ఒక మెంటల్లీ ఛాలెంజ్‌డ్ స్పెషల్ పిల్లవాడు 'కిట్టూ' జన్మించాడు. ఈ తొమ్మిదేళ్ల సహవాసంలో ఆమె సంతోషపడ్డ సందర్భాల కంటే విచారపడ్డ సమయాలే ఎక్కువ.

కిట్టూ మానసికరుగ్మత తనలో గిల్టీ ఫీలింగ్‌ను రగిల్చింది. కర్మ సిద్ధాంతం నిజమే కాబోలు అన్పించసాగింది. కిట్టూకు ఐదేళ్ళు వచ్చేసరికి రేవతిలో కిట్టూతో పాటే పుట్టిన అపరాధ దోష భావన ముదిరి గర్భసంచి క్యాన్సర్‌గా రూపం దాల్చింది.

"సర్వైకల్ క్యాన్సర్, సెకండ్ స్టేజ్" అని గైనకాలజిస్ట్ రిపోర్ట్ చదివి వినిపించినప్పుడు రేవతికి మదిలో మెదిలిన విషయం ఒక్కటే - వెంకటేశ్వర్లును విడిచి స్వప్నను వదిలి ఇంటి బైట కాలుమోపడం.

ఆ మోపిన కాలు వామన పాదమై ఇప్పుడు తన తలపై అదుముతోంది మృత్యుపాతాళానికి.

అంతర్వాణి ఘోషిస్తోంది 'నీకిదే తగిన శాస్తి' అంటూ. స్వర్గం అందుకోవడాన్కి భూమాతను తొక్కి ఎగిరి పుసుక్కున

> **కొత్తగాలి...**
>
> **సంసారమన్నాక**
> **తప్పవు తడబాట్లు**
> **అవి ఎన్నటికీ**
> **కారాదు ఎడబాట్లు**
>
> – శ్రేష్ఠి శేషగిరి,
> వారాశిగూడ, సికింద్రాబాద్

పాతాళంలోకి కాలు జారిపోయిన తను - ఒకే ఒక్క చివరి ఆశ పెట్టుకుంది.

అది - వెంకటేశ్వర్లు కాళ్ళమీద పడి క్షమాపణ చెప్పి - స్వప్నను దగ్గరికి తీసుకుని తన చివరి క్షణం వరకూ ప్రేమనందిస్తూ మరణించడం. కానీ సుందర్ దీనికి ససేమిరా అన్నాడు. తన ఇగోని చంపుకుని సుందర్‌ని ఎంతో బతిమాలింది. "కిట్టూని వదిలి పెట్టి వెళ్ళేట్టయితే మళ్ళీ నా జీవితంలోకి రానవసరం లేదు" అని ఒట్టు పెట్టి కట్టివేశాడు.

సెకండ్ స్టేజ్ గర్భాశయ ముఖద్వారపు క్యాన్సర్లో కేవలం అరవై శాతం మందే ఐదేళ్ళవరకు బతకగ్గలుగుతారని గణాంకాలు చెప్తున్నాయి. తను ఆ మిగతా నలభై శాతంలో వుండి తీరతానని రేవతి ప్రగాఢ విశ్వాసం.

అందుకే తన కెరీర్‌ని చాపచుట్టినట్టు మెల్లిమెల్లిగా చుట్టేస్తోంది.

కిట్టూ సమస్యే గనక లేకపోయుంటే - సుందర్ తనకి డైవర్సిచ్చి సులభంగా ఇండియా తోలేసేవాడే. కిట్టూ రేవతిని విడిచి వుండలేడు. అందుకే ఇల్లు, ఆఫీసు ఒకే ప్రాంగణంలో! కన్నబిడ్డ తెలివైనోడైనా, రాక్షసుడైనా, బుద్ధిమాంద్యుడైనా, అవతార పురుషుడైనా - కన్నతల్లికి ఒకటే. నవమాసాలు మోసి, పురిటి నొప్పులు పడి, కని, ఏడాది పాలిచ్చి పెంచి, పాప మలమూత్రాలతో తన శరీరాన్ని అద్దుకొని సాకే మాతృమూర్తి ప్రేమకి నిర్వచనం చెప్పలేం. అదే దైవత్వం. అందుకే దేవుడు మనలోపల ఉన్నాడంటారు. అవసరం పుట్టించేది, అవసరం తీర్చేది - అన్నీ దైవత్వమే!

'దేవుడు కనుక ఏదైనా ఇవ్వదలిస్తే ఇంటి పైకప్పును చీల్చి డైరెక్ట్‌గా ఇచ్చేగలడు' అని హిందీ సామెత. రేవతి విషయంలో అదే నిజమైంది. ఆ వార్త - ఆమె మనసులో అకాల వసంతం సృష్టించింది.

అదే ఇండియా ప్రధానమంత్రి కార్యాలయం నుండి సుందర్ పటేల్‌కు ఫోన్‌కాల్!- లైన్లోకొచ్చి స్వయానా ప్రధానమంత్రి మాట్లాడారు.

"భాయ్ సాబ్! కేం షో? "

"మజా మా పియం సాహెబ్!"

"ఘరే బధా మజామా" (ఇంట్లో అందరూ బాగున్నారా)

"బస్ జల్సా (ఫైన్) సాహెబ్"

"భాలే పధార్య ఇండియా" ఆహ్వానించాడు ప్రధానమంత్రి, సుందర్‌ని, రిపబ్లిక్ డే సందర్భంగా ఇచ్చే లంచ్‌కి- ఫ్యామిలీతో! భారత ప్రధాని ఆ సందర్భంలో చెప్పిన ఐడియాకి సుందర్, రేవతి అవాక్కయారు. కాస్త తేరుకున్నాక ఆయనే వివరించాడు.

"ఒక్క రూపాయికి ఒక్క భోజనం.. భారతదేశంలో పేదలకి రోజుకొకసారి ఒకే ఒక రూపాయితో ప్లేట్ మీల్స్ అమ్మడం! ఆ రూపాయి కూడా ఎందుకు పెట్టామంటే పేదల ఆత్మగౌరవం దెబ్బతీయరాదని. ఈ పథకం అమలుకు అవసరమైన సాఫ్ట్‌వేర్‌ను మీరు మాకు అందించగలరా? దేశసేవ చేసుకునే భాగ్యాన్ని మీరు తృణీకరిస్తారనుకోను!"

ఇంత ఆదర్శవంతమైన దేశసేవలో తమలాంటి ఎన్నారై దేశభక్తుల భాగస్వామ్యం కోరినందుకు సుందర్ ప్రధానిని అభినందనలతో ముంచెత్తి తక్షణం అంగీకరించాడు.

ఈ నేపథ్యంలో ఒక నెలరోజుల క్రితమే ఈ 'ఒక్క రూపాయికి ఒక్క భోజనం' కాన్సెప్ట్‌ని డిజైన్ చేసి, రేవతి, ప్రధానమంత్రి ఆఫీసుకు, మెయిల్ పెట్టింది. రెండ్రోజులకు ప్రైమ్‌మినిష్టరే స్వయంగా రేవతితో వీడియో కాల్‌లో మాట్లాడారు.

"రేవతీ జీ నమష్కార్! ఆప్ కైసే హై? !"

"చాలా సంతోషం సార్! నమస్తే! మీరు బాగున్నారా? "

"అమ్మా! నీ మెయిల్ చూశాను.

నాక్కొంచెం క్లారిటీ కావాలి. మీరేం చెప్పద లిచారో వివరంగా చెప్పండి. మీ వల్ల దేశా నికి మరింత సేవ చేసుకునే భాగ్యం కలు గుతుందనిపిస్తోంది!"

తాము రూపొందించిన సాఫ్ట్‌వేర్ గురించి ఆయనకు రేవతి అంతా పూసగుచ్చి నట్టు చెప్పింది.

ప్రధాని - ఆమె ముఖాన్ని చూస్తూ, ఆమె వాక్చాతుర్యం గమనిస్తూ మంద హాసం చేశారు.

"సరే! బాగుంది. మరి దీనికి బడ్జెట్ ఎన్నివేల కోట్లు కావాలో, ఎంత ఇన్‌ఫ్రాస్ట్ర క్చర్ నెలకొల్పాలో అంచనా వుందా? "

రేవతి తన మనసులో అనుకున్నదంతా ఆయనకు వివరించింది.

ప్రధాని అంతా సాలోచనగా విన్నారు.

"సరే! సుందర్‌పటేల్‌జీ మా పార్టీ యన్నారై కార్యకర్త. వారి అర్ధాంగి మీరు. సుందర్ కూడా ఈ పథకం పట్ల ఆలోచన చేసే వుంటాడు అనుకుంటున్నాను. లాభ నష్టాలు అన్నీ బేరీజు వేశాక అతిత్వరలో మీకు రిజల్టు చెబుతాం రేవతీ జీ! గుడ్ నైట్! సుందర్ భాయికో మేరా నమష్కార్ దేనా" లైన్ కట్టయింది.

తాను చెప్పింది ప్రధానమంత్రికి అర్థమ యినా, కాకపోయినా, తన పథకం గొప్ప దైనా, పిచ్చిదైనా.. తన బ్యాంకు ఎక్కౌం ట్లోంచి ట్రాన్స్‌ఫరైన వందకోట్ల రూపా యల వైట్‌మనీ పార్టీ ఫండు తన పని తాను మౌనంగా, విజయవంతంగా చేసుకు పోగలదని రేవతికి ముందే తెలుసు!

కన్విన్స్ చేయడం రేవతికి వెన్నతో పెట్టిన విద్య. ప్రధానిని సునాయాసంగా ఒప్పించి రిపబ్లిక్‌డే వేడుకలకి ఆహ్వానం తెప్పించింది.

రేవతి తన అంతరంగాన్ని, తన పరిస్థి తిని వివరిస్తూ ప్రధానికి మరో మెయిల్ పెట్టడంతో సుందర్ పటేల్ ఈ విషయం వెంటనే పసిగట్టలేకపోయాడు.

పసిగట్టినా ఇప్పుడిక చేసేదేమి లేదు. ఎందుకంటే కాంట్రాక్టు అప్పటికే సంతకం చేసేశాడు గనక.

"సో! ఇప్పుడేంటిక? " అడిగాడు సుందర్, ఢిల్లీ ఎయిర్‌పోర్ట్ రీచవుతూ.

"ఏముంది సుందర్!? ఇన్ఫోసిస్‌కో, రిల యన్స్ గ్రూప్‌కో ఔట్ సోర్సింగ్ చేద్దాం ఈ ప్రాజెక్ట్‌ని. మన పని కేవలం ఫైనల్ ప్రాడక్ట్‌ని అమ్మడమేగా!" కాజువల్‌గా చెప్పింది రేవతి.

"చాలా సంవత్సరాలకు మనం ఇండియా వచ్చి ఈ గాలి పీలుస్తున్నాం! నీకేమీ అన్పించడం లేదా డియర్? "

"అవును! కానీ.. మనం ఇంకొక్కరోజు ఇక్కడుండి పోయినా బోల్డంత బిజినెస్ లాస్ కదా"

"ఛఛ.. ఎప్పుడూ డబ్బూ.. డబ్బు. తరాలు తిన్నా తరగని ఆస్తి వుందిప్పుడు. నాకో ఐడియా! ఈ ప్రాజెక్ట్‌ను మనమే డీల్‌చేద్దాం"

"ఎలా? "

"కాంపస్ రిక్రూట్‌మెంట్స్ చేసి ఇక్కడే ఒక బ్రాంచ్ తెరుద్దాం. నువ్వు ఇండి యాలో హాపీగా వుండి అన్నీ చూసుకో. కిట్టూను కూడా ఇక్కడికే తీసుకొద్దాం. అక్కడి పన్లు నేను చక్కబెడుతాను లే"

ఇలా చెప్తున్నప్పుడు సుందర్ వంక అనుమానంగా చూసింది రేవతి.

"ఈజిట్ ఎ జోక్ - సుందర్? "

"జోక్ మొదలు పెట్టిందెవరు రేవతీ నువ్వు కాదా? " సుందర్ ముఖంలో సీరి యస్ ఛాయలు.

"ఏం నాకు తెలియదనుకున్నావా, నీ దేశభక్తి డ్రామా? - నీ కూతుర్ని నీ దగ్గ రికి పిలిపించుకునే ప్రయత్నమే కదా? కాదా? యూ ఫూల్! ప్రధాని ఆఫీసులో నాక్కూడా కొంచెం పరపతి వుంటుందని ఎందుకనుకోలేదు? అయినా నువ్వు నీ జీవితపు చివరి అధ్యాయంలో వున్నావని




ఇదంతా ఒప్పుకున్నాను"

"అయితే నీ ప్లాన్స్ ఏంటి?"

రేవతికి ఏడుపే మిగిలింది. సుందర్‌కి ప్లాన్ తెల్సిపోవడంతో తన పాచిక పారదిక.

"రేవతీ! నువ్వంటే నాకు బాగా యిష్టం! గౌరవం కూడా! నాతో లేచిపోయి వచ్చిన

ప్పుడే నీ గతాన్ని పాతాళంలోకి తొక్కేశావనుకున్నాను. నీకోసం నేను కూడా నా పెళ్ళానికి విడాకులిచ్చేశాను గదా! నాకిప్పుడు క్యాన్సరొచ్చినా నేనేం వాళ్ళ దగ్గరికి వెళ్ళను. నేను కమిట్ అయితే వెనక్కి పోయే రకం కాదు. ఎక్కౌంట్ క్లోజ్ చేశాక బ్యాంకు వంక తిరిగి చూడాల్సిన పనేంటి? "

"సుందర్! నీ గురించి తెలుసు. నేను తప్పే చేశాను. కానీ, నేను సరిదిద్దుకోవాలనుకుంటున్నాను. నాకు క్షమాపణ, ప్రాయశ్చిత్తం దొరకవా? "

సుందర్ వినేదు. విమానం చికాగో వైపుకు గాల్లోకి లేచింది.

కొద్ది రోజులకే ప్రైమ్ మినిష్టర్ ఆఫీసు నుండి రేవతికి మళ్ళీ పిలుపొచ్చింది. ఫిబ్రవరిలో జరిగే ఒక బిజినెస్ అవార్డు ఫంక్షన్‌కి చీఫ్ గెస్ట్‌గా రావాలంటూ. సుందర్ కాదనలేకపోయాడు. ఇండియాలో రెండు నెలలు గడిపి రమ్మని తనే ఏర్పాటుచేశాడు సుందర్.

సుందర్‌లో ఈ మార్పుకు కారణమేంటో ఊహించలేకపోయింది రేవతి. ఇద్దరు ఆడ అసిస్టెంట్లతో కిట్టూని ఇచ్చి రేవతికి ఇండియా వెళ్ళే విమానం వద్దకు వచ్చి సెండాఫ్ ఇచ్చాడు - ప్రేమపూరిత నయనాలతో..

నిజానికి రేవతికి ఆ పిలుపు వచ్చేలా ఏర్పాటు చేసింది - సుందరే! దీనికి కారణం ఢిల్లీ నుండి చికాగో వచ్చిన రెండ్రోజులకే సుందర్ ఒక బాంబ్ బ్లాస్ట్ నుండి చిటికెలో తప్పించుకున్నాడు.

ఒక సూపర్ మార్కెట్ పార్కింగ్ స్థలంలో టెర్రరిస్టులు పేల్చిన బాంబు ప్రాణనష్టం చేయకపోయినా ఐదు కార్లు కాలిబూడిదయ్యాయి. జస్ట్, ఒక నిమిషం ముందే ఆ పార్కింగ్ స్లాట్‌లోంచి కారు తీసి వెళ్ళిపోయిన సుందర్‌కి ఆ బ్లాస్ట్ శబ్దం ప్రాణం విలువ అంటే ఏంటో తెలియజెప్పింది.

ఏదైనా ప్రాణం వున్నంత వరకే కదా! ఈ డబ్బు, గౌరవం, హోదా, పిల్లలు, ఆస్తులు.. ప్రాణం ఫ్రీగా వచ్చింది కదా అని మృత్యువు సమీపించే దాకా దాని గురించే ఆలోచించం. అనారోగ్యం కలిగినప్పుడు కూడా ఆరోగ్యం తిరిగి పొందుతామని ధీమాగా వుంటామే తప్ప ప్రాణం పోతుందని ప్రతిసారీ భయపడం.

మృత్యువును జయించినప్పుడు, మృత్యువును వెంట్రుక వాసిలో తప్పించుకున్నప్పుడు మాత్రమే మన బొందిలో 'ప్రాణం' అనేది ఒకటుంటుందని కళ్ళు తెరుస్తాం. రెండ్రోజులైనా ఆలోచిస్తాం. అదిగో, అప్పుడు సుందర్ మృత్యుముఖంలో వున్న రేవతి మానసిక పరిస్థితిని అర్థం చేసుకోగలిగాడు.

★ ★ ★

క్యాంపస్ ప్లేస్‌మెంట్లలో సెలక్టయ్యానని స్వప్న నాకు చెప్పి - ఆ ఆదివారం అందరినీ తీసుకుని స్వాగత్ గ్రాండ్ హోటల్‌లో డిన్నర్‌కి ఆహ్వానించింది.

నిరోషాకు మొదట ఇష్టం లేకపోయినా చివరకి ఒప్పుకుంది.

"ఒకప్పుడు మేం డిగ్రీలు చదివే టైంలో చదువైపోయాక కూడా ఉద్యోగాలు దొరికేవి కావు. నిరుద్యోగం అనేది అతిపెద్ద సమస్యగా ఉండేదప్పట్లో. కానీ ఇప్పుడేంటండీ, చదువు పూర్తికాకుండానే ఉద్యోగాలిచ్చేస్తున్నారు? కాలం ఎంత మారిపోయింది? " నోరు నొక్కుకుని ఆశ్చర్యపడింది నిరోషా.

ఆదివారం సాయంత్రం సరదాగా ప్రియదర్శిని పార్క్‌కెళ్ళాం. మధులిక బంతాట ఆడుకుంది. క్రికెట్ కూడా ఆడింది. బబుల్స్ ఊదే సబ్బు డబ్బా కొనుక్కుని మా ఇద్దరి మీదికి పదేపదే బుడగల్నీ వూదింది. అట్నుంచి సరాసరి స్వాగత్ గ్రాండ్ హోటల్‌కెళ్ళాం. బాంక్వెట్ హాల్లో- మోహన్ ఎదురై మమ్మల్ని ఆహ్వానిం

చాడు. వెంకటేశ్వర్లు, స్వప్న నన్ను విష్ చేసి కూర్చోమని మర్యాద చేశారు. కాసేప టికి స్వప్న అనసూయని నా దగ్గరికి తీసు కుని వచ్చి "అంకుల్! ఇదిగో- సమయం వచ్చినప్పుడు మా అనసూయాంటీని మీకు పరిచయం చేస్తానని చెప్పాగా! వీరే అన సూయగారు. మోహన్ మదర్! ఆంటీ! వీరు నిరోషా మేడమ్! ఈ మధులిక అంకుల్ వాళ్ల పాప"

అనసూయ నమస్కారం చేసి నిరోషా పక్కన కూర్చుంది.

"ఆంటీ! మీరు నన్ను గుర్తుపట్టారా? మా బ్యాంక్‌కాలనీలో 'అత్తాకోడలు' టీవీ కార్యక్రమం షూటింగ్ చేసినప్పుడు మనిద్ద రినీ జత చేశారు. కానీ- మీరు అత్తలాగా కనబడడం లేదని మిమ్మల్ని వద్దన్నారు!" అంది నిరోషా.

ఆ రోజు జరిగిందంతా అనసూయ గుర్తుకు తెచ్చుకుంది.




**అనసూయ:**

అప్పట్లో ఓ స్కూల్లో టీచర్‌గా జాబ్ చేస్తుండేదాన్ని. ఒకరోజు ఒక టీవీ ఛానెల్ వాళ్ళు ఆదివారం రోజున ఆ స్కూల్ గ్రౌండులో 'అత్తాకోడలు' షూటింగ్ చేసేం దుకు పర్మిషన్ తీసుకున్నారు.

ప్రిన్సిపాల్ మేడంకి సరదాగా ఆ షూటింగ్ చూసి ఎంజాయ్ చేయాలని బుద్ధిపుట్టి- కంపెనీ కోసం నన్ను కూడా రావాలని ఆదేశించింది. అప్పుడు మోహ న్‌కి టెంత్‌క్లాస్ పరీక్షలు నడుస్తున్నాయి- రాలేనని చెప్పాను. ఆదివారమే కదా! ఒక్క రెండు గంటలు వచ్చిపో! నాకూ తోడుగా వుంటుంది అని రిక్వెస్ట్‌గా అడిగేసరికి ఇంక వెళ్ళక తప్పలేదు.

ఆ టీవీ ప్రోగ్రాంలో ఒక యంగ్ వనిత, ఒక ఆంటీ జతకూడి అత్తా కోడళ్ళుగా యాక్ట్ చేస్తూ రకరకాల ఐటెమ్స్ చెయ్యా ల్సుంటుంది. రెండు జతల్ని సెలక్ట్‌చేశారు. వాళ్ళలో నిరోషా కొత్తగా పెళ్లయిన ఛాయ లతో వుండి తన నిజం అత్తగారినే తీసుకొ చ్చింది. ముందుగా చెంచాల్లో నిమ్మకా యల ఆట రిహార్సల్ చేయించారు. అది మా స్కూల్ కాబట్టి ప్రిన్సిపాల్ మేడం, నేను ఓ వారగా నీడకు కుర్చీలేయించుకుని కూర్చుని చూస్తున్నాం. షూటింగుకి వచ్చి నోళ్ళంతా పాపం ఎండలో అట్లాగే నిలబడి వున్నారు. యాంకర్ అబ్బాయి తన స్క్రిప్టును డైరెక్టర్‌తో చర్చించి కొన్ని మార్పులు చేసుకుంటూ సడెన్‌గా నా వైపు చూశాడు. అప్పుడు నేనూ అతడ్నే గమ నిస్తూ వున్నాను. అతనట్టాగే చూస్తూ వుండటంతో నేను మొహం తిప్పి మా ప్రిన్సిపాల్ తో ఏదో మాట్లాట్టం మొదలుపె ట్టాను.

కాసేపయ్యాక తొక్కుడు బిళ్ళ ఆట ఆడించారు. ఆ ఆటలో నిరోషా అత్తగారు కాలు బెణికి కింద పడిపోయింది.

డైరెక్టర్ కట్ చెప్పి ఆవిడ్ని మా పక్కనే కుర్చీలో కూర్చోబెట్టాడు. మా స్కూల్ ఫస్ట్ ఎయిడ్ బాక్స్‌లోంచి ఒక పెయిన్ కిల్లర్ ఆయింట్‌మెంటు తెచ్చిచ్చాన్నేను. నిరోషా థాంక్స్ చెప్పి నన్ను ఎగాదిగా చూట్టం మొదలుపెట్టి.. ప్రోగ్రాం డైరెక్టర్‌తో ఏదో చెప్పింది. ఆ డైరెక్టరు, యాంకరు ఏదో మాట్టాడుకుని నా వద్దకొచ్చి- "మేడమ్! నిరోషాగారి అత్తయ్య ఈ పోటీలో పాల్గొ నలేరు కాబట్టి ఆమె ప్లేస్‌లో మిమ్మల్ని

తీసుకోవాలనుకుంటున్నాం. మీకు ఓకే కదా!? " అనడిగారు.

మా ప్రిన్సిపాల్ గయ్యిన అంతెత్తు లేచింది. "ఆవిడెలా పాల్గొంటుందండీ? తను ఎర్రబొట్టు పాపిట్లో పెట్టుకోకూడదు. తనో విడో! ఏవీ తెల్సుకోకుండా ఎవర్నిప డితే వాళ్ళని అడిగెయ్యడమేనా? " అరిచింది.

యాంకర్, డైరెక్టర్ అవాక్కయ్యారు.

నా మొహంలో నెత్తురు చుక్కలేదు. నిరోషా నా వంక జాలిగా, ప్రిన్సిపాల్ వంక కోపంగా చూసింది.

కానీ ప్రిన్సిపాల్‌కి అంత కోపం రావడానికి కారణం ఏంటో నాకు స్పష్టంగా తెలుసు. స్కూల్‌కొచ్చే పేరెంట్స్ దగ్గర్నుంచి, స్కూల్‌ఛైర్మన్ దాకా అందరూ అనసూయ టీచర్ అంటే ప్రత్యేక అభిమానం చూపిస్తుంటారు. కొంతమందైతే నన్నే ప్రిన్సిపాల్‌గా భావించి అన్నీ చెప్పుకుంటారు. జస్ట్ ఎం.ఫిల్. చేసిందన్న కారణంగా ఆమెను నాపై స్థానంలోంచి తీయలేకపోవడం ఆమెకెంతో గర్వంగా వున్నా, నా మీద జెలసీ మాత్రం ఎప్పుడూ రగులుతూ వుండేది.

విడోని అయితే మాత్రం- 'నటన'కి పనికి రానా? అనుకుని నిరోషాకి అత్తగా నటించడానికి సిద్ధపడ్డా. పది నిమిషాల్లో నాకు అత్తగా మేకప్ వేసేశారు. ప్రిన్సిపాల్, నిరోషా అత్తగారు ఇద్దరూ- నావంక చూస్తున్నారు. ఎవరి బాధ వారిది మరి!

నాతో ముందుగా స్కిప్పింగ్ చేయించారు. నిరోషా కన్నా నేనే ఎక్కువ స్పీడుగా చేశాను. ఆ తర్వాత యాంకర్ నాకు డాన్స్ వచ్చిన పాట ఏంటో తెలుసుకుని- అదే పాటకు మాతో డాన్స్ చేయించారు. అప్పటికే నిరోషా- తనకన్నా నేనే స్పీడుగా వున్నానని గ్రహించి డైరెక్టర్‌తో అదే అంది. ఆమెతో షూటింగ్ చూసే జనాలు కూడా ఏకీభవించారు. యాంకర్ కూడా స్పీడు తగ్గించి 'అత్త'కుమల్లే స్లోగా చేయాలని నాకు సూచించాడు.

నేనొప్పుకోలేదు. నాకు కోపం వచ్చింది. ఆ కాన్సెప్ట్ తప్పని అందరికీ తెలుసు.

"నేను నాలాగే వుంటాను తప్ప మీ కోసం మారను!" అని ప్రకటించేసి ఇంటికొచ్చేశాను.

నానమ్మ తలుపు తీసి నా ముఖం, మేకప్ వంక ఆశ్చర్యంగా, అసహనంగా చూసింది.

నేను విషయం చెప్పాను.

"స్కూల్ మానేసెయ్. పిల్లవాడు ఎదుగుతున్నాడు. వాడి ముందు ఇట్లాంటి కోతి వేషాలు, కుప్పిగంతులు వేశావంటే నవ్వుల పాలై ఉన్న పరువుపోయే ప్రమాదం వుంది" వార్నింగ్ ఇచ్చింది.

ఆ రోజు బాత్రూంలో మొహం కడుక్కుని గంటసేపు ఏడ్చాను. అసలు నేనేం పాపం చేశాను? ఎందుకు శిక్ష? తల్చుకుని.. కుమిలి కుమిలి.. ఎంత బాధపడ్డానో దేవుడికే ఎరుక.

ఆ స్కూల్ జాబ్‌కు నేను రిజైన్ లెటర్ పంపించకుండానే- నేను మానేస్తానని వాళ్ళకర్థం అయిపోయింది.

★ ★ ★

జ్ఞాపకాల్లోంచి తేరుకుని నిరోషా వంక చూసి నవ్వింది అనసూయ.

"ఔనౌను! అది చాలారోజులు.. ఐ మీన్.. సంవత్సరాల క్రితం. మీరు భలే గుర్తుపెట్టుకున్నారే!"

"మీరు ఇప్పటికీ అక్కలాగానే వున్నారు కానీ- అత్తలాగ కాదు! మీ సీక్రెట్ ఏంటి ఆంటీ? "

"థాంక్స్! ఫర్ ది కాంప్లిమెంట్"

"ఏమైనా జాబ్ చేస్తున్నారా ఆంటీ? "

"లేదు నిరోషా! అన్నీ మానేశాను. నీకు తెలుసుగా, బయట కాలు పెట్టామంటే ఏదో ఒకటి కాంప్రమైజ్ కావాలి"

"ఎగ్జాట్లీ! నేను అందుకే హౌస్‌వైఫ్‌గా

# జేమ్స్‌బాండ్ 007!




జేమ్స్‌బాండ్ సినిమాలంటే ఓ ప్రత్యేకత ఉంటుంది. వాటికి సంబంధించిన కొన్ని విశేషాలు.

✤ ఇప్పటివరకు వచ్చిన జేమ్స్‌బాండ్ సినిమాలు అన్నిటిలో మొత్తం 4662 సార్లు జేమ్స్



బాండ్ మీద శత్రువులు తుపాకులు పేల్చారు.

✤ 30 ఏళ్లుగా జేమ్స్‌బాండ్ పాత్రధారిని, అతని హీరోయిన్‌ని ఎంపిక చేసేది బార్బరా బ్రూకోలీ. ఈమె ఓ నిర్మాత కూతురు.

✤ మొదటి జేమ్స్‌బాండ్ పాత్రధారి షాన్ కానరీకి తన ఇరవై ఒకటో ఏటి నుంచే బట్టతల ఆరంభమైంది. అందుకే తెరమీద టోపీతో కనిపించేవాడు.

✤ 22 సినిమాల్లో జేమ్స్‌బాండ్ మొత్తం 352 మందిని చంపాడు.

✤ అందరిలోకి పియర్స్ బ్రాస్నన్ ఎక్కువ మందిని చంపాడు. గోల్డెన్ ఐ అనే ఒక్క సినిమాలోనే 47 మందిని చంపాడు.

✤ క్లింట్ ఈస్ట్‌వుడ్, బర్ట్‌రేనాల్డ్స్‌లను జేమ్స్ బాండ్ పాత్ర పోషించమని కోరారు. కాని ఆ పాత్రని బ్రిటిష్ నటుడే పోషించాలని వారు తిరస్కరించారు.

✤ 1962లో డాక్టర్‌నో సినిమా నుంచి 1979లో వచ్చిన మూన్ రేకర్ చిత్రం వరకు నికీవేన్‌డర్‌జిల్ అనే డబ్బింగ్ ఆర్టిస్ట్, మాండలికం అవసరమైన హీరోయిన్లకి డబ్బింగ్ చెప్పింది.

✤ బాండ్ చిత్రాల్లో నటిస్తున్నంత కాలం పియర్స్ బ్రాస్నన్ ఇతర చిత్రాల్లో టక్సిడో ధరించకూడదనే నియమాన్ని నిర్మాతలు విధించారు.

✤ అమెరికన్ అధ్యక్షుడు జాన్ ఎఫ్ కెనడీ, జేమ్స్ బాండ్ చిత్రాల అభిమాని. విడుదలకి ముందే వైట్‌హౌస్‌కి, 'ఫ్రం రష్యా విత్ లవ్' చిత్రం ప్రింట్ తెప్పించుకుని చూశాడు.

✤ బాండ్ సినిమాల్లో నటించడానికి తొలి బాండ్ పాత్రధారి షాన్ కానరీ స్టీవెన్ సీగల్ నుంచి మార్షల్ ఆర్ట్స్ నేర్చుకునేప్పుడు కానరీ కుడి మణికట్టు విరిగింది.

మిగిలిపోయా!"

"మిగిలిపోవడం ఏంటీ? అదే అన్నింటి కన్నా పెద్దజాబ్! ఎవ్వరూ గుర్తించరు గానీ- చదువుకున్న ఆడది హౌస్‌వైఫ్‌గా ఎంత చక్కగా మేనేజ్ చేయగలదో కదా ఇంటిని! కానీ జీతం, గుర్తింపు మాత్రం దొరకవు"

"భలే చెప్పారాంటీ!" నిరోషా నవ్వింది. నిరోషా కూడా ఎప్పుడూ అదే అంటుంది.

ఇంతలో స్వప్న వచ్చి నా పక్కనే కూర్చుంది. అది గమనించిన నిరోషా- కొంచెం మొహం మాడ్చుకుంది. అయినా కనబడనీయకుండా మొహాన్ని చిరునవ్వుతో కప్పింది.

"అంకుల్! మీకో రహస్యం చెప్పుకోవాలి. చాలా సీక్రెట్! అనసూయాంటీతో కూడా చెప్పుకోలేను. మీరే కరెక్ట్!" చెవిలో గుసగుసగా అంది స్వప్న.

"రేపు ఉదయం పదకొండు గంటలకి కాల్ చెయ్యి. అప్పుడు కాలేజ్‌లో ఫ్రీగానే వుంటాను.. " మెల్లిగా నేనూ చెప్పాను.

"ఓకే, డన్!" అనేసి స్వప్న వెళ్ళిపోయిం దక్కడ్నుంచి.

అనసూయ, నిరోషా బాగా కలిసిపోయి మాట్లాడేస్తున్నారు.

డిన్నర్ చేస్తుండగా ప్లేటు పట్టుకుని మోహన్ నా దగ్గరికి వచ్చి. "త్రినాథ్ తాతాజీకి ఒంట్లో బాలేదని ఆయన్ని పిలవ

లేదు. అన్నట్టు.. నేను మర్చేపోయాను, మీరు నాతో ఏదో డిస్కస్ చెయ్యాలని అనుకున్నారట? స్వప్న చెప్పింది. వాకింగ్ అయితే నేను మానేసినట్టే. ఈ ఏప్రిల్‌లో ఫైనల్ ఎగ్జామ్స్ అంకుల్! ఇంతకీ మీరు- ఏం అడగబోతున్నారు? " అడిగాడు.

"నేనూ అవకాశం కోసం చూసి చూసి ఇంక అడగటం మానేద్దామనుకున్నా. కానీ నువ్వు మళ్ళీ గుర్తుచేశావు. థాంక్స్..! అదే.. త్రినాథ్‌గారితో వాక్ చేస్తున్న రోజుల్లో నీ లవ్ స్టోరీ గురించి కొంచెం చెప్తుండేవారు. ఆయన అసలు కథ చెప్పాల్సిన రోజునే సిక్ అయ్యి మంచాన పడ్డారు. ఆ తర్వాత సంగతి నీకు తెల్సిందే కదా!

"ఏం చెప్పారాయన? నేను ఆయనతో చెప్పిన మాట వాస్తవమే. మీకూ అంటించారా, మై గుడ్‌నెస్!!" సిగ్గుపడుతూ నవ్వాడు మోహన్.

"నువ్వు నవ్వినప్పుడు ఇంకా బాగున్నావు మోహన్! గజనీలో సూర్యలాగా!"

"ఓ! థాంక్సంకుల్!"

"ఏం లేదమ్మా! నా డౌటు అంతా ఒక్కటే! త్రినాథ్ ఇంకా ఏమని చెప్పాడంటే- నీ లవ్ స్టోరీ సక్సెస్సో ఫెయిలో తనకర్థం కాలేదంట. ఆయన పాత్ర కూడా వుందంట. నాకైతే చాలారోజులుగా ఇదంతా తెలుసుకోవాలని వుంది" ఉన్నది కక్కేశాను- నిర్మొహమాటంగా.

"పక్కోళ్ళ విషయాలు మనకి భలే ఇంట్రెస్టింగ్ కదా! ఏం చేస్తారంకుల్ తెల్సుకుని? " సూటిగా అడిగాడు మోహన్- మొహంలో నవ్వాపుకుంటూ.

"కథ రాస్తున్నాను. యస్! ప్రియదర్శిని పార్క్‌లో ఈ కథకి బీజం పడింది. దీనికి నువ్వు నీ మనసులో వున్నదంతా నాతో షేర్ చేస్కుంటావా మోహన్? " అర్థిస్తూ అడిగాను.

మోహన్ ఆలోచనలో పడ్డాడు.

మోహన్ 'చెప్పను' అని మాత్రం చెప్పలేదు. ఆలోచించి చెబుతాడనుకున్నాను. వారం గడిచినా అతని నుండి ఏ సందేశమూ రాలేదు.

కానీ స్వప్న నాకు ఫోన్ చేసి చెప్పిన ఆ రహస్యం విని నేను మరింత కన్ఫ్యూజ్ అయ్యాను. ఏంటంటే, రేవతి స్వయంగా క్యాంపస్ రిక్రూట్ చేసుకుంది స్వప్నని. తన దీన పరిస్థితిని వివరిస్తూ- క్షమాపణ కోరింది. డాడీని కూడా కల్సి క్షమాపణ చెప్పుకునే అవకాశం కల్పించమని వేడుకుంది. స్వప్నకు ఏం చెప్పాలో తోచక ఏడుస్తూ వచ్చేసింది. కథ మరింత సంక్లిష్టమైంది. ఉన్న చిక్కుముళ్ళు విప్పేవారు లేక నేనేడుస్తుంటే ఇంకో ముడి పడింది!

ఆలోచించి చెప్తానని స్వప్నను సమాధానపరిచాను. ఏం ఆలోచించాలో తోచక- నిరోషాతో ఈ విషయం చెప్పి స్వప్న ఇప్పుడేం చెయ్యాలో, ఎలా రియాక్టవ్వాలో సలహా ఇవ్వమన్నాను.

కానీ-నిరోషా దానికి రియాక్టవ్వకుండా నేనదిరిపడే విషయం ఇంకోటి విప్పింది!

"ఇప్పుడు నేను- అనసూయ ఆంటీ మంచి ఫ్రెండ్సయ్యాం! ఆ సండే మనం డిన్నర్ పార్టీకెళ్ళినప్పుడు ఆంటీ వాళ్ళింట్లో లలితా సహస్రనామార్చన పూజకు రమ్మని నన్నాహ్వానించింది. ఆ తర్వాత వంటలు టీవీ ప్రోగ్రామ్‌లో పాల్గొనడానికి తన వెంట ఉండమని పిలిస్తే, కూడా వెళ్ళాను.

## కొత్తగాలి...

**ఫోర్లు! సిక్సర్లు!!**
**ఆమె పెళ్లాడింది**
**దక్కవుట్లు! ఔట్లు!**
**విడాకులకు అప్లయి చేసింది!**

*- జి.జి.కె. రావు,*
*శ్రీకాకుళం*

మన అపార్ట్‌మెంట్లో గాయత్రీ మహా యజ్ఞం చేసినప్పుడు రెండ్రోజుల క్రితం వచ్చింది- మనింటికి కూడా"

"ఊc! వారంలోపే ఇంత క్లోజయ్యారా? "

"ఆc! మీరూ, త్రినాథ్‌గారు ఎంత సేపట్లో క్లోజవ్వలేదూ? మేమూ క్లోజప్ టూత్ పేస్ట్ వాడుతున్నామండీ మాస్టారూ!" జోగ్గా నవ్వింది.

"గుడ్ గోయింగ్. అయితే అనసూయ ఆంటీనడిగి వాళ్ళ విశేషాలు తెలుసుకోవాలి నువ్వు. నాకెలాగూ చెప్పదు. నీకైతే.."

"అస్సలు అడగను! నాకేం అవసరం లేదు. అంత జిల నాకు లేదు బాబోయ్! ఇంకోళ్ళ విషయాలు నాకెందుకు? ఏదో ఫ్రెండ్సంటే ఫ్రెండ్సు!" కరాఖండిగా చెప్పే సింది.

కానీ- నాకు కచ్చితంగా తెలుసు.. నిరోషా కనబడ్డంత క్రూరురాలు కాదని!

★ ★ ★

**ది అనసూయ**

ఒళ్ళంతా గగుర్పొడిచినట్టుగా..
మనసంతా ముల్లొచ్చిందా?
కాలం చీల్చి చెండాడుతుంటే
అకాల వార్ధక్యం దుప్పటి లాగా
లాక్కున్నావా?
ఈ జన్మకింతేనంటూ
నీ నుదురు నువ్వే చెక్కుకున్నావా?

తన తాత మంచి చేయడానికి ప్రయత్నిస్తే అది మృత్యువై కట్టుకున్నోడ్ని మింగేసింది. కర్మఫలమా? విధిరాతా? ఇంకా పేర్లేమైనా వున్నాయా? చిన్నతనంలోనే అమ్మ, నాన్నలను యమధర్మరాజు పట్టుకెళ్ళిపోతే తాతే కదా కళ్ళల్లో పెట్టి చూసుకుంది! మరి తాతయ్యను నిందిస్తే జీవితం సర్దుకుంటుందా?

చిక్కని చీకట్లు ముసిరిన వేళలో చిరు దివ్వెను వెలిగించి తోడొచ్చిన నానమ్మ, చిక్కిశల్యమై చక్రాల కుర్చీలో జీవచ్ఛవమై ఉన్నప్పుడు ఆమెను ఒంటరి చేసి తన దారి తను వెదుక్కోవాలా? నాణేనికి ఒక వైపు అందమైన నగిషీ చెక్కి వున్నా- ఇంకో వైపు అచ్చు తప్పున్నప్పుడు- అది మ్యూజియంలోకో, చెత్తబుట్టలోకో వెళ్తుందే కానీ- జేబులు మారి సంతోషం కొనలేదు.. చెల్లదు.

నేను ఎప్పుడూ ఇదే ఆలోచిస్తుంటాను. నా బతుకెందుకు ఇలా ఏడ్చిందా అని! ఇంకేం చెయ్యలేమా?

ఇక బాగుపడే అవకాశమే లేదా? రాదా? అని!

దేవుడు ఇవ్వాలనుకుంటే-పైకప్పే కాదు, కింద వున్న భూమిని చీల్చి కూడా ఇస్తాడు. మనం జస్ట్ దాన్ని-అవకాశంగా గుర్తుపట్టాలి.. అంతే! నేను రోజూ దేవుణ్ణి వేడుకుంటాను. నా బతుకులో వసంతం పూయాలని. కానీ చూస్తుండగానే ఏళ్ళు గడిచిపోయాయి.

మోహన్ పెద్దవాడైపోయాడు. నా కొడుకున్నా ముందే నేను మరింత పెద్దదాన్నయిపోయాను. ఎదిగిన కొడుక్కి ఒక తల్లి వుంటే ఈ సమాజం ముసలితనం అంటగడుతుంది. కానీ భగవంతుడా! ప్రతి పిచ్చిచెట్టుకి కూడా పూలుపూస్తాయే! తుమ్మెద వాలుతుందే! అలా దానికంటూ ఒక ఐడెంటిటీ ఇస్తున్నావు.

ఆడదాన్ని, అన్నీ ఓర్చుకుంటాననేగా అలుసు? మరి హార్మోన్లు ఎందుకు దట్టించావు ఈ శరీరంలో? నా మొగుడు చనిపోగానే నా రుతుచక్రం ఎందుకు ఆగిపోలేదు? పోనీ- గుండు కొట్టించి తెల్లచీర చుట్టి ఓ మూలన ఉండిపోయే పాతకాలం కూడా కాదే!

ఒక ఉద్యోగమో సద్యోగమో చేసుకుంటూ పొద్దెళ్ళబుచ్చుదాం అనుకుంటే- ఒక రావణాసురుడ్ని నా మీదకు తోలుతావు. బకాసురుడు, నరకాసురుడు- ఎవడో ఒకడు- పొంచివున్న గుంటనక్కలే తప్ప-నన్ను నన్నుగా- రాముడిలాగానో,



కృష్ణపరమాత్ముడిలాగానో స్వీక రించేవాడే కానరాడే! ఏం? నలభై ఐదేళ్ళ జీవితంలో నన్ను టీవీ స్క్రీన్‌కు అటాచ్‌మెంట్ చేశావు తప్ప- ఒక మంచి మనిషి- నా మీద కన్సర్న్ వున్న వ్యక్తికి పరిచయం చేశావా?

అఫ్‌కోర్స్! చేశావ నుకుందాం! అవును- చేశావు. కానీ- ఏం చేశావు? నాయనా ఏం చేశావు?

పోయినేడాది- మెగా స్టోర్స్‌లో..

నాకు బాగా గుర్తుంది. ఆయన్ని ఫస్ట్ టైం చూశాను. మైగాడ్- మగా డంటే అలా వుండాలి అనుకున్నాను. కాసేపటికే నాలో వెచ్చదనం మొద లైతే ఏసీ ఆపేశా రేమోననుకుని సర్దిచెప్పుకున్నాను. కానీ.. అది నా మనసు- శరీరంలో రగిల్చిన వేడి అని ఒప్పుకున్నానా? లేదే!

ఆ తర్వాత, శివాలయంలో శివరాత్రి రోజు గుళ్ళో భజన, జాగరణ చేస్తూ మగ వాళ్ళ వరుసలో కూర్చున్నాడు. నా దృష్టి శివుని మీది నుంచి- అటువైపు మళ్ళింది. జాగరణం, భజన చేస్తూనే వున్నా- అది ఆనందంగా-టైమే తెలియకుండా- అరే! అప్పుడే తెల్లారిందా? అనుకుంటూ చేశా.

ఇది సరిపోనట్టు- అతను ఒకసారి అపా ర్టమెంట్ లిఫ్ట్‌లో తారసపడ్డప్పుడు- బిత్తర తత్తరయి- నాలుగో ఫ్లోర్లో దిగాల్సిందాన్ని రెండోఫ్లోరుకే దిగిపోయాను.

ఇంటి ముందు కూరగాయలు కొంటుంటే కార్లో పార్కింగ్ నుండి బయటకు వెడుతున్న అతన్ని చూసి ఈయనేంటి? ఇక్కడ..? అంటూ వాచ్ మాన్‌ని ఆయనెవర్రా? అనడిగితే -మొన్నే వాళ్లఫ్లాట్ ఖాళీ చేయించుకుని వచ్చా రమ్మా అని పిడుగులాంటి ఇన్ఫో. అంత కంటే అల్లరి పిడుగు- మెరుపు తీగలాంటి కూతురు కూడా వుందాయనికి! పెళ్ళాం చచ్చిపోయిందో, లేచిపోయిందో- ఎవరికీ కరెక్ట్‌గా తెలియదు.

అపార్ట్‌మెంట్లో గణేశ్ చతుర్ది ఉత్సవాల



ప్పుడు- స్వప్నకు నాకు ఫ్రెండ్షిప్ప య్యింది. ముగ్గుల పోటీలు, వంటల పోటీలు, సింగింగ్, ఫ్యాన్సీ డ్రెస్, అంత్యాక్షరి.. ఇట్లా అన్నిపోటీల్లో స్వప్న, నేనూ చాలా ఉత్సాహంగా పాల్గొనేవాళ్ళం. తన కన్నా, నాకన్నా ప్రైజువచ్చేది. స్వప్న శాక్సాఫోన్ ఓ మోస్తరుగా వాయిస్తుంది. గొంతుకూడా బానే వుంటుంది వినసొంపుగా. అందుకే పాటల పోటీలో ప్రైజు నాకిచ్చినా నేను తనని స్టేజి మీదకి పిలిచి ప్రైజు ఆ అమ్మాయి చేతిలో పెట్టేశాను.

గణేశ నిమజ్జనం రోజున జిలేబీలు, పులిహోరను మేమిద్దరం కలిసే వండాం. నిమజ్జనం రోజునే స్వప్న- నా నుదుట కుంకుమ- బలవంతంగా పూసింది, నే వద్దన్నా వినకుండా. రెండు దశాబ్దాల చీకటి తర్వాత నా నుదుట సూర్యుడు ఉదయించాడు మళ్ళీ.

మొగుడు పోయాక ఆడదాని నుదుట ఎర్రని బొట్టు పెట్టుకోవద్దని సమాజం ఆశిస్తుందని నాకు తెలుసు. కానీ, హిందూస్త్రీకి సహజ అలంకారమై, జన్మహక్కుగా సంక్రమించిన తిలకధారణ- మాంగల్యాంతో ముడిపెట్టడం అసమంజసం అని నేను దాన్ని కోల్పోయాక అనిపించింది. కానీ- ధైర్యం లేకపోయేది. తాతయ్యా, నానమ్మ కూడా ఏనాడూ ఈ సమాజానికి వ్యతిరేకంగా వెళ్ళినా ఫర్వాలేదనే విశ్వాసం నాకు కల్పించలేదు. కానీ- ఆ పని- ఒక టీనేజ్ పిల్ల- ధైర్యంగా చేసింది. నా అస్తిత్వం నాదేనని- ఈ సంఘం కోసం కోల్పోనవసరం లేదని గట్టిగా చెప్పింది.

చిన్నప్పట్నుంచైనా- నా రూపురేఖలు ఇతరులకు అభిమానం పెంచేలా వుంటా యని అందరూ చెప్పకనే చెప్పేవారు. నాక్కూడా నా అందం పట్ల కాస్త ఇగో వుండేది. కానీ- భర్త పోయాక- నేను సడన్‌గా అనాకారిగా ఎట్లా మారేది? ఇల్లు దాటి బయటకు కాలుపెట్టానా- అందరి చూపులు నామీదే వుండేవి. 'మొగుడి దిక్కులేని, ఒంటరి, అందమైన యవ్వనవతి' - ఇదీ నా టైటిల్. జనాలు నన్ను రకరకాలుగా చూసేవారు- అభిమానం కన్పడనీయకుండానో, కామంతో నిండిన కళ్ళతోనో, చేష్టలతోనో, ఆరాధనగానో, జాలిగానో ఏదో సహాయం చేద్దామనే ఆశతోనో..

అట్లా కాకుండా స్వచ్ఛమైన స్నేహపూరితంగా ఒక ఆడదాన్ని యాజిటీజ్‌గా చూసినట్లు చూసింది మాత్రం తనే.. మిష్టర్ వెంకీ.. స్వప్న వాళ్ళ నాన్న.

ఎన్నడూ లేనంత ఉత్సాహంగా గణేశ్ ఉత్సవాల్లో పాల్గొనడం బహుశా స్వప్న, వెంకీల ఉనికి వల్లే అని నా మనసుకు తెలుసు. శరీరం కదల్చకుండా మంచాన పడి వున్న నానమ్మ కూడా నాలో ఈ మార్పును గమనించింది.

స్వప్న రోజూ పొద్దున్నే ఒకసారి- సాయంత్రం ఒకసారి నన్ను పలకరించి- నేను చేసిన వంట ఏదో రుచిచూసి వెళ్ళేది. ఒకవేళ నేను నుదుట తిలకం ధరించి వుండకపోతే- తనే దిద్దివెళ్ళేది. నాన్నమ్మ ఏదో గొణుక్కునేది.

'హే ఛుప్.. గ్రానీ..' అనేది స్వప్న నానమ్మను బెదిరిస్తున్నట్టుగా నవ్వుతూ.

"ఎక్కువ గొణిగావంటే నీక్కూడా పెడతా!" అంటూ నానమ్మను పెళ్లి కూతురి బొట్లతో అలంకరించి ఫొటో తీసి ఫేస్‌బుక్‌లో పెట్టి నానమ్మకి చూపించింది.

అప్పుడు నానమ్మ కళ్ళలో నీరు బొటబొటా కారడం- నాకెంతో ఆనందం కలిగించింది.

నేను, మోహన్, స్వప్న కలిసి సినిమాలక్కూడా వెళ్ళేవాళ్లం. స్వప్న నావైపు కూర్చున్నప్పుడు మోహన్ నిరాశకు గురయ్యేవాడు. వాళ్ళిద్దరూ మంచి ఫ్రెండ్స్. ఇద్దరూ అప్పుడప్పుడూ చిన్నచిన్న విషయాల మీద పోట్లాడుకునేవారు. నాకెంతో ముద్దుగా అన్పించి ఇంకాసేపు ఇట్లాగే కొట్టుకోండి అనేదాన్ని.

ఒకరోజు వర్షం పడుతుంటే స్వప్న నా కిచెన్లో జొరబడి పొటాటో చిప్స్ చేసిపెట్టి.. కొన్ని వాళ్ళ డాడీ కోసం తీస్కెళ్ళింది. అవి నేను చేశానని అబద్ధం చెప్పి- వెంకీకి తినిపించి ఎలా వుంది టేస్టు? అనడిగితే ఆంటీకి ఎక్సలెంట్ అని చెప్పు అని అన్నాడట.

ఆ తర్వాత చాలాసార్లు - 'ఇవాళ మీ ఆంటీ ఏం స్నాక్స్ చేసిపెట్టింది? ఏం కూరలొండింది? ఆంటీ దగ్గర వంటలు నేర్చుకో!' అని స్వప్నకు గుర్తుచేసేవాడంట.

నేను, స్వప్న- నెల సామాన్లు కొనడానికి మలక్‌పేట సూపర్ మార్కెట్‌కెళ్ళినపుడు- వర్షం బాగా పడింది. చేతుల్లో మోయలేనన్ని సంచులు - పైగా ఆటోవాళ్లు ఎవరూ రానననడంతో - స్వప్న ఫోన్ చేయంగానే వెంకీ ప్రత్యక్షమై - మమ్మల్ని ఇంటికి తీస్కొచ్చాడు తన స్కోడా కార్లో.

ఇంకోసారి - పంజగుట్టలో నిమ్స్ ఎదు

## కొత్తగాలి...

**ప్రేమ..**
**పూర్వం కమ్మని తెలుగు!**
**ప్రస్తుతం కెమిస్ట్రీ**
**తర్వాత ఎకనామిక్స్**

**- గుడిమెట్ల గోపాలకృష్ణ,**
అరసవల్లి

రుగా బస్టాప్‌లో నన్ను చూసి కారాపి - ఎక్కమన్నాడు. ఫర్లేదు నేను బస్సులో వచ్చేస్తానని చెప్పినా - రండి మేడమ్ - స్వప్నకి ఈ విషయం తెలిస్తే నన్ను తిడ్తుంది అని మొహమాట పెట్టి ఇంటిదగ్గర డ్రాప్ చేశాడు.

తనతో అదే నేను తొలిసారిగా మాట్లాడ్డం. మనిషి చూడ్డానికి హీరోలా వున్నా మాట మాత్రం పల్లెటూరి వాసన. పెద్దగా చదువుకోలేదట గానీ - సంపాదన బాగానే వుందంట. పైగా వూర్లో వ్యవసాయం - రెగ్యులర్‌గా వెళ్తూవస్తూంటాట్ట.

ఓ శనివారం రోజు నన్ను కర్మన్‌ఘాట్ హనుమాన్ దేవాలయం దగ్గర మోహన్ వదిలిపెట్టి వెళ్ళాడు. లోపల వెంకీ - అక్కడ దేవస్థానం ఆఫీసులోపల్నుండి నన్ను చూసి నావద్దకొచ్చి.

"మేడమ్! మీ బాబు రాలేదా? ఒకళ్ళే వచ్చిరా? " అనడిగాడు.

"ఔను సర్! మోహన్ డ్రాప్ చేశాడు. తనకి టైమవుతోందని వెళ్లిపోయాడు" చెప్పాన్నేను గుళ్లోకి వెళుతూ.

"రండి - ప్రత్యేక దర్శనం చేయిస్తాను!"

అదేంటన్నట్లు ఆయన వైపు చూశా.

"నేనిక్కడ ఎగ్జిక్యూటివ్ మెంబర్ని. ప్రతి శ్రీరామనవమికి ఒక కమిటీ లాగా మారుతుంటం.. ఎప్పట్నుంచో.. ఇక్కడ అందరూ మనోళ్ళే.. రండి.."

నా కోసం తన భాషను ట్రిమ్మింగ్ చేస్తూ.. నన్ను లోనికి తీస్కెళ్ళి - బోలెడంత జనాల మధ్యలోంచి లైన్లో కాకుండా పక్కదార్లో వెళ్ళి పూజారికి చెవిలో ఏదో వూదాడు. పూజారి ఎక్కడలేని ఇంట్రెస్టు ప్రదర్శిస్తూ నన్ను మహారాణిలా భావించి రకరకాల మంత్రోచ్చారణ చేస్తూ దైవదర్శనం, హారతి.. ప్రసాదం.. బైటకి.

"రండి మేడమ్! ఇంటి దగ్గర వదిలిపెడ్తా"

"ఏంటి సార్? మీకు డ్రాపింగ్ చెయ్యడం హాబిట్టా? కనబడ్డోళ్ళందర్నీ కార్లో డ్రాప్ చేస్తుంటరా? " సరదాగా అన్నాను ప్రసాదం లడ్డు తింటూ.

"ఎవర్ని చేసినా, చెయ్యకపోయినా - మీరైతే తప్పక చేస్తా. మా స్వప్నకు బాగా కావల్సిన ఫ్రెండు కదా మీరు. అది వూర్కోదు!"

"వద్దులెండి! నేను ఆటోలో వెళ్ళగలను. నాకు కొత్తేం కాదు. నడుచుకుంటూ వెళ్ళొచ్చు దగ్గరే కదా మన అపార్ట్‌మెంట్"

"మీ యిష్టం! అరేయ్ ఆటో.." అంటూ ఆటోని పిలిచి నన్ను కూర్చోమన్నాడు.

ఆటోవాడు నన్ను ఇంటి దగ్గర వదిలాక డబ్బులు తీసుకోకుండా తుర్రుమని పారిపోతుంటే నాకు నవ్వాగలేదు.

ఇంకోరోజు - మోహన్ కాలేజ్‌కెళ్ళిపోయాక ఇంటికొచ్చాడు. ఆయన్తో పాటు ఇంకెవరో వ్యక్తి వున్నాడు. నేను డోర్ దగ్గరే నుంచోబెట్టి మాట్లాడాను.

"మేడమ్! మా చిట్‌ఫండ్స్‌లో మీరేమైన సభ్యత్వం తీసుకుంటారా? పది లక్షల చీటి ఒకటి ఖాళీ వుంది. చేరతారా? " మర్యాదగా అడిగాడు.

"నేను చీటీలో చేరను" నేనూ మర్యాదగా చెప్పాను.

"తెల్సు. కానీ- మాకు ఒకే ఒక్కమెంబర్ తక్కువ పడ్డరు. మీరుగిట్ల చేర్తరేమోనని డౌటొచ్చి ఇట్లొచ్చేశిన"

"సారీ సర్! ఇట్లాంటివి నాకలవాటు లేదు. అవసరమూ లేదు. అందుకే చేరను"

"పోనీ, మీ ఫ్రెండ్స్‌నెవరినన్నా.." వెంకీ పక్కనున్నతను అడిగాడు. బహుశా చిట్‌ఫండ్స్ పార్ట్‌నర్లు అయ్యుంటారు.

"ఏదన్నా వుంటే స్వప్నకు చెప్తాల్లెండి" చిరునవ్వుతో చెప్పాను. ఆ సాయంత్రం స్వప్నతో చెబితే - "మా డాడీ- మీ యింటికొచ్చారా? " అంటూ ఆశ్చర్యపోయింది.

రెండ్రోజుల తర్వాత మోహన్‌తో చెక్కు రాయించి సభ్యత్వం ఇప్పించాను వెంకీ చిట్‌ఫండ్సులో. స్వప్న ద్వారా డిన్నర్‌సెట్

కానుకగా పంపించాడు.

కేవలం మాకే ఇచ్చాట్ట - అలాంటి ఖరీదైంది. మిగతావాళ్ళకి ప్లాస్టిక్ డబ్బాలేవో ఇచ్చినట్టు చెప్పింది స్వప్న.

మోహన్ స్వప్నతో బాగా క్లోజవుతున్నట్టు నాకు తోచిందొకరోజు. కానీ - ఈకాలం పిల్లలు - అరేయ్ ఒరేయ్, ఏరా పోరా అనుకునే జెనరేషన్. అట్లాగే ఎంత ఇదిగా చేరువవుతారో అంత స్పీడుగానే ఎవరిదారిన వాళ్ళు పోతారు. నేనూ అందుకే వాళ్ళ స్నేహాన్ని పట్టించుకోలేదు.

ఒకసారి స్వప్న నార్తిండియా టూర్ కెళ్ళినప్పుడు వెంకీకి బైక్ ఆక్సిడెంటయ్యింది. కాలు, చెయ్యి ఫ్రాక్చరై హాస్పిటల్లో జాయినయ్యాడు. స్వప్న ఇంకో రెండ్రోజుల్లో రావాల్సి వుంది. అప్పుడు మోహనే మొత్తం చూసుకున్నాడు. డిశ్చార్జ్ అయి ఇంటికొచ్చాక స్వప్న కాలేజ్ మానేసి తన తండ్రి బాగోగులు చూసుకోవడం మొదలు పెట్టింది. కానీ ఎన్ని రోజులని కాలేజీ బంక్ కొడ్తుంది?

"దగ్గరుండి వంటమనిషి, పనిమనిషి చూసుకోలేరు కదా ఆంటీ! మా వూరి నుంచి చుట్టాల్ని పిలిపించడం డాడీకి ఇష్టం లేదు. ఎవరు మాత్రం తమ పనుల్ని వదిలేసుకుని, తమ సంసారాన్ని వదిలేసి డాడీ కోసం వచ్చి సేవలు చేస్తారు చెప్పండాంటీ! అందుకే నేను కాలేజీకెళ్ళకుండా చూసుకుంటున్నాను" అంది స్వప్న.

"నేను వెళ్ళి మధ్య మధ్యలో చూసొస్తాన్లే స్వప్నా. నువ్వెందుకు స్టడీస్‌లో వెనకబడాలి? నువ్వెళ్ళు ఎట్లాగూ హోండా యాక్టివా నేర్చుకుంటున్నావు కదా! త్వరగా ఇంటికి రావచ్చు మోహనో, నేనో చూసుకుంటాం లే!" నేనట్లా అనేసరికి మొదటిసారి - స్వప్న నన్ను కన్నీళ్ళు కారుస్తూ కౌగిలించుకుంది. ఇద్దరం అట్లా ఎంతసేపు హత్తుకుని వున్నామో తెలీదు.

స్వప్నకు తల్లి, వెంకటేశ్వర్లు భార్య అవసరం ఇప్పుడు స్పష్టమైంది. కానీ - మన చేతుల్లో ఏముంది? ఎవరూ కావాలని ఈ పరిస్థితులు కల్పించుకోరు - అవి అట్లా జరిగిపోతుంటాయంతే.

నేను వెంకీని పలకరించడానికి వెళ్ళినప్పుడల్లా ఆయన చాలా మొహమాటం, ఇబ్బంది పడేవాడు.

"ఏదన్నా కాఫీనో, టీనో పెట్టివ్వమంటారా? " అని అడిగేదాన్ని.

"మీకెందుకండీ అంత శ్రమ! వద్దండి!"

"భలేవారే! నాకు కాఫీ, టీ పెట్టడం వచ్చును"

"ఓఫ్! సరే మీరేది తాగితే అదే పెట్టండి"

అప్పటికే వెంకీ కొంచెం రికవరయ్యాడు. వాకర్స్ సహాయంతో నడుస్తున్నాడు. తనకు తానే బాత్రూం వరకు వెళ్ళగలుగుతున్నాడు.

వెంకీ బెడ్ పక్కన కిటికీలోంచి ప్రియదర్శిని పార్క్ వ్యూ చాలా బాగుంది. చెట్లు పూలతో సింగారించుకున్నాయి. ఆకుపచ్చని చీర చెరువులో ఉతికి ఎండకు ఆరేసినట్లు - మనోహరంగా వుందా పార్క్.

"నాకు త్వరగా బాగైపోయి - ఆ పార్కులో రన్నింగ్ చేయాలనిపిస్తోంది మేడమ్!"

"చూశారా! నడక లేకపోతే గానీ - దాని విలువేంటో తెలియదు. ఇదిగోండి కాఫీ"

మేమిద్దరం కాఫీ చప్పరిస్తూ చాలాసేపు మౌనంగా వున్నాం. వెంకీ ఉన్నట్టుండి కన్నీళ్ళు కార్చాడు.

"థాంక్స్ మేడమ్! థాంక్స్ వెరీమచ్!" ఏడ్చేశాడు.

"ఏమైంది? " మెల్లిగా అడిగాను

"నేను భార్యలేని వాడినని తెల్సి కూడా మీరు ధైర్యం చేసి నా వంటింట్లోకొచ్చి కాఫీ పెట్టిచ్చారు. మీకు కూడా భర్త లేదు. ఎవరేమనుకుంటారోనని భయపడకుండా.. శానా డేర్ మీకు.." అంటూ మళ్ళీ

ఏడ్చాడు.

"మీకు లేదా డేర్? ఎవరేమనుకుంటారో అనుకోకుండా - మీ కార్లో నన్ను డ్రాప్ చేశారు కదా!"

"అవునవును! కానీ - అది డేర్ కాదు. ఒక ఆడమనిషితో మాట్లాడనీకే- అవ సరం. అంతే. ఈ వయసులో నాకేం కావాలి? జర్రంత కంపెనీ. ముచ్చటగిట్ల పెడ్తె మనసుల సుఖం అన్పిస్తుంది"

ఆయన చెప్పేది కరెక్ట్. సోల్‌మేట్‌షిప్.

మొగుడూ పెళ్ళాలకైనా కూడా శారీర కంగా కలవడం కన్నా రాత్రానూ, మాట్లాడు కోవడమే బాగుంటుంది. సెక్స్‌కు సహక రించకపోయినా కంప్లెయింట్ చెయ్యరు కానీ - ముచ్చట్లాడకపోతే ఫీలవుతారు. మనుషులకు పలకరింపులు ఎంత అవస రమో కదా!

నాక్కూడా అవసరమే. నాకూ ఒక తోడు కావాలి. పొద్దున్నే లేచినపుడు నేనొ క్కదాన్నే లేస్తే పక్కనే లేవడాన్కి తోడు లేకపోతే - ఆ దుర్భర బాధ - అనుభవి స్తేనే తెలుస్తుంది. కానీ - నేనిప్పుడు పెళ్ళి చేస్కుంటానంటే - సమాజం హర్షించదు కదా - మొహాన వుమ్మేస్తుంది. కానీ - ఈ సమాజానికి తెలియజెప్పక్కర్లేకుండా నా మనసులో నేనెవర్నయినా ప్రేమించొచ్చు. ఎందుకంటే అది నాకు తప్ప ఎవరికీ తెలి యదు. దానికి సమాజంతో పనిలేదు. అయినా తెలిస్తే ఏమంటుందీ సమ సమాజం? 'ఈ వయసులో ప్రేమిస్తావుటే మెంటల్‌దానా?' అంటుందా? 'బరితెగిం చావే - పెళ్ళికెదిగిన పిల్లల్ని పెట్టుకుని ఏంటా ప్రవర్తన? కామంతో కళ్ళు నెత్తికె క్కాయి..' ఇంకా ఎన్ననాల్సో అన్నీనూ.

నాకు తెలీకడుగుతానూ - ప్రేమకి వయ సేంటండీ? నాకు పెళ్ళీడుకొచ్చిన కొడుకో, కూతురో వుందనుకున్నా - నేను కేవలం తల్లిప్రేమ పంచడానికి మాత్రమే అర్హురా లినా? అంటే - నాకు ఇప్పుడు నా భర్తే గనక వుండుంటే ఆయనకి నా ప్రేమ పంచొద్దనా? అతన్ని ప్రేమించకపోయినా ఫర్లేదనేగా అర్థం?

నేను నలభై ఐదేళ్ళుగా సమాజం వంక చూస్తున్నా. అది నా వంకా చూస్తోంది. ఈ సమాజంలో ఏ ఒక్కరూ - ఈ అమ్మా యికి దేవుడన్యాయం చేశాడ్లే పాపం! విధి వెక్కిరించిందిలే పాపం! దీనికి సహాయం చేద్దాం! దీనికో తోడును వెదికి పెడ్దాం..! పెళ్ళాం చచ్చినవాడ్నో, పెళ్ళాం లేచిపోయి నవాడ్నో, ముసలోడ్నో, రోగిష్టోడ్నో వెదికి జతకడదాం.. అన్న పాపానే పోలేదు!

ఈ రోజున నా ముందుకొచ్చి నీ వయ సెంత? నీ మొహం అద్దంలో చూసుకు న్నావా? ఇప్పుడు నువ్వు ప్రేమ కోసం ఆశి స్తున్నావా? ఇప్పుడు నువ్వు ప్రేమ కోసం ఆశిస్తున్నావంటే అది కేవలం కామవాంఛే తప్ప మరోటికాదు, కాదు - అంటుందా?

డామిట్!

ఐడోంట్ కేర్. జస్ట్ డోంట్‌కేర్ ఎబౌ టిట్. నేను - ఈ పాత చింతకాయ పచ్చ ళ్ళు - తినను. వెంకీ గనక ఒప్పుకుంటే అతన్ని చేసుకోవడాన్కి రెడీ.. రెడీ రెడీ!

నేను ఇలాగే ముసలి దాన్నవుతూ చచ్చి పోవడాన్కి పుట్టలేదు. నన్ను గురించి ఎవరు ఏ కామెంట్లు చేస్కున్నా నా చెవు లదాకా రానవసరం లేదు.

మరి.... నాన్నమ్మ, మోహన్...? వీరి రియాక్షన్?

ఒకవేళ వీళ్ళు నాకు మానసికంగా దూర మైతే? అది మాత్రం భరించలేను. అలా గని వాళ్ళిద్దర్నీ కన్విన్స్ చెయ్యలేను. ఒక ఆడదానికి - తన పెళ్ళికి కొడుకును తల్లి ఒప్పించడం రాదు.. గతకాలపు ఛాందస స్వభావం వున్న నానమ్మకు ఆగ్రహం తెప్పించడం... నేను భరించలేను.

అందుకే... మౌనం అనే బట్టను మన సుమీద కప్పేశాను.

★ ★ ★

అనసూయ మనోగతమంతా చెప్పి నిరోషా నా కళ్ళలోకి లోతుగా చూసింది.

ఆ చూపులో నాకేదో ఫేవర్ చేసిన గర్వం తొణికిసలాడుతోంది. నాస్పందన చూడాలనే తహతహ కూడా వుంది.

"ఇంత రహస్యమైన ఆలోచనలు మనసు విప్పి నీతో చెప్పుకుంది - అదీ పది రోజుల పరిచయంలో- అంటే అస్సలు నమ్మశక్యంగా లేదు! నిజం, ఇదంతా షాకింగ్ బ్రేకింగ్ న్యూస్!" అన్నాను నిరోషాతో.

"పది రోజులే - ఔను! ఏ ఆడది తన మనుసులో మోయలేని బరువును మోస్తుందో - తనకు నచ్చిన వాళ్ళతో ఆ బరువును పంచుకుని దించుకుంటుంది"

"ఐనా - అనసూయ మనసులో ఇదంతా వుందని నువ్వెట్లా గ్రహించావు? ఆమెని ఎట్లా కదిపావు? "

"మనం దేనిపట్ల ఆకర్షితులమై అబ్సెస్సివ్‌గా వుంటామో - మన మాటల్లో అదే దొర్లుతూ వుంటుంది. నేను తనని స్వప్న గురించి కదిపినపుడల్లా టాపిక్ వెంకీ మీద వాలిపోయేది. నావి కొన్ని రహస్యాలు ఆమెతో షేర్ చేసుకునే సరికి - ఆమె కూడా తనవన్నీ చెప్పుకోవడం మొదలుపెట్టింది. ఇంతకీ మీక్కావల్సిన 'వికీపీడియా' దొరికిందా లేదా? "

"ఏయ్! నీ రహస్యాలా? అదేంటి? ఏం చెప్పావ్ ఆవిడకి? నా గురించేనా? "

"అనసూయ వెంకీని ఇష్టపడ్డట్టు - నేనూ ఇంకెవర్నో నా మనసులో ఆరాధిస్తుండొచ్చుగా!"

"నేను జీవించిలేనపుడు, నేను నీకిష్టం లేనప్పుడు - నువ్వెవర్నైనా ఇష్టపడితే తప్పేం లేదు. కానీ - నువ్వు నన్ను ప్రేమిస్తూనే వున్నావుగదా. నా గురించే ఆమెకు చెప్పావు ఔనా!"

"ఓ మగాడు ఒకే సమయంలో తన పెళ్లాన్ని, సిన్మా హీరోయిన్ని ఇష్టపడితే తప్పుకాదు గానీ - ఒక ఆడది తన మొగుణ్ణి, ఓ సిన్మా హీరోని ఇష్టపడకూడదా? "

"ఆ ఇష్టాలు వేరు. అవి తీరేవి కాదు కాబట్టి వాటివల్ల ప్రాబ్లం వుండదు. కానీ అందుబాటులో వుండే ఒక వ్యక్తి పట్ల ఆరాధన పెరిగి - అబ్సెషన్‌లాగా మారితే - అది ప్రాబ్లంగా మారుతుంది. వెంకీలాగా అనసూయ కూడా ఒంటరి పక్షి కాబట్టి వాళ్ళిద్దరూ ఒకరిపట్ల ఒకరు ఆకర్షితులయ్యారంటే అందులో ఆశ్చర్యమేముంది? ఎటొచ్చీ వచ్చిన చిక్కల్లా... మోహన్ - స్వప్న జంట గురించే. రెండు జంటలకీ 'చెక్' పడింది"

"ఆలోచిస్తే - అదే జరిగుంటుంది. కానీ అనసూయ వెంకీని ఇష్టపడుతున్నట్టు - మోహన్ స్వప్నలకెట్లా తెలిసుంటుంది? అది మీరు కనుక్కోవాల్సిన విషయం"

"ఇంతకీ నువ్వు అనసూయతో చెప్పిన రహస్యాలేంటి? "

"అబ్బో! మీ మగ అనుమానపు బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. మన మధ్య జరిగినవే చెప్పాను. నిజాలే చెప్పాను"

"ఏంటా నిజాలు? " సీరియస్‌గా అడిగాను. నిరోషా మీద కోపం వచ్చేసింది. ఇంకోళ్ళ రహస్యాలు నేను బానే సేకరిస్తున్నాను గానీ, నా రహస్యాలు ఇంకొకరికి చెప్తే ఎందుకు నాకు కోపం కలగాలో నాకింకా అర్థంకావట్లేదు.

నిరోషా నేననుకున్నదే అంది.

"ఒక రహస్యాన్ని ఓపెన్ చేయాలంటే - దానికి మరో రహస్యమే పాస్‌వర్డ్‌లాగా పనిచేస్తుంది. ఔనా కాదా? " అంది నిరోషా.

"అఫ్‌కోర్స్... అర్థమైంది" నా కోపం తగ్గుముఖం పట్టింది.

"ఔను కదా! మన పెళ్ళికి ముందు నేను ఒక పెద్ద లాబ్‌లో ఇసీజీ టెక్నీషియన్‌గా పనిచేసేదాన్నని, ఒక కార్డియాలజిస్ట్ డాక్టర్ నాకు పెళ్ళికి ప్రపోజ్ చేశాడని, దాన్ని మా నాన్న - కులం తక్కువ వాడని రిజెక్ట్ చేసి మీతో పెళ్ళి చేశారని చెప్పాను. అట్లాగే

మీరు, మీ పక్కింటమ్మాయితో వ్యవహారం, పారిపోయి పెళ్ళి చేసుకునేదాకా వస్తే - మీ అమ్మ పెట్టించుకున్న ఒట్టుకు తల వంచి ఆ అమ్మాయిని మర్చిపోయి నన్ను పెళ్ళి చేసుకున్నారని - చెప్పాను"

"దానికావిడ ఏమంది? "

"మీ ఇద్దరి తొలి ప్రేమలు - ఇప్పటికీ సజీవంగా వున్నాయా? అనడిగింది"

"ఏం చెప్పావ్ మరి? "

"మనం తొలి ప్రేమ అనుకున్నది కేవలం వ్యామోహం లేదా ఆకర్షణో కావచ్చు. మనకు వయసు పైబడి మెచ్యూరిటీ వచ్చాక అట్లాంటివన్నీ తేలిగ్గా మర్చిపోతాం. లేదా వాటి తీక్షణత - అంతగా బాధించని మానసిక స్థాయికి చేరుకుంటాం - మతి మరుపు - ప్రస్తుత జీవనం - అనేవి మనిషి మనుగడను సుఖమయం చేస్తాయి అని సమాధానం చెప్పాను. నా వివరణ తనకి నచ్చింది"

"నైస్. నిజానికి నువ్వు రచయిత్రిగా మారొచ్చు. నువ్వైతే ఈ స్టోరీని చక్కగా రాయగలవ్. ఇంతకీ అనసూయ - వెంకీని ఇష్టపడటం వెనక - ఆమె చూసే టీవీ సీరియళ్ళ ప్రభావం ఏమీ లేదంటావా? " నవ్వుతూ అడిగేశాను.

"బహుశా వుందేమో! మన అంతఃచేతనంలో వాటి ప్రభావం తప్పక రిజిష్టరవుతుంది. అందుకే నేను వాటి జోలికి పోను" తనూ నవ్వేసింది.

★ ★ ★

రేవతి మలక్‌పేటలో తన ఆఫీసు నెలకొల్పింది. టీవీటవర్ వెనక వున్న తిరుమల హిల్స్ ప్రాంతంలో వెంకటేశ్వర స్వామి ఆలయం అత్యంత ఎత్తైన స్థలంలో ఉంది. ఆ పక్కనే ఒక అపార్ట్‌మెంట్లో దాదాపు ముప్పైమంది సిబ్బందితో అత్యాధునిక కంప్యూటర్లను తెప్పించి - ఒక్క రూపాయికి ఒక్క భోజనం- కోసం పని ప్రారంభించింది. స్వప్న కూడా అందులో ఒక ఎంప్లాయి. తన ఫైనల్ పరీక్షలు ఇంకా పూర్తి కానందున ఆమె అందులో ఇంకా జాయినవ్వలేదు. కానీ రేవతి పిలుపుతో స్వప్న వెళ్ళి కాసేపు తల్లి దగ్గర గడిపి వస్తుండేది.

వెంకటేశ్వర్లు వ్యవసాయ పనుల కోసం వూరికెళ్ళినప్పుడు తన ఫ్లాటుకు తల్లిని ఆహ్వానించింది. ఇద్దరూ కలిసి చక్కగా లంచ్ వండుకుని కలిసి భోంచేశారు. సడెన్‌గా అనసూయ ఎంట్రీ ఇవ్వడంతో స్వప్న కంగారు పడింది. దాంతో స్వప్న ఉద్యోగంలో చేరిన కంపెనీకి యజమానురాలిగా రేవతి తనను తాను పరిచయం చేస్కుంది. అప్పటికి స్వప్న కొంత తమాయించుకుని అనసూయను తన క్లోజ్ ఫ్రెండ్ మోహన్ వాళ్ళ మమ్మీగా రేవతికి పరిచయం చేసింది.

ఇంకో ఆదివారం కూడా వెంకీ లేనప్పుడు రేవతి స్వప్న కోసం రావడం లిఫ్టులో మోహన్‌కు ఎదురైనా స్వప్న రేవతిని పరిచయం చెయ్యకపోవడం, అది మోహన్ తన తల్లితో చెప్పడం, అనసూయకి డౌటొచ్చి ఫ్లాట్లోకి వెళ్ళడం అక్కడ రేవతి ఒడిలో పడుకున్న సీన్లో స్వప్న కన్పడ్డం...

"బోల్టు వేసుకోవడం మర్చిపోయినట్టున్నావ్ స్వప్నా!" అంది అనసూయ వెటకారంగా.



## భలే భలే!

అధివాస్తవికత చిత్రాలతో ఖ్యాతి గడించిన సాల్విడార్ డాలీ చిత్రాలు అర్థం చేసుకోవడం మెదడుకు పెద్దపనే! ఆయన వ్యక్తిగత జీవితమూ విచిత్రమే! మహరాజునంటూ రాజుమాదిరే వేషం వేసుకునేవాడు. పొడవాటి మీసాలు పెంచి, నునుపుగా మెలితిప్పి శాటిలైట్ ఏంటెన్నాలని అనేవాడు. వాటికి రంగులు పూయడంలాంటి విచిత్ర చేష్టలెన్నో చేసేవాడు.

స్వప్న తలదించుకుంది.

రేవతికి ఇక తను కల్పించుకునే టైం వచ్చిందని తెలిసిపోయింది.

"మీరు అనసూయగారే కదా! స్వప్న మీ గురించి నాకంతా చెప్పింది. నేను లేని లోటుని తనకి మీరే పూరిస్తున్నారని కూడా చెప్పింది"

"మీరు లేని లోటా? అంటే మీరు? "

"స్వప్న కన్నతల్లిని. రేవతి వెంకటేశ్వర్లు నుండి రేవతి సుందర్‌పటేల్‌గా దిగజారి పోయిన రేవతిని. స్వప్నకు పన్నెండేళ్ళున్న ప్పుడు ఇల్లొదిలి పోయాను. నా ఆనందం వెదుక్కుంటూ అమెరికా వెళ్ళాను. కానీ నా ప్రారబ్దం నా కళ్ళు తెరిపించింది. అందుకే నా కూతుర్ని వెతుక్కుంటూ మళ్ళీ ఇక్కడి కొచ్చాను.." అంటూ తన తలమీద విగ్గు తీసి పక్కనపెట్టి కీమోథెరపీతో (జుట్టు లేని) తల ఎట్లా బోసిపోయిందో తన క్యాన్సర్ తనకింకా ఎంత జీవితం మిగి ల్చిందో అనసూయ కన్నీళ్ళు పెట్టుకునే దాకా చెప్పింది రేవతి.

"అనసూయగారూ నేను వెంకటేశ్వర్లుకు కాళ్ళమీద పడి క్షమాపణ చెప్పుకోవడానికి, ఇంకా నా కూతురిని క్షమించమని అడగ టానికి ఇక్కడికి వచ్చాను. అంతేకాని వీళ్ళ జీవితాల్లోకి ప్రవేశించి నాకో స్థానం ఇవ్వ మని అడగటానికి మాత్రం కాదు! స్వప్న నన్ను క్షమించి 'అమ్మా' అని పిలిచింది. అది చాలు నాకు. నా బిడ్డ నన్ను ద్వేషిం చకుండా ఆమెకు ప్రేమను పంచింది మీరే నని అర్థమైంది. నోరు తెరిస్తే మీ పేరే వల్లిస్తుంది నా చిన్నారి. మీకు ఎంతో రుణపడి వున్నాను. మీ వల్లే నేను ఈ రోజు ఇక్కడ ఇట్లా నుంచుని మీతో మాట్లాడగల్గుతున్నా" అంటూ రెండుచే తులూ జోడించి అనసూయకు దండం పెట్టి కౌగిలించుకుంది.

ఏడవాలో నవ్వాలో తెలీని డోలాయాన స్థితిలో అనసూయ.. అవాక్కయింది. దేవుడా! - ఇన్నాళ్ళకు నా జీవితంలో ఒక తియ్యని మలుపునిచ్చావని సంబరపడు తుంటే దానికీ ట్విస్ట్ ఇచ్చావా రామా!

రామా రామా!

నా జీవితంలో వెంకీ అనే చాప్టర్ ఇక క్లోజయ్యింది అనుకుంటూ నిశ్చయించింది అనసూయ.

అనసూయ అప్‌సెట్ ఎందుకయ్యిందో స్వప్నకు అర్థం కాలేదు. రేవతి కూడా అన సూయ మొహం సడెన్‌గా మారిపోవడం గమనించింది. బహుశా వెంకట్ పట్ల అన సూయ అనురాగం పెంచుకుందా? స్వప్న పట్ల మమకారం అసూయకి గురిచే సిందా? ఐనా నాకెందుకు? ఏదో అతి థిగా వచ్చిందాన్ని, మృత్యువు పిలుపుకోసం ఎదురుచూపులు చూస్తున్నదాన్ని నాకెం దుకు అనుకుంది రేవతి. ఐనా, స్వప్నను ఒకసారి అడిగి చూసింది. తనకు తెలీదంది స్వప్న.

దాంతో ఆమె మనసులో డౌటు ఫైలు పుటప్ అయ్యింది. రాత్రానను అంటే గంట గంటకీ ఆ ఫైలు సైజు పెద్దదయింది.

కేవలం ఇద్దరే కరెక్టుగా ఆ ఫైలును క్లియర్ చేయగలరు. వెంకట్ లేదా అన సూయ!




**పా**ర్క్‌లో వాక్ చేస్తూ ఆలోచిస్తు న్నాను.. నిజానికి మన జీవితాలు వాటం తట అవే దొర్లిపోతుంటాయి. పొద్దున్నే

లేవడం, క్యాలండర్లో కొత్త తారీఖును పాతది చేసేసి నిద్రపోయేదాకా కాలం తన పని తాను చేస్తూపోతుంటుంది. జీవరాశు ల్లోకి అత్యంత తెలివైన ప్రాణులమైన మనుషులం మనమే ఇట్లా అనుకుంటే ఇంక కుక్కలు, చీమలు, ఈగలు, దోమలు.. చెట్లు ఏమనుకుంటాయో కదా! అనిపిస్తుంది.

ప్రియదర్శిని పార్క్‌లో నడక ఎప్పట్నుం చైతే ఆరంభించానో అప్పట్నుంచి నాకు ఈ చెట్లు చేమలతో దగ్గరగా గడిపే అవకాశం లభించింది. దాని గేటు దాటి లోనికొచ్చి ఎడం వైపుకి తిరిగితే వరుసగా ఆకాశమల్లి వృక్షాలు పూలురాలుస్తూ ఆహ్వానిస్తూ వుంటాయి. అప్సరసలు కాళ్లెత్తి మడతేసిన ట్లుండే ఆ వృక్షపు కాండాలు, కాలిగోళ్ళకు ఆకుపచ్చ నెయిల్ పాలిష్ పూసినట్లుగా వేలాడే చిన్న చిన్న ఆకులు.. ప్రియుని రాకకోసం మీనమేషాలు లెక్కిస్తున్నట్టుగా వున్న చేతివేళ్ళ సమూహంలాంటి తెల్లని పొడవాటి పుష్పాల గుత్తులు.. నేను వాటి కింద నడుస్తున్నప్పుడు అవి రాలుతూంటే నాతో పరిచయం పెంచుకోవాలనే తహత హలా గోచరిస్తోంది.

చెప్పదల్చుకుంది ఏంటంటే కదిలితేనే జీవం. బిగుసుకుపోయామా అది శాపం. ప్రకృతి, కాలంతో పాటు కదిలి తన జీవత త్వాన్ని రుజువు చేసుకుంటూ వుంటుంది. మనిషి కూడా ఈ ప్రకృతిలోని భాగమే కాబట్టి మనం ఎప్పుడూ బిగుసుకుని ఫ్రీజయ్యి వుండకూడదనేది నా సిద్ధాంతం. ఈ పార్కులో ఒక పక్క వాలీబాల్ ఆడుతూ అరుస్తూ నవ్వుతూ తుళ్ళుతూ పెద్దలు... ఇంకోపక్క ఉయ్యాలలూగుతూ తమలోతామే ఆనందించే ఎదుగుతున్న ఆడపిల్లలు... మరో పక్క జారుడు బండ మీద సర్రున జారిపడే చిన్నారి పసి వాళ్ళు... అందరూ కదుల్తూనే వున్నారు.

గుర్రం బొమ్మల రంగులరాట్నం కింద వళ్ళు విరుచుకుని జీవితంలోనికి లాగిన్ అవుతున్న చిన్న కుక్కపిల్ల లేచిందగ్గ ర్నుంచీ పార్కంతా ఎగురుళ్ళు దూకుళ్ళే. అర్ధచంద్రాకారపు కప్పునానుకుని పెరుగు తున్న వెదురు చెట్లు తన నీడన నడిచే జనాలకి ఎంత కర్ర ఐనా కాస్తంత వంగి తేనే ఉపయోగం అన్న సందేశమిస్తున్నట్ట నిపిస్తుంది.

ఈ పార్క్‌లో అక్కడక్కడా రాతి శిల్పాలు కూడా వున్నాయి. గత శతాబ్దాల్లో ఎవడో నరికి పారేసిన శిల్పాలను చూసి కాపీకొట్టారో లేక ప్రేరణ పొందారో ఈ దశాబ్దంలో చెక్కిన శిల్పాలని కావాలని చేతులు కాళ్ళు కోసిపారేసినట్టుగా చెక్కడం దానికి కళాఖండం అని పేరుపెట్టడం.. నాకు నచ్చలేదు. ఓ వారగా చెట్ల పొదల మధ్యన వున్న ఆడ శిల్పానికి ఇంతింత వక్షోజాలు, సన్నని నడుము, ఆ కిందనే అమోఘమైన జఘనం... కానీ కాళ్ళూ నరి కేసినట్టుగా అవి లేవు. మరి ఆమె ముఖంలో ఆ దైన్యం గోచరించదే? పైగా సిగ్గొకటి.

బోటింగ్ ప్రదేశం దాటాక చెరువు ఒడ్డున మూడంతస్తుల మేడల్లాగా పోక చెట్లు వరుస ఇళ్ళు తలపిస్తూ వూగుతు న్నాయి. చెరువు బురదలో తెల్లని కొంగలు ఏం వెదుకుతున్నాయో తెలియదు కానీ - బురద నలుపును వంటికి పట్టించుకుని మురుస్తున్నాయి. చిన్నారి ఊర పిచ్చుకలు క్షణ కాలం కోసం అక్కడా ఇక్కడా వాలుతూ మళ్ళీ మళ్ళీ ఎగురుతూ - పిచ్చి జన్మను అనుభవిస్తున్నాయి. నిజంగా ఇవన్నీ పూర్వ జన్మలా? మరుజన్మలా? ఒక సీతాకోక చిలుక ఎర్రని పుష్పం మీద వాలి మధువును గ్రోలి పుప్పొడిని మోసు కుని మరో పుష్పం మీదకి వాలబోయి దాన్ని కవ్విస్తుందే.. ఎవడన్నాడు - వీటికి మెదడుండదని?

చేతి మీద వాలిన చిన్న దోమకి కూడా

మెదడు వుంటుందని, దాన్ని చరుస్తున్న విషయం ముందే పసిగట్టి అది తప్పించుకోగలదని తెలిసినా.. ఒప్పుకోం.

కాని వాటికా జ్ఞానం లేనప్పుడు ఆ జాతి ఎప్పుడో అంతరించి పోయుండేది కదా! మనుషుల ప్రవర్తన బాగా తెలిసినట్టే మసలుకునే జీవరాశులు నాకు పునర్జన్మల మీద మీమాంసను రేపుతుంటాయి.

చనిపోయిన మా నాన్న ఆత్మ ఏ కాకిగానో, పిట్టగానో, లేదా చెరువులో చేపగానో - గడ్డిగానో చెట్టుగానో... జన్మ తీసుకుని వుండొచ్చు. నావైపు తదేకంగా చూస్తోన్న తెల్లని పావురం, మా తండ్రిగారే నన్ను చూసి నాకు దగ్గర్లోవాలి... తనివి తీరా చూసుకుంటున్నారేమో అనిపించి నాకే నవ్వొస్తుంటుంది.

అసలేది సత్యం? ఎవరు చెప్తారు మనకి? సత్యశోధన నిత్యాన్వేషణ. హిమాలయాల్లోని గుహల్లో తపస్సు చేసే రుషికి అన్ని విషయాలూ తెల్సివుండవచ్చు గాక, కానీ అతనెవరో మనకి తెలిసే ఛాన్సుండదు. తీరా అతనే మనల్ని వెదుక్కుంటూ వచ్చిన రోజున మనకా ఇంట్రెస్టు చచ్చి వుంటుంది! చాలామందికి అసలీ థాట్ ప్రాసెస్ వుండదు. ఎందుకంటే దానివల్ల డబ్బులు రావు, బుర్రవేస్టు! ప్రాపంచిక విషయాలపట్ల జిజ్ఞాస కూడా వుండదు - ఎందుకంటే అన్నీ రొటీన్ కదా!

త్రినాథ్ - మా నాన్న ప్లేసులో నాకు దొరికిన కన్సోలేషన్ ప్రైజు. ఆయన్తో వున్నంతసేపు కనీసం అట్లా అన్పిస్తుంది. కానీ, మా కాలేజి ప్రిన్సిపాల్ అంతకంటే విజ్ఞానగని ఐనా కూడా, త్రినాథ్ కంటే వాత్సల్యాం ప్రదర్శించినా కూడా ఆ ఫీల్ నాక్కలగలేదు!? ఎందుకో ఎనలైజ్ చెయ్యడం కష్టం. ఇప్పుడు ఆ త్రినాథ్ కూడా ఇట్లా జబ్బుపడి మంచానికి పరిమితమవడం నా మనసుకి ఏదో గాయం కల్గించినట్టయింది.

మనం అనుకుంటాం గానీ, మన థాట్ షేరింగ్ అందరితో ఒకేలాగా వుండదు. మధులికతో వున్నప్పుడు నేను వాడే బ్రెయిన్, నిరోషాతో వున్నప్పుడు వాడే బ్రెయిన్‌కి భిన్నంగా వుంటుంది. అట్లాగే త్రినాథ్‌తో మాట్లాడినప్పుడు కలిగిన ఆనందం మా ప్రిన్సిపాల్‌తో కలిసి నవ్వినప్పుడు ఉండదు. దేనికదే విభిన్నం! కొంతమంది కొలీగ్స్‌తో చర్చిస్తున్నప్పుడు అరె వీళ్ళెంత పిచ్చోళ్ళు? పాపం అమాయకులు అని ఫీలవుతాను. వాళ్ళంతా నాకంటే జీవితంలో బాగా సాధించిన వీరులే. ఐనా కూడా వారి ఎఛీవ్‌మెంట్ల పట్ల జాలి కలుగుతుంది నాకు వారి తెలివితేటలకీ, దక్కిందానికీ సహ సంబంధం లేకపోవడం వల్ల.

ఈ పార్క్‌లో వాకింగ్ చేస్తున్నప్పుడల్లా నాకిట్లాంటి ఆలోచనలే ముసురుతుంటాయి. చెమట్లుపట్టిన నా దేహానికి శాంతి చేకూర్చే చల్లని పిల్ల తెమ్మెర కంటికి కనబడకపోయినా అదంటే ఇష్టం. అంటే... మనకేదైనా ఇష్టం కలగటాన్ని దాన్ని ప్రత్యక్షంగా చూడాల్సిన పన్లేదు. అనుభవించగలిగితే చాలు.

కుష్వంత్‌సింగ్ రచనలు చదివి చదివి, ఆయన ఫిలాసఫీని తలకెక్కించుకుని ఓసారి ఢిల్లీకి వెళ్ళినప్పుడు ఆయన్ని చూద్దామని ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాను. తన ఆత్మకథలో వివరించిన ఆయన ఇల్లు పరి

## కొత్తగాలి...

**బ్రహ్మాండమంత**
**ప్రసంగం కంటే**
**ఆవగింజంత**
**ఆచరణ గొప్పది**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్, ఆదిలాబాద్ జిల్లా

సరాలని ఆబగా హృదయంలోకి ముద్రించుకున్నాను. ఎంతో ఆనందం కల్గించే విషయమది! కానీ ఆ 97 ఏళ్ళ వృద్ధుడు కనీసం తనని జస్ట్ ఓ లుక్ వేయడానికి కూడా నన్ను అనుమతించలేదు. నాకు ఆయనకి జస్ట్ ఒక గోడ తలుపే అడ్డం. అసహనంతో ఆయన దర్శనం కలగకుండానే వెనుదిరగాల్సి వచ్చింది. ఐనా కూడా ఆయనపట్ల నా మమకారం ఏమాత్రం చావలేదు. ఆయన కొద్దిరోజుల తర్వాత చనిపోయారు. ఆయన పుస్తకాలు తీసి చదువుతుంటే ఆయన మనెదురుగా వుండి మాట్లాడుతున్నట్టే వుంటుంది... ఆ కనెక్షన్ ఏంటో, అదెట్లా సాధ్యమో అర్థమే కాదు.

★ ★ ★

త్రినాథ్ పరిస్థితిలో ఏ మార్పూ లేదు. షేవింగ్ చేస్కున్న రోజు మొహం పైన నీట్‌గా అన్పిస్తుందే తప్ప మొహం వెనకాతల దైన్యం, ఆరోగ్యక్షీణం స్పష్టంగా గోచరిస్తుంది. రెండడుగులేస్తే ఆయాసం, రెండు మాటలకే నీరసం.. బాత్రూంకెళ్ళాలన్నా 'చారి' అనే పిలుపే కష్టమైంది పాపం.

"వైద్యం బాగానే చేశారు. కాని జబ్బు పెద్దది కాబట్టి - కోలుకోలేకపోతున్నాడు" అన్నాడు చారి.

ఈ పరిస్థితిలో నేను ఆయన్ని పలకరించడం తప్ప ముచ్చటించలేకపోతున్నాను. మోహన్ ఎగ్జామ్స్ ప్రిపరేషన్స్‌లో తలమునకలై వుండి బైటి ప్రపంచంతో సంబంధాలు కట్‌చేసుకుని చదువుకుంటున్నాడు. నేనతనికి పెట్టిన అర్జీ అట్టాగే వుంది ఇంకానూ. అతని వైపు నుండి ఏ కబురూ అందనందున నేను మోహన్ కన్ఫెషన్ల మీద ఆశ వదులుకున్నాను..

విధి బలీయమైందంటారు. కాని విధి విచిత్రమైనదని నేనంటాను. ఒక్కొక్కసారి ఇదంతా ఒక ఆర్డరు ప్రకారంగా జరుగుతున్నట్టే తోస్తుంది. ఇంకోసారి తల తోక లేనే లేదు అన్పిస్తుంది. అనసూయ కన్ఫెషన్లు చెప్పాక నిరోషా తనకింక సంబంధం లేనట్టు ప్రవర్తిస్తోంది. స్వప్న అని పేరు ఎత్తితే చాలు ఇంకా ఏంటి? అన్నట్టు అంతే చిరాగ్గా చూస్తోంది.

విధి విచిత్రం ఏంటంటే.. వెంకటేశ్వర్లుకు రేవతిని పరిచయం (పునఃపరిచయం అంటే కరెక్టేమో) చేసే బాధ్యత స్వప్న నాకప్పగించింది.

రేవతి క్యాన్సర్ గాథ విన్నాక నాక్కూడా నావంతు పాత్ర నిర్వహించ తప్పలేదు.

★ ★ ★

**ది వెంకట్ వర్సెస్ ది వెంకీ:**

ఉన్నట్టుండి వెంకటేశ్వర్లు - నాకు ఫోన్ చేసి హైదరాబాద్ కలెక్టర్ ఆఫీసుకి వెళ్ళి కలెక్టర్‌గారిని కలిసే పని వున్నట్టు చెప్పాడు. డైరెక్టుగా కలెక్టర్‌తోటే పనివున్నందున నేను కొంచెం చదువుకున్న లెక్చరరును కాబట్టి తనకూడా రమ్మని ప్రాధేయపడ్డాడు. వెంకటేశ్వర్లు అండ్ కో రియల్ ఎస్టేట్ కంపెనీ ఒక కొత్త ఆలోచనతో ప్రజల ముందుకు రావాలని ఆలోచిస్తోంది. అదేంటంటే - నగరంలో షాపింగ్‌కొచ్చిన ప్రజానీకానికి కార్ పార్కింగ్ పెద్ద తలనెప్పిగా పరిణమించిన నేపథ్యంలో - రోడ్డు పక్కన లేదా రోడ్డుకు అతి దగ్గర్లో వున్న గవర్నమెంటు ఖాళీ స్థలాలు ఇంకా ప్రైవేటు ఖాళీ స్థలాల్ని - ఒక యేడాది పాటు తాము లీజుకు తీసుకుని కార్ పార్కింగ్ ఏర్పాటు చేయదలిచామని- దీనికి కలెక్టరుగారి ఆదేశాలు అవసరమని - ఆ విషయం ఇంగ్లీషులో చర్చించడానికి వెంకటేశ్వర్లు - నన్ను రమ్మంటున్నాడు.

"భలే ఐడియాలొస్తాయండీ మీకు!" మీ ఫామిలీకి అనబోయి తమాయించుకున్నాను రేవతి ఐడియాల్ని దృష్టిలో పెట్టుకుని.

"ఏదో ఒక వ్యాపారం చెయ్యాలికద సార్!" అన్నాడాయన సిగ్గుపడుతూ. "ఈ సిటీలో మనం గమనిస్తలేం గానీ, శానా జాగలు ఖాళీపడున్నై గట్ల. ఉత్తగనే



ఎండకు ఎండి వానకు తడుసుడు తప్ప - వాటితోని పబ్లిక్కు ఏం ఉపయోగం లేకుండా పాయె. ఇంక శానామంది తమ తమ ఖాళీ ప్లాట్లను అట్లనే పెట్కొని వాటి గురించి ఫికర్ జేస్తలేర్. పబ్లిక్కేమో కారె క్కడ పార్క్ చెయాల్నో తెల్వక పోలీ సోల్లకు ఛాలాన్లు కడ్తున్నరు. అందుకనే - పబ్లిక్కు - ప్రభుత్వానికి మధ్య కమ్యూనికే షన్ గావాలె. గీ లీడర్లు పైసలొచ్చేపనులు తప్ప మిగతావి ముట్కోరాయె"

"మీకీ ఐడియాకి ప్రేరణ ఏంటి? "

"మొన్న జనవరిలో ఎగ్జిబిషనాయె గదా. ఎగ్జిబిషన్ గ్రౌండు చుట్టుపక్కలున్న ఆఫీ సులు కాలేజీ స్థలాల్ల పార్కింగ్ పెట్కుం డ్రు. నేనేమంటున్ననంటే - గట్లనే అన్ని చోట్ల ఏడాది పొడుగూతా పర్మిషని య్యాలె. ఏం పోతది ఎవడి సొమ్మైనా. జనాలకి శానా సౌకర్యం.. ఏమంటరు? "

ఐడియా విన్నాక - కలెక్టర్ - ఏ గల్లీ లీడర్లకో ఎమ్మెల్యేల్లాంటోళ్ళకో చెప్తే - వాళ్ళే దొబ్బేస్తరు కదా మీ లీజు ప్లాన్ని? "

"ఒక్క యేడాదే మాకియ్యమంటం. వచ్చే యేడాది నుండి టెండర్లు పిల్వమంటం. గదేందో పైలట్ ప్రాజెక్ట్ అంటారు గదా..



ఎక్స్‌పెరిమెంటులాగన్నమాట" నవ్వాడు.

'వెంకీ - నువ్వు పెంకీ...' అనుకుని నవ్వుకున్నాను. మనోడు కొంచెం హోం వర్కు చేశాడు వీటిమీద!

కలెక్టర్ అపాయింటుమెంటు తీసుకున్నాక నాకు ఫోన్ చేసి ఆ రోజు సెలవు పెట్టుకోమని బతిమాలాడు. నేనూ అదే రోజు ఆయన్ని - రేవతికి కల్పించడానికి ప్లాను వేసుకున్నాను.

★ ★ ★

వెంకీ తన స్కోడా కార్లో నన్ను కూర్చోబెట్టుకున్నాక తృప్తిగా మొహం పెట్టి నవ్వాడు. "నాకిప్పుడు ధైర్యమొచ్చింది అశోక్ సార్!" అన్నాడు.

కలెక్టర్‌గారు మమ్మల్ని లోనికి రమ్మని పిలిచారు.

"చెప్పండి... నేను మీకు ఏ విధంగా సాయపడగలను? " అన్నారాయన. అరె, స్పష్టమైన తెలుగులో మాట్లాడుతున్నాడే ఈ నార్తిండియా కలెక్టరు? అన్నట్టు వెంకీ నావైపు చూశాడు. నేను ఉపోద్ఘాతం లేకుండా సరాసరి విషయం చెప్పాను. "సర్, నా పేరు అశోక్ రాణా. బేగంపేట్ డిగ్రీ కాలేజీలో లెక్చరర్‌ని, వెంకటేశ్వర్లుగారికి ఫ్రెండ్‌ని. అతను రమ్మంటే తోడొచ్చాను. ఆయన ప్రపోజల్ ఏంటంటే - ఇప్పుడు, మన గ్రేటర్ హైదరాబాద్ పరిధిలో వున్న ఖాళీ స్థలాల్ని ప్రజల సౌక

ర్యార్థం వినియోగించడం మీద - కొంచెం గ్రౌండ్ వర్క్ చేశాడు. సర్! ఆయన చేసిన ప్రైవేట్ సర్వే ప్రకారంగా - మన సిటీలో బాగా రద్దీగా వుండే ఏరియాల్లో - బిజీగా వుండే సమయాల్లో - ఖాళీ స్థలాలున్న స్కూళ్ళు, కాలేజీలు, గవర్నమెంటు ఆఫీసు కాంప్లెక్సులు వాటి గేట్లు తాళాలు వేసుకోవడం వల్ల - పబ్లిక్, బైక్స్ గాని కార్స్ గానీ పార్క్ చేసుకోవడం చాలా ఇబ్బందిగా తయారైంది సార్. కష్టపడి ఎక్కడన్నా పార్కింగ్ చేసుకున్నా, పోలీసులు ఫొటోలు తీసి చలాన్లు వేస్తున్నారు. షాపింగ్ కాంప్లెక్సులు గానీ, ఆఫీసులు గానీ - పెరుగుతున్న జనాభాకనుగుణంగా అందరికీ పార్కింగ్ సౌకర్యాన్ని కల్గించలేక

**కొత్తగాలి...**

**ఉంటున్నది**
**పట్నం వాసం**
**తింటున్నది**
**పల్లెల గ్రాసం!**

*- టి. హేమలత,*
మచిలీపట్నం, కృష్ణా జిల్లా

పోతున్నాయి. మామూలు పబ్లిక్‌కి - బండి తీసుకుని ఫలానా ప్లేస్‌కెళ్ళాలంటే పార్కింగ్ ఫోబియా డెవలప్పైంది సార్. పోలీసు చలాన్ల భయం ఎట్లాగూ వుండె! దీన్ని ఆసరాగా చేసుకుని కార్పొరేటు వాణిజ్య సంస్థలు కాంప్లెక్సులు నిర్మించి - అడ్డగోలుగా పార్కింగు ఫీజులు వసూలు చేస్తున్నై. పరోక్షంగా తమ షోరూంలలోనే జనాలు కొనుగోలు చేసేలాగా పరిస్థితులు కల్పించి- వినియోగదారుల్ని దోచుకుంటున్నాయి. మీకో ఉదాహరణ కూడా చెప్పగలను సార్. ఫరెగ్జాంపుల్ - నేను మా ఫామిలీని తీసుకుని 'కోఠి'లో బట్టలు, చెప్పులు చవగ్గా కొందామని వచ్చాననుకోండి. అక్కడ పార్కింగ్ ఎక్కడుంది సార్? నా కార్ లేదా బైకు ఎక్కడ ఏ షాపు ముందైనా పెట్టే పరిస్థితివుందా అసలు? పోనీ - ఏ సందులోనైనా దూర్చేసి వెళ్ళివచ్చేసరికే చక్రాలకు పోలీసు తాళం రెడీగా వుంటుంది. లేదా నా వాహనం చుట్టూ కదిలే వీల్లేకుండా అటూ ఇటూ వేరే బండ్లు పార్క్ చేసి వుంటాయి. ఆలోచించండి సార్ - ఎంత ఇబ్బంది? అదే - కోఠిలో బోల్డంత జాగా వృథాగా - వుమెన్స్ కాలేజీ, మెడికల్ కాలేజీల్లో వుంది. కానీ - అందులో పార్కింగ్ అనుమతించరు. వెంకటేశ్వర్లుగారు చెప్పేది కూడా - సరిగ్గా - ఇట్లాంటి 'డెడ్' స్పేస్‌ని ప్రభుత్వం గుర్తించి ప్రజాసామాన్యానికి అందుబాటులోకి తేవాలని. దానివల్ల ప్రజలకి ఎంతో సౌకర్యం, ప్రభుత్వం మీద నమ్మకం పెరుగుతాయని ఉద్దేశ్యం. సార్ చాలామందికి పార్కింగ్ కాంట్రాక్టువల్ల ఉపాధి కూడా దొరుకుతుంది. ప్రభుత్వానికి పేరుకు పేరు, లాభానికి లాభం. కనీసం సాయంత్రం వేళల్లోనైనా ప్రజలకి హాయిగా కారు పార్కింగ్ చేసుకునే పరిస్థితి కల్పించారంటే - వాణిజ్యం కూడా పెరుగుతుంది కదా సార్!"

ఆయన సాలోచనగా విని- "నాకు తెలిసి హైదరాబాద్ సిటీ పరిధిలో అన్ని చోట్ల - మీరన్నట్లుగా పార్కింగ్ చేసుకునేంత పెద్ద జాగాలేవీ ఖాళీగా లేవు" అన్నారు - వెంకీ వైపు, నావైపు మార్చి మార్చి చూస్తూ.

వెంకీ అందుకుని "మీరు కరెక్ట్ సార్! జాగాలున్నయి, ఐతే అవీటిని ఖాళీగా వుంచుతలేర్. బట్టల ఎగ్జిబిషన్లు, చైనా బజార్లు, గుడిశెలు వేయించి పెడ్తున్నారు. సి.ఎంని మీరైతే కరెక్ట్‌గా చెప్పి వప్పిస్తరు సార్" అన్నాడు.

"గుడిశెలు ఖాళీ చేయించడం అనేది వేరే టాపిక్. అది ఈజీ పనికాదు. ఐతే

మీరన్నట్లు - ఐడియా బాగుంది. మన నుమాయిష్ (ఎగ్జిబిషన్) అప్పుడు జనవరి అంతా ఇట్లాగే చేస్తున్నం కదా. దాన్నే ఏడాది పొడుగూతా సిటీ అంతా చెయ్యాలని చెప్తున్నారు. అంతేగా!"

"కరెక్ట్ సార్. నాకీ ఐడియా వచ్చిందే గట్ల!" కలెక్టర్ తెలివికి ఆశ్చర్యపోతూ అన్నాడు వెంకీ.

"నాకూ నచ్చిందీ ఐడియా. కానీ - ప్రైవేటు స్థలాలే ఎక్కువగా దొరుకుతాయి. మనం ఫోర్స్ చేసి అడిగితే - వాళ్ళు కోర్టు కెక్కుతారు. అశోక్‌గారు ఉదహరించినట్లుగా కేవలం గవర్నమెంటు ప్రాపర్టీలు, కాలేజీలు మాత్రమే అయితే అవి చాలా తక్కువ అని నా అభిప్రాయం!"

"ప్రైవేటు వ్యక్తుల్ని మేం చేతనైనకాడికి ఒప్పించుకుంటం. ఐనకాడికి ఆయె. జనాలకి అది కూడా సౌకర్యమే కదా. ఒక్కసారి మొదలుపెడితే అదే రాను రాను పెద్దగైతది. మీ హయాంలో జరిగిందని మీక్కూడా పేరుంటది. ప్లీజ్ సార్!"

నాకంటే వెంకీనే నిర్భయంగా మాట్లాడాడు. జస్ట్ ఆయనకి స్టాండ్ బైగా ఉండటం కోసం నన్ను తీస్కెళ్ళాడంతే!

కలెక్టర్ నవ్వి - "మీరైతే ముందు ఒక ప్రపోజల్ పెట్టండి. నేను మున్సిపల్ కార్పొరేషన్ నుండి పార్కింగ్‌కనువైన స్థలాల వివరాలు తెప్పిస్తాను. మనం నెల తర్వాత మళ్ళీ కలుద్దాం. ఏదేమైనా - ఇందులో బిజినెస్ కన్నా ప్రజాసేవే ఎక్కువ కనబడుతోంది నాకు. కీపిటప్!" అని వెంకీని అభినందించాడు.

మేం లేచి కలెక్టర్‌గారికి నమస్తే పెట్టి బైటికొచ్చేశాం. వెంకీ మొహం వెలిగిపోతా వుంది.

"థాంక్స్ అశోక్ సార్!"

"అంతా మీరే మాట్లాడి, కలెక్టర్ని ఒప్పించి, నాకు థాంక్స్ చెబుతారేమిటి?" అన్నాను నవ్వుతూ..

"మీరుంటే మాబోటి వాళ్ళకి ధైర్యం!"

వెంకీ తన స్కోడాలో డ్రైవింగ్ సీట్లో రిలాక్స్‌డ్‌గా కూర్చున్నాడు. అతని ముఖంలో ఏదో సాధించాననే చిరుగర్వం తొణికిసలాడింది. అది గమనించి నేను మెల్లిగా నవ్వాను.

"నేను రియలెస్టేట్‌లో ఎన్ని డబ్బులు సంపాదించినా కలగని మజా ఇవ్వాళ కల్గుతుంది అశోక్ సార్!" అన్నాడు.

"ఎందుకని? ఏంటి స్పెషల్ - ఈ డీల్‌లో?"

"ఉంది. మజా వుంది. ఒకటి - మీ సదువుకున్నోల్లను ఒప్పించుడు- అందునా కలెక్టర్ను కన్విన్సు జేసుడు నాకు చేతనైంది అన్నది - మరోటి - ఇది పూర్తిగా బిజినెస్ కాదు సార్. మీకు సమజ్ ఐందో లేదో నాకెర్కలే గానీ- కార్ పార్కింగు మస్తు ఇబ్బందైతుంది పబ్లిక్కు. ప్రజాసేవ కూడా అని అనుకుంటున్న" వివరించాడాయన.

కారు రవీంద్రభారతి సిగ్నల్ నుండి ఆకాశవాణి బిల్డింగ్ వైపు మలుపు తీసుకుంటుండగా - ముందున్న ఇన్నోవా వాహనం సడెన్‌గా ఆపడం వల్ల మా కారు దాన్ని గుద్దింది. మా కర్మకాలి - అది పోలీస్ వాహనం! ఇలాంటివి అలవాటు లేనందున నా గుండె రెండొందలు కొట్టుకుంటూ కాళ్ళు వణకడం మొదలైనై. వెంకీ పరిస్థితి కొంచెం బెటర్. మనిషి నిబ్బరంగానే వున్నాడు. ఇన్నోవాలోంచి ఒక పోలీసాయన, డ్రైవర్ సీట్లో వున్న కానిస్టేబుల్ దిగి వెంకీ వైపు దూసుకొచ్చారు. నా గుండె ఆగినంత పనయ్యింది.

వెంకీ కారు దిగి వాళ్ళతో మర్యాదగా చెప్పాడు, "సార్ - క్షమించుండ్రి, మీరే సడెన్ బ్రేక్ ఏశిండ్రు"

"ఐతే? గుద్దాలని రూలుందా? ఏం?" గద్దించాడా పెద్ద పోలీసాయన. "కారన్నాక తగలకుండా వుంటదా సాబ్? సారీ చెప్తున్నం గద, వదిలేయుండ్రి!" వెంకీ

తగ్గాడు. దాంతో కానిస్టేబుల్ కూడా రెచ్చిపోయాడు. "నడూవ్, స్టేషన్‌కి! తీయ్ నీ లైసెన్స్, పొల్యూషన్, ఐడి కార్డు, ఇన్సూరెన్సు..." ఇంకా ఏదో బూతు మాట అనబోతూ ఆపాడు.

వేరేవాడి కారు గుద్దితే పోలీసులొచ్చి రాజీ కుదురుస్తారు, కానీ సరాసరి పోలీసోడి కారే గుద్దితే రాజీ ఎవరు చేస్తారు? నేనింక ఏదయితే అదయ్యిందని కారు దిగి వాళ్ళ మధ్యలోకెళ్ళి నుంచున్నాను. వెంకీ తన సెల్ ఫోన్ తీసి ఏదో నెంబర్ డయల్ చేయబోతుండగా వాళ్ళు ఫోన్ లాక్కున్నారు.

"పద, సార్ పిలుస్తుండు..." అంటూ వెంకీ భుజం మీద చెయ్యేసి ఇన్నోవా వెనుక డోర్ దగ్గరికి పట్టుకెళ్లారు ఆ ఇద్దరూ. నేనూ ఫాలో అయ్యాను.

"ఏం? కండ్లు దొబ్బినయ్యా? పోలీస్ వెహికిల్‌నే గుద్దుతవా?" అన్నాడా ఆఫీసర్. అప్పటికే అక్కడ జనాలు గుమిగూడారు. వెంకీ చాలా ఇబ్బందిగా అసహనంగా కదిలాడు. మా కారు నెంబర్ ప్లేటు విరిగి, బంపర్‌కి గీతలు, చిన్న సొట్ట పడింది తప్ప ఇన్నోవాకైన డామేజీ అంటూ ఏవీ లేదు. జస్ట్ పోలీస్ ఇగో! ఇప్పుడు వెంకీకి సపోర్ట్‌గా నేనేమైనా మాట్లాడి తీరాలి. నిజానికి నా అవసరం ఆ కలెక్టర్ దగ్గరున్నప్పుడు కంటే ఇప్పుడే ఎక్కువ - అని నేను ఫీలయ్యి - ధైర్యం కూడగట్టుకుని - "మా తప్పేం లేదు సార్ - మీరే సడన్ బ్రేకేశారు- గుద్దకుండా ఆపుకోవడాన్కి సరైన సమయం లేదు - ఐనా మా కార్‌కే కదా డామేజైంది - మీ వెహికిల్ బాగానే వుంది - కదా..." అనాలనుకుని గొంతు పెగిల్చి నోరిప్పబోతుండగా - ఆ ఆఫీసర్ డోర్ తీసి దిగి సరాసరి ముందుకొచ్చాడు.

"సార్ - గుడ్ ఆఫ్టర్ నూన్!" శాల్యూట్ చేస్తూ అన్నాడు. నేను తడబడి - అవాక్కయ్యాను.

"నేను సార్ - జాకబ్ ఫణికుమార్ - మీ స్టూడెంట్‌ని, గుర్తు పట్టిండ్రా?" మళ్ళీ అడిగాడా ఆఫీసర్.

నేను తేరుకుని తమాయించుకుని- "అర్రె - జాఫర్.. నువ్వా" అనగలిగాను. మీసాలు గడ్డాలు తీసేయడం వల్ల ఠక్కున గుర్తించలేకపోయాను.

"సార్ - జాఫర్‌నే. ఎలా వున్నార్ సార్? కార్ - మీదేనా?" అడిగాడు జాఫర్. అతని పేర్లోంచి అక్షరాలు కోసి అతనికి జాఫర్‌గా నామకరణం చేసింది నేనే. చాలా పేద విద్యార్థి. నా ప్రోత్సాహంతోనే గ్రూప్స్ రాసి డియస్పీ అయ్యాడు. నేనతనికి షూస్ కూడా ఇచ్చి వున్నాను. నా కళ్ళు అప్రయత్నంగా కాళ్ళ వైపు చూసినై -

"వున్నాయ్ సర్ - ఆ షూస్ - నేను గోల్ఫ్ కోర్స్‌కెళ్ళినప్పుడు వాడుతుంటాను..." అంటూ జాఫర్ - వెంకీ వైపు తిరిగి - 'సారీ' అని చెప్పి షేక్ హాండిచ్చాడు.

వెంకీ నావైపు ఆరాధనగా చూసి తన ఫోన్‌ని కానిస్టేబుల్ చేతిలోంచి లాక్కుని, కార్లోకి వెళ్ళి కూర్చుండిపోయాడు.

జాఫర్ నాకేసి తిరిగి - "సర్ - ఈ మధ్యే నాకిక్కడ పోస్టింగిచ్చారు. ప్రస్తుతం పంజాగుట్ట ఏరియా ఏసీపిని. అసెంబ్లీ స్పెషల్ డ్యూటీ చేస్తున్నా. ఇప్పుడు కొంచెం బిజీ. ఇదిగోండి నా నెంబరు.. సార్ - మీకు త్వరలో కాలేజీలో కలుస్తాను. బై సార్!" అని గడ గడా వప్పజెప్పేసి - అప్రయత్నంగా వంగి నా మోకాలు టచ్ చేసి నవ్వి ఇన్నోవా ఎక్కి వెళ్ళిపోయాడు.

"బై జాఫర్ - ఆల్ ది బెస్ట్!" అనేసి - తిరిగి కారెక్కి కూర్చున్నాను.

వెంకీ నావైపు ఆరాధనగా చూస్తూ - పొగడ్తల వర్షం కురిపిస్తుంటే నాకు సిగ్గేసింది.

అక్షరం

పేదలకై
పరితపించే హృదయం
ఉన్నవాడే మహాత్ముడు
అది లోపిస్తే వాడు దురాత్ముడే!

– స్వామి వివేకానంద



"మీరింత గ్రేట్ పర్సన్ అనుకోలే సార్, మస్తు ఇన్‌ఫ్లూయెన్సుంది - మీకీ సిటీల..."

"ఛ పూర్కోండి... ఎవడో ఒక్క ఏసీపి తెలిసినోడయినంత మాత్రాన - అదో ఇదా? నాకు తెలిసి వాడి వల్ల మనకు, మనవల్ల వాడికి ఏమాత్రం ఉపయోగం లేదు. ఇంకొద్ది సంవత్సరాల్లో - వాడికి నా పేరు కూడా గుర్తుండదు. ష్యూర్" అన్నాన్నేను - ఆ టాపిక్ అంతటితో ముగిస్తూ.

"అది కూడా నిజమే. దందాలు చేసేటోళ్ళకే పోలీసోడితో పని.. మనస్వంటోళ్లకేం పని సార్, నిజమే మీరు చెప్పేది"

వెంకీ కూడా ఒప్పుకున్నాడు.

కారు మలక్‌పేట టీవి టవర్ దగ్గరికి రాగానే "వెంకటేశ్వర్లు సార్, మనం ఇప్పుడు వెంకటేశ్వరస్వామి గుడికెళ్లి అర్చన చేయిద్దాం. మీ ఐడియా సఫలీకృతం అవుతుంది" అని చెప్పాను.

"అవునవును చేపిద్దాం" ఒప్పుకున్నాడు.

"పదండి - తిరుమల హిల్స్‌లో గుడి ఉంది కదా, వెళ్దాం" పురమాయించాను.

"ఓ యస్. ఇప్పుడే వెళ్తేనే కరెక్ట్. పాండి పాండి!"

కారు వెంకటేశ్వరస్వామి గుడిముందు ఆగింది. అక్కడ పూజారితో సహా ఇంకో ఇద్దరు - వెంకటేశ్వర్లును గుర్తుపట్టి కాసేపు మజాక్ చేస్కున్నారు. వాళ్లకి నన్ను పరిచయం చేశాడు. అర్చన బీభత్సంగా చేశాడు పూజారి... వెంకీ వెయ్యి నోటు కోసం!

గుడిమెట్లు దిగుతుంటే వెంకీతో "సార్ - మీకో విషయం తెల్సా? మన స్వప్నకి జాబ్ ఆఫర్ చేసిన సాఫ్ట్‌వేర్ మల్టినేషనల్ కంపెనీ ఇదే!" అని పక్కనే ఉన్న అపార్ట్‌మెంట్ వైపు చూపించాను.

ఔనా అన్నట్టు చూశాడు వెంకీ.

"చూస్తారా? స్వప్న ఎట్లాంటి కంపెనీలో పనిచేయబోతోందో? ఒక తండ్రికి తన పిల్లలు పనిచేసే ప్లేస్ చూస్తే కలిగే ఆనందమే వేరు!" రెచ్చగొట్టాను.

"ఔనౌను. ఓ లుక్కేసి వద్దాం పాండి"

లిఫ్టెక్కి ఇద్దరం ఆ ఆఫీసు చేరుకున్నాం.

చాలా పోష్‌గా ఉందా ఫ్లాట్. ఐదో అంతస్థు మొత్తం చిన్నచిన్న కాబిన్లుగా అంతా అమెరికా వాతావరణం ప్రతిబింబించేలా ఇంటీరియర్ డిజైన్ చేసి ఉంది.

"ఇదేసార్. నేనిదే ఫస్ట్‌టైం చూట్టం. ఈ మధ్యనే స్టార్ట్ చేశారీ కంపెనీని. మీకు ప్రజాసేవ ఐడియా వచ్చినట్టుగా ఈ కంపెనీ ఓనర్ మేడమ్ కూడా ప్రజాసేవ పనే చేస్తోందిట. ఒక్క రూపాయికే ఒక ప్లేట్ మీల్స్ అనే కేంద్ర ప్రభుత్వ పథకాన్ని ఇక్కడ రూపొందిస్తున్నారు. ఈ ప్రాజెక్ట్ ఏడాది పనిచేస్తుందట"

"ఔనా! ఏడాది తర్వాత స్వప్నకి జాబు పీకేస్తరా? ఎట్ల మరి?" అమాయకంగా అడిగాడు వెంకీ.

ఇంకా ఆఫీసు పనివేళ మొదలు కానందున ఇద్దరు అటెండర్లు తప్ప అక్కడ ఎవరూ లేరు.

"అదేం ఉండదు సార్. వీళ్లకి ఒక ప్రాజెక్ట్ అయిపోకముందే ఇంకో రెండు ప్రాజెక్టులొచ్చి పడతాయి. ఎప్పుడూ ఏదో

పని తప్పకుండా ఉంటుంది. ఏ దేశం నుండైనా పని రావచ్చును. ప్రపంచంలో ఎక్కడ్నుంచైనా పనిచేయొచ్చు. అదే సాఫ్ట్ వేర్ ఉద్యోగం మహిమ" వివరించాను.

"ఔను. ఇంట్లకెల్లి గూడ పనిచేస్తరట గదా!"

అబ్బో్వ్, ఈయనకి ఎక్కువే తెల్సు. ఇక వచ్చిన పని చూసుకోవడం ఉత్తమం.

"వోనర్ మేడమ్ ఇక్కడ్నే ఉంటదా? అమెరికానా? "

"ఏమోసార్, అడుగుదామా - అక్కడో ఇద్దరు అటెండర్లు ఉన్నారు కలుస్తారా? "

"ఆc.. ఆc.. ఇంత దూరం వచ్చి కల్వ కుంటపోతే మల్ల స్వప్న కోపం జేస్తది,

**కొత్తగాలి...**

**ఆ అమరావతి**
**ఇంద్రుని రాజధాని**
**ఈ అమరావతి**
**చంద్రుని రాజధాని!**

*– తాజీ ప్రసాద్,*
చెన్నై

కలుద్దాం పా, అడుగుదాం" అంటూ వెంకీ, వాళ్ల దగ్గరికెళ్లి "మీ మేడంని కలవాలి" అని అడిగాడు.

"దీనిపైన పెంట్‌హౌస్‌లో ఉంటది మేడం! కలవొచ్చు. నేను ఫోన్ చేస్తా మేడంకి, మీరు వెళ్లి కలవండి" చెప్పాడాకాయన.

పైఫ్లోర్‌కెళ్లే మెట్లమీద నా గుండె ఢక్‌ఢక్‌మని బైటికే వినబడేలా కొట్టుకుంటోంది. ఇద్దరం ఆ పెంట్‌హౌస్ కాలింగ్ బెల్ నొక్కాం చెరో వైపూ.

"రెండున్నయేంది కాలింగ్ బెల్సు? ఒక్కటే గదా ఉండాలి? "

వెంకీ.. నీ సందేహాలు తర్వాత.. నాకిక్కడ చెమట్లు కారుతున్నాయ్ అనుకుంటూ "రెండూ ఒకేసారి మోగిస్తే బాగా తెల్సినవాళ్లు, కావాల్సిన వాళ్లు అని అర్థం - అదో రకం కోడ్ అన్నమాట" చెప్పాను.

ఒక పనామె తలుపు తీసి మమ్మల్ని సోఫాలో కూర్చోమంది. వెంకీ అమాయకంగా దిక్కులు చూస్తూ మొహంలో గౌరవభావం నింపుకుంటున్నాడు. నాకు ఉత్కంఠగా ఉంది. సినిమాల్లో, టీవీ సీరియల్లో తప్ప ఇట్లాంటి సన్నివేశాలు మన జీవితాల్లో జరగవు. ఇప్పుడు జరగబోతోంది. ఇద్దరి భావావేశాలు ఒక్కసారే ఎలా చూట్టం?

రేవతికి అప్పటికే స్వప్న సంక్షిప్త సందేశం ఇచ్చింది - డాడీ ఈజ్ ఎరైవింగ్ అని. అచ్చమైన తెలుగింటి ఆంటీలాగా తయారై మా ఎదురుగా ప్రత్యక్షమైంది రేవతి.

స్ప్రింగులాగా లేచి నుంచున్నాడు వెంకటేశ్వర్లు. అప్రయత్నంగా చేతులు, 'నమస్తే' చేశాయి - ఇద్దరికీ! నేను కూడా ఆమెకి నమస్కారం చేశాను.

కూర్చోండి అన్నట్టు ఆమె సైగ చేసింది. వెంకీ కూర్చోలేదు. షాక్ నుండి ఆయన ఇంకా తేరుకోలేదు. ఉన్నట్టుండి ఇద్దరూ ఒకేసారి గొల్లున ఏడ్వడం మొదలుపెట్టారు. రేవతికి కౌగిలించుకుని ఏడ్వాలని ఉందేమోనని నేను బైటికి జరిగి వరండాలో నుంచుని ఆ ఇద్దర్నే ఓరకంట గమనిస్తున్నాను.

ఓ ఐదు నిమిషాలకి ఇద్దరూ ఎదురెదురుగా కూర్చుని నన్ను కూడా లోనికి రమ్మన్నట్టు పిలిచారు. నేను వెళ్లలేదు. కానీ వాళ్ల మాటలు నాకు స్పష్టంగా వినబడేంత దగ్గరగానే తచ్చాడుతున్నాను.

ముందు రేవతే మాట్లాడింది.

"ఎలా ఉన్నారండీ? " అతి కష్టంగా గొంతు పెగిల్చి అంది.

తల ఊపాడు వెంకటేశ్వర్లు.

"వెంకట్.. నన్ను క్షమించండి" అంటూ వెంకట్ కాళ్ల మీద పడబోయింది రేవతి, ఆయన మళ్లీ ఠకీమని లేచి దూరంగా జరిగాడు.. వద్దన్నట్లు.

"నేను చాలా చాలా పెద్ద తప్పు చేశాను. దానికి దేవుడు నన్ను బాగానే శిక్షించాడు. నాకిప్పుడు ఫైనల్ స్టేజ్ క్యాన్సర్. ఎప్పుడైనా చచ్చిపోవచ్చు. సరిపోద్దా నాకీ శిక్ష? లేదు! ఇంకోటి - మెంటల్లీ రిటార్డెడ్ కొడుకును కూడా ఇచ్చాడా దేవుడు. ఇప్పుడు సరిపోయింది"

వెంకీ మౌనంగా వింటున్నాడు.

"మీరు నన్ను చూసి చాలా ఆవేశపడి నన్ను దంచుతారని ఎక్స్‌పెక్ట్ చేశా! మీరు అసలు మాట్లాడటమే లేదు. కనీసం నన్ను తిట్టండి. మీ స్టయిల్లో తిట్టండి ప్లీజ్.. నాకు కొంచెం మనశ్శాంతి లభిస్తుంది!" అడిగింది రేవతి కన్నీళ్లు పెట్టుకుంటూ.

"ఏం లాభం!? అంతా ఐపోయింది. పిల్ల పెద్దగైంది. నేను ముసలోడ్ని ఐపోతున్న. ఇప్పుడొచ్చి తిట్టమంటే ఏం తిడ్తం? ఎవ్వరి జీవితాలు వాళ్లవైపోయినంక ఇంకేమంటం? "

"మీరెందుకు మళ్లీ పెళ్లి చేసుకోలేదు? "

ఓరిదేవుడా, ఈ ఆడోళ్లు మారరు.

"...."

ఏం చెప్పలేకపోయాడు వెంకట్.

"స్వప్నకు తల్లి అవసరం లేదనుకున్నారా? వెంకట్ దయచేసి ఈ ప్రశ్నకు జవాబు చెప్పండి. మీరు పెళ్లి చేస్కోకుండా పదేండ్ల నుండీ అట్లాగే పడి ఉంటే నాకు గిల్టీ ఫీలింగ్ ఎంత గుచ్చుకుని వేధిస్తుందో తెలుసా? నేను సుఖంగా ఉన్నప్పుడు మీరెందుకు లేరు? చెప్పండి!? "

"అవును, నిజమే. నీకు గుచ్చుకోవాలని నేను ప్లాన్ చేసి ఏమీ, పెళ్లి చేసుకోకుండా ఉండలేదు. నాకు చేసుకోవాలని లేదంతే! నా బిడ్డకు మనఃశాంతి వద్దా? సవతి తల్లి ఎట్లాంటిదొస్తదో ఎవ్వనికెర్క? నేనే మారిపోతే? నువ్వు మాఇద్దరికీ అన్యాయం జేస్తివి. స్వప్నకు నేనే గదా దిక్కు, నన్ను గూడ అన్యాయం చెయ్యమంటావా? "

రేవతి తలబాదుకుని బాదుకుని ఏడ్చింది. మనిషి మళ్లీ మిలియనీరైనా ఇలాంటి పరిస్థితిలో ఇలాగే ఏడుస్తారా అనిపించింది నాకు.

"వెంకట్! మన కూతురికి నా ఆస్తిని, హోదాని అప్పగించి - నా చివరి క్షణాలు మనశ్శాంతితో గడపాలని నేను ఇండియాకి తిరిగొచ్చాను. స్వప్న నన్ను అర్థం చేసుకుని క్షమించింది. మీరు కూడా నన్ను క్షమించానని ఒక్కమాట చెప్పండి చాలు! నేను మీ ఇంట్లోకి వచ్చి ఉండబోవట్లేదు. మీ లైఫ్‌లోకి ఇంకోసారి రాలేను. నన్ను క్షమించు వెంకట్!" దీనంగా చేతులు జోడించి అర్థించింది రేవతి.

ఇంతలో పనావిడ కాఫీ తెచ్చింది. పనావిడ వెనకాతలే కిట్టూ ఎగురుకుంటూ వచ్చి రేవతి ఒడిలో కూర్చుని వెంకీ వైపు చూసి నవ్వాడు.

"ఎప్పుడో క్షమించిన. ఐతే ఏంది? పోయిందేమన్న తిరిగొస్తదా? ఎందుకీ వ్యర్థమైన క్షమాపణలు? "

వెంకట్ లేచి నుంచుని - నా వైపుగా వచ్చి - "పాండి సార్.. పోదాం నా బిడ్డకి మంచి జాబ్ వచ్చినందుకు శానా ఖుషీగుంది. కన్నతల్లే జాబ్ ఇచ్చిందని స్వప్న కూడా ఒక్కమాట నాకు చెప్పలే. చెప్తె ఈడికి వచ్చేటోన్నే కాదు!" నా చేయి పట్టుకుని మెట్లు దిగాడు.

నన్ను మా ఇంటి దగ్గర డ్రాప్ చేయకుండా సరాసరి తన ఇంటికి తీస్కెళ్లాడు వెంకీ. డోర్ బోల్టులు పెట్టేసి - కప్‌బోర్డ్ లోంచి రెండు గాజు గ్లాసులు తీసి టేబుల్ మీద పెట్టాడు. లోపల్నుంచి స్కాచ్ వీస్కీ బాటిల్ తెచ్చి రెండు గ్లాసుల్లో పోశాడు.

"సార్ - నాకలవాటు లేదు. నేను కం

పెప్సీ కోసం కూల్‌డ్రింక్ తీస్కుంటాను" చెప్పాను నిర్మొహమాటంగా.

"నాకూ పెద్దగా అలవాట్లు లేవు. కానీ కంపెనీ కోసం తాగుతాను. అఫ్‌కోర్స్, తాగేటోల్లు గిట్లనే చెప్తరనుకోకండి. నిజం గానే! ఇవ్వాళ తాగకపోతే ఈ తాగుడే వేస్టు" అంటూ ఫ్రిజ్‌లోంచి కోక్ బాటిల్ తీసి నా ముందుంచాడు.

ఆయన గబగబా రెండు రౌండ్లేశాడు. నేనింకా కూల్‌డ్రింకు సగం కూడా అవజే యలేదు.

వెంకటేశ్వర్లు మెల్లిగా అన్నీ చెప్పడం మొదలుపెట్టాడు. పెద్దల మాటకు కట్టుబడి ఇష్టం లేని పెళ్లి చేసుకున్నప

## కొత్తగాలి...

**కళ్లు మూసుకొని పాలు తాగుతూ**
**లోకం చూడలేదనుకుంటుంది పిల్లి**
**తప్పు మీద తప్పు చేస్తూ**
**తనది ఒప్పే అనుకుంటాడు**
**మనిషి మళ్లీమళ్లీ**

*– పట్టిసపు శేషగిరిరావు, విశాఖపట్నం*

ట్నించీ రేవతి తనను ఎట్లా నిర్లక్ష్యం చేసేదో చెప్పాడు. "ఆమెకు నాతో ఉన్న ప్రాబ్లం ఒకే ఒక్కటి. నేను టెంతులో చదువాపి వ్యవసాయం మీద ఆకర్షితున్నై ఊళ్లో ఉండటాన్కి ఇష్టపడ్తమే. ఏ మరి అందరూ చదువుకుంటే పొలాలెవడు దున్నుతాడు. పంటలెట్లా పండుతాయి? ఏం తింటాం? అనేటోడ్ని. ఆమె పోరు పడలేకనే సిటీకి వచ్చేశాం. మస్తుమస్తు గొడవలు ఐతున్నా పిల్ల కోసం ఓర్చు కున్నా. ఆఖరికి లేచిపోయింది. విడాకు లకు గూడ మస్తు పైసలు ముట్ట జెప్పిన. జడ్జికి నా గురించి ఏం చెప్పిందో ఎర్కేనా సార్!? నేను బాగా తాగొచ్చి మానసి కంగా, శారీరకంగా హింసబెట్టిన్నంట. గా జడ్జిగూడ గట్లనే నమ్మిండు. గంత జెప్పి నంక ఇంక ఎట్ల సంసారం జేస్తం చెప్పుండ్రి? "

నేను జాలిగా చూశాను.

"ఏం జేస్తం? ఎవ్వలి ఖర్మ వాల్లు అను భవిస్తున్రు. ఎంత అమెరికాలకు పోయి అంతకంత సంపాదిస్తివి - ఏమన్న సుఖ పడ్తివా? ఎడ్డి పిల్లగాడు పుట్టె. ఎట్ల సాత్తవ్ వాన్ని? క్యాన్సర్ రోగమొచ్చె. తక్వైతాది? దేవుడు సూస్తనే ఉండు! ఎర్కేనా? "

"సార్. పోనీ పెళ్లి చేస్కోండి - ఇప్పటి కైనా మించింది ఏమీ లేదు. స్వప్నకు పెళ్లి చేయడాన్కి, పెళ్లయ్యాక సపోర్ట్‌కి - మీకు ఆడ దిక్కు అవసరం" సలహా ఇచ్చాను ఆయన కళ్లలోకి నిజాయితీగా చూస్తూ.

అప్పటికే ఆయన కళ్లు ఎరుపెక్కాయి. అవి కోపంతో కన్నా ఒంట్లోని ఆల్కహా ల్ కే ఎరుపెక్కాయని తెలుస్తూనే ఉంది.

"అశోక్‌సార్.. పెండ్లికెదిగిన పిల్లనింట్లో పెట్టుకుని నేను గిట్లపెండ్లి జేస్కుంట అంటే జనం నోట్ల ఉమ్మేస్తది సార్! మీర న్నట్లు - ఆడతోడు అవసరమే. జరూర్, కానీ - అప్పట్లోనే చేస్కోవాల్సి ఉండే"

"ఏం ఫరవాలేదు. అప్పుడైనా ఇప్పుడైనా ఏం కాదు. చేస్కోండి. మీ వెనకాల మేమంతా ఉన్నాం!"

వెంకీ కళ్ల వెంట నీళ్లు కారాయి.

"నాక్కూడా ఉండదా సార్? చెప్పుండ్రి, మగోడన్నంక ఆడ తోడు, అవసరం పడదా. కనీసం పొద్దున లేస్తె మాట్లాడు కోనీకె కావాలి సార్. పదేండ్లనించి - ఘోస ఆ దేవునికెర్క"

ఆయన భుజం మీద చెయ్యి వేసి ఓదా ర్చినట్టుగా తట్టాను. నా అరచెయ్యిని పట్టు కుని విచారంగా చూస్తూ - "మనిషికి మనిషే అసలైన తోడు సార్. ఈ పైసలు, గీసలు ఆస్తులు పొలాలు అన్నీ వేస్టు"

అన్నాడు.

"అందుకే సార్. మీ కోసం మంచి సంబంధం కూడా అనుకున్నాం.." అని నాలిక కర్చుకున్నాను.

వెంకీ ఇంకో రౌండు వేసుకుని మెల్లిగా - "ఏందీ? ఏమో సంబంధం అంటిరి. ఎవరది? " అడిగాడు.

"మీరేమి అననంటే - నా దృష్టిలో మీకు సరిపోయే ఒక ఆవిడ ఉంది. బహుశా - స్వప్నకు కూడా బాగా నచ్చే ఆవిడ!" ఆయన రియాక్షన్ కోసం చూస్తూ చెప్పడం ఆపాను.

"మీరనేది ఎవర్నో నాకు తెల్వదు. కానీ - స్వప్నకు ఎవరన్నా నచ్చింద్రు - స్వప్న ఇంతకాలం ఆనందంగా వుంది తల్లి లేకపోయినా అంటే - అది అనసూయ మేడమ్ చలవే" పాయింటుకొచ్చేశాడు వెంకటేశ్వర్లు.

తక్కువోడు కాదు!

"నేను చెప్పేది కూడా ఆవిడ గురించే. కాకపోతే ఆమెకు మీరంటే ఇష్టమో లేదో నాకైతే తెలియదు"

"ఇష్టం! అంటే నాకైతే ఇష్టం అని నేను చెప్పేశిన్నా ఏందీ? " నవ్వాడాయన.

"మీరే అనసూయ పేరెత్తినారు కాబట్టి - మీకు తప్పకుండా ఆమెపట్ల యిష్టం వుండి వుండాలి. కనీసం స్వప్న గురించైనా!"

"సార్... ఇంక చెప్పక తప్పేదేముంది! మా గురించి మీకైతే అంతా తెలుసునాయె. స్వప్నకు గురువు లెక్క మీరు. నాకిష్టం, ఆమెకు గూడా యిష్టమే..."

నేను అవాక్కయ్యాను. మైగాడ్!

"ఎట్లా? ఐ మీన్ ఆమెకు మీరు యిష్టమే అని ఎట్లా తెలిసింది? ఆమే చెప్పిందా? " కుతూహలంగా అడిగాను.

వెంకీ లేచి నిలబడి బాల్కనీ దగ్గరికెళ్ళి అక్కడున్న కప్‌బోర్డు మీద ఉన్న సిగరెట్ పెట్టె తీసి ఒక సిగరెట్ వెలిగించాడు. రెండు దమ్ములు పీల్చాక ఆర్పేసి డస్ట్‌బిన్‌లో విసిరేశాడు. ఆ బాల్కనీలోంచి ప్రియదర్శిని పార్క్ కనబడుతోంది. దానివైపు చూపిస్తూ చెప్పాడు వెంకీ -

"సార్... మీకు వీలైతే ఎప్పుడన్నా గాడ కన్పడ్తున్న పార్క్‌కెల్లండి - శానా బాగుంటది. ప్రియదర్శిని పార్క్ అని దానిపేరు. ఈసారి మా కాలనీ వాల్లంతా కలిసి శ్రీరామనవమికి కళ్యాణం అక్కడ్నే పెట్టుకుంటున్నం. మీరు గూడ తప్పకుండా రావాలె. అందర్కి భోజనాలు పెడ్తం. రిటన్ గిఫ్టులిస్తం మస్తు ధూంధాంగ జేస్తం. రాములోరి పెండ్లా మాజాకా!"

"కాన్సెప్ట్ బాగుంది 'వనవాసం'లో మళ్ళీ పెళ్ళి"

"అంటే? "

"వనవాసంలో మ్యారేజీ యానివర్సరీ అన్నట్లు"

కాసేపు నిశ్శబ్దం తర్వాత ఆయనే నోరు విప్పి - మనసు తెరిచాడు.

"అశోక్ సార్. మాకు మామూలు పరిచయం వుండె. కానీ - ఒక రోజు మేడమ్ సడెన్‌గ నా యింటికొచ్చి తలుపు కొట్టింది. డోరు తీయంగనే లోపలికొచ్చి నన్ను గట్టిగ పట్టుకుంది - బాగా చెమట్లతోని తడిశి పోయుండె. గట్ల శానా సేపు మేం కౌగిలించుకున్నంక వెంబటే సిగ్గుపడి విషయం చెప్పింది - ఎవడో ఒక పెద్దమనిషి, మోహన్ గురించి అప్పుడప్పుడు ఇంట్లకొస్తుండెనంట... గాయిన - ఆమె చెయ్యి పట్టుకుండంట. మోహన్ లేని టైంల వచ్చి చెయ్యి పట్కునేసరికి ఆయన చెంప పగలగొట్టి భయం భయంగా వురుక్కుంటొచ్చి నన్ను పట్టుకుంది. గప్పుడే నాక్కూడా అర్థమైంది - నేనంటే ఆమెకు జర ఇష్టమున్నట్లు..."

విని నేను షాకయ్యాను. ఆ పెద్దమనిషి త్రినాథ్ అని చప్పున స్ఫురించింది. ఐతే ఆయన అట్లాంటి వెకిలి మనిషి కాడే? ఇట్లా ఎందుకు చేశాడో?

ఇంతలో డోర్ బెల్ మోగింది.

స్వప్న కాలేజి నుండి వచ్చింది. నన్ను విష్ చేసి - వెంకీవైపు తిరిగి "ఏంటిది డాడీ? మళ్ళీ స్మోకింగూ, డ్రింకింగూనా? అశోక్ అంకుల్ మీరు కూడా జాయిన య్యారా? " అంది సీరియస్‌గా.

నేను నవ్వి నిష్క్రమించాను.

★ ★ ★

ఆ రోజు మోహన్ నాకు కాల్‌చేసి కల వాలన్నాడు. ఆ తెల్లారి పార్క్‌లో మేం కలుసుకున్నాం. మోహన్ చాలా విచా రంగా వున్నాడు.

"ఏం మోహన్? ఎగ్జామ్స్ కదా, నేను కూడా అందుకే నిన్ను డిస్టర్బ్ చేయలేదు. ఏంటి సంగతులు? " అనడిగాను 'డి' బెంచ్ మీద కూర్చుని.

"మేం ఇల్లు మారిపోతున్నాం. కూకట్‌ప ల్లిలో మాకు ఇంకో ఇల్లుంది. గేటెడ్ కమ్యూనిటీ. రెండ్రోజుల్లో షిఫ్టవుతాం. మళ్ళీ నాకు మిమ్మల్ని కలిసే ఛాన్సొ స్తుందో లేదోనని! చెప్పండంకుల్. మీకు త్రినాథ్‌గారు ఏం చెప్పారు? నా గురించి ఏం చెప్పాలింకా? "

"ఇప్పుడు నాకేం డౌట్లు లేవు. ఐనా సడె న్‌గా ఈ నిర్ణయం ఏంటి? స్వప్న అప్ సెట్ అవ్వదా? మీ మమ్మీతో తను బాగా క్లోజ్ కదా! నీక్కూడా స్వప్న అంటే డియర్ ఫ్రెండ్!"

"మీరు తెలిసి అడుగుతున్నారా? తెలీక అడుగుతున్నారా? "

"నీకు తెలిసింది చెప్పు మోహన్. నాకేం తెలుసుననే దానికంటే - నీవు చెప్పేదే ఒరి జినల్. నువ్వే చెప్పు"

మోహన్ నిట్టూర్చాడు.

"బహుశా స్వప్న మీకు చెప్పిందో లేదో గాని - మా మమ్మీ స్వప్న ప్రవర్తనపట్ల అలిగింది. ఎప్పట్నుంచైతే రేవతి - అంటే వెంకటంకుల్ వైఫ్‌ను తను కల్సిందో అప్ప ట్నుంచీ స్వప్న మా మమ్మీని ఎక్కువగా కలవడం లేదు. అందుకే - ఇల్లు అర్జెం టుగా మారుతున్నం!"

నేను తల గోక్కున్నాను.

"నువ్వేమనుకోకుంటే - నీకు అర్థం చేసు కునే కెపాసిటీ వుంటే - నేను చెప్పేది విను మోహన్. అందుక్కాదు. స్వప్న గురించి కాదు. రేవతి పునరాగమనం - మీ మమ్మీకి వున్న ఒకే ఒక్క ఆశ మీద నీళ్ళు చల్లింది"

"వాట్? "

"ఔను. ఇన్ని సంవత్సరాల వైధవ్యం తర్వాత - మీ మమ్మీ ఒంటరితనం పట్ల విసిగిపోయింది. తనకూ ఓ తోడు కావాల నుకుంది. ఒక మంచి మనసున్న వ్యక్తిని ఇష్టపడింది. కానీ - ఇప్పుడు తన ఆశ నిరాశగా మిగిలిపోయే పరిస్థితి నెలకొని వుంది. రేవతి ఆంటీ ఎంట్రీతో వెంకటే శ్వర్లు అంకుల్ - మీ మమ్మీ కన్ఫ్యూజన్లో పడిపోయారు. అందుకే ఇక ఇక్కడ ఉండ కూడదని నిశ్చయించుకుంది. ఔనా? "

అంతా విన్నాక మోహన్ బెంచ్ మీంచి లేచి కాసేపు అసహనంగా అటూ ఇటూ తిరిగాడు.

"ఈ... ఈ... రేవతి ఆంటీ ఎవరు అంకుల్ మధ్యలో! తను ఎప్పుడో డైవ ర్సిచ్చి వెళ్ళిపోయింది కదా!? మళ్ళీ రావడం ఏంటి అసలు? కూతురు ఇప్పుడు కావాల్సొచ్చిందా? క్యాన్సర్ రాంగానే తప్పు తెలుసుకుందా? అది రాకపోయుంటే వచ్చేదే కాదుగా! మా జీవితాలతో ఆడుకో వడాన్కి ఇప్పుడు మళ్ళీ వచ్చింది. డామిట్!"

ఆవేశంగా అరుస్తూ అన్నాడు. పక్కనే జాగింగ్ ట్రాక్‌లోంచి ఇద్దరు మావైపే చూశారు. ఏవీ లేదని సైగ చేశాను.

"రిలాక్స్ మోహన్, రిలాక్స్" అంటూ అతన్ని కూర్చోబెట్టాను.

"నేను - స్వప్నని ఇష్టపడ్డాను - తెలుసా అంకుల్? ఆ అమ్మాయి నా ఫస్ట్ లవ్!! తను కూడా నా పట్ల ఇంట్రెస్ట్ చూపిం

చింది. కానీ తనకి ఎప్పుడైతే మా మమ్మీ క్లోజయ్యిందో - మా మమ్మీలో తన అమ్మను ఐడెంటిఫై చేసుకోవడం మొదలు పెట్టింది. మమ్మీ కూడా వెంకటేశ్వర్లంకు ల్‌ని ప్రత్యేకంగా చూడటం నేను గ్రహించాను. ఖైరతాబాద్ సిగ్నల్ దగ్గర మమ్మీని, అంకుల్ కార్లో చూశాను. అప్పట్నుంచి నాకు మనశ్శాంతి కరువై ఒకానొక బలహీన క్షణంలో ఇక్కడే - ఈ బెంచి మీదే కూర్చుని ఆప్యాయంగా పలకరించే త్రినాథ్ తాతతో అన్నీ చెప్పుకున్నా! ఆయన నన్ను శాంతపరిచి - మమ్మీకి నీ ఫస్ట్ లవ్‌ని గిఫ్టుగా ఇవ్వు - అన్నారు. నేను చాలా ఆలోచించాక తాతాజీ చెప్పింది కరెక్ట్ అని తోచింది. నా ముందు బోలెడంత జీవితం వుంది. మమ్మీకి? ! అందుకే - నా ప్రేమ రూపం మార్చి మమ్మీకి కానుకగా ఇచ్చాను. స్వప్నలో కూతుర్ని చూసుకోమని అమ్మను ప్రోత్సహించాను. కానీ... ఇప్పుడిట్లా రేవతాంటీ వచ్చి షాకిస్తుందని కలలో కూడా వూహించలే, ఇప్పుడేం చెయ్యాలంకుల్? అందుకే మమ్మీ తీసుకున్న నిర్ణయాన్ని నేను వెంటనే సమర్థించాను. మా బామ్మకు కూడా అంతా అర్థమవుతోంది. తను కూడా తలూపింది"

విని, వెంటనే నేనూ ఏం మాట్లాడలేక పోయాను. ఎందుకంటే - అందరూ సహజంగానే రియాక్టవుతున్నారు. అందరి బాధా కరెక్టేకదా అన్పించేట్లుంది.

"ఇక్కడుంటే మీ మమ్మీ డిప్రెషన్లోకెళ్ళిపోయే ఛాన్సుంది మోహన్. ఆమెకేది కరెక్టనిపిస్తే నువ్వు అదే చెయ్యి" అనేసి మోహన్ భుజం తట్టి అక్కడ్నుంచి ఇంటికొచ్చేశాను.

ఇంటికొచ్చేసరికి - మధులిక కడుపునెప్పి అంటూ సోఫాలో తలకు మోకాళ్ళు ఆనించి ఏడుస్తోంది. నిరోషా చేతిలో టాబ్లెట్, మంచినీళ్ళున్నాయి. కానీ - టాబ్లెట్ చేదుగా వుంటుందని మింగనని మొరాయిస్తోంది మధు. ఇదంతా నాకు

# ఛతేభలే!



ఆధునిక చిత్రకళకు ఆద్యుడైన పాబ్లో పికాసో కొత్తరూపాలు, శైలీవిన్యాసాల కోసం అన్వేషించేవాడు. ఏదీ నిలకడగా ఉండక మారిపోయేది. తన ప్రియురాళ్లకి ఒకేరకం డ్రస్సులు కుట్టించి, ఒకరివి మరొకరికిచ్చి అవిసరిపోక వారు ఇబ్బందులు పడుతుంటే ఆనందించేవాడట!

రొటీన్ అనుకున్నా మనసేదో కీడు శంకించింది. నేను స్నానం చేసి వచ్చేసరికే మధులిక కనుగుడ్లు తేలేసి మెడ వేలాడేస్తోంది. నిరోషా కిచెన్లో వుంది. నేను గట్టిగా పిలిచాను నిరోషాని.

★ ★ ★

రెయిన్ స్టార్ చిల్డ్రన్ హాస్పిటల్ కాజువాలిటీ.

డాక్టరు వచ్చి మధులికను పరీక్షించి స్కానింగ్ పరీక్షకు సిద్ధం చేయించాడు. ఉపశమనానికి ఇంజెక్షన్ చేశారు. నిరోషా నిబ్బరంగానే వుంది - ఎందుకంటే ఇంతకు ముందు స్కానింగ్‌లో ఏమీ లేదని చెప్పారు గనక.

కాసేపయ్యాక మధుని స్కానింగ్ గదిలోకి తీసికెళ్ళారు. నిరోషా వెంట వెళ్ళింది. నేను ఆ గది బైట కుర్చీ చూసుకుని కూలబడ్డాను. చాలా టెన్షన్‌గా వుంది. ఒక్కతే పాప. చిన్నది. దానికి కడుపునొచ్చినా కాలునొచ్చినా అంతకంటే ఎక్కువగా నా మనసుకి కష్టమవుతుంది.

ఇంతలో స్వప్న ఫోన్‌చేసి మాట్లాడింది.

"ఏంటంకుల్? మీరు కూడా మోహన్ వాళ్ళను ఇల్లు మార్చుకోమని సలహా ఇచ్చారంట? ఇది దారుణం అంకుల్. వద్దని చెప్పాల్సింది పోయి..."

నా టెన్షన్‌లో నేనుంటే - స్వప్న - అన

సూయ మనసు కష్టపెట్టింది కాక - ఆమె ను డిప్రెషన్‌లోకి పంపే ఆలోచన కూడా చేస్తోందా అనిపించి - మండింది నాకు.

"నీకసలు బుద్ధి, జ్ఞానం వున్నాయా? మీ మమ్మీ రాగానే ఇంతకాలం నిన్ను మ మ్మీలాగా చూసుకున్న ఆంటీని నిర్లక్ష్యం చే స్తావా? నీవు మీ అమ్మను చేరదీయబట్టే మీ నాన్న ఏవీ అనలేకపోతున్నాడు.."

"అది కాదంకుల్..." ఇంకేదో చెప్పబో తున్న స్వప్నకు నేను అడ్డు తగిలి "చూడు స్వప్నా, మధు, రెయిన్ స్టార్ హాస్పిటల్లో అడ్మిట్టయింది కడుపునెప్పితో. బహుశా ఆపరేషన్ చేస్తారేమో, ప్రస్తుతం ఆ టెన్షన్లో వున్నాను. ఇక ఫోన్ పెట్టెయ్" అంటూ కాల్ కట్ చేసేశాను.

కాసేపయ్యాక వెంకటేశ్వర్లు ఫోన్ చేసి హాస్పిటల్ ఎక్కడ్నో కనుక్కున్నాడు. నిరోషా స్కానింగ్ రూం నుండి మధుని ఎత్తుకుని బైటకి తీసుకొచ్చింది - ఏవీ చెప్ప ట్లేదు - అంది నిరాశగా. మధు నిద్రపో తున్నట్లు మత్తులో వుంది. ఆ రాత్రంతా ఐసియులో వుంచారు మధుని. తెల్లారి నాక ఎమ్మారై పరీక్షకు తీస్కెళ్ళారు. చిన్న పిల్లల కడుపు ఆపరేషన్ స్పెషలిస్ట్ డాక్టర్ ప్రియాంక నన్ను పిలిచి "మీ పాప మధుకి ఆపరేషన్ అవసరం. కొలిడోఖల్ సిస్ట్ గా ల్ బ్లాడర్‌లో వుండటంవల్ల పాపకి తరచు గా కడుపునెప్పి వస్తోంది. ఇది ఆడవాళ్ళ లో ఎక్కువగా వచ్చే జబ్బు. ప్రతి వెయ్యి మందికి ఒకరు ఈ జబ్బుతో పుట్టే ఛాన్సుంటుంది"

"వేరే మార్గం లేదా? డాక్టర్? ఆపరేష నంటే - చాలా చిన్నపిల్ల కదా!" దాదాపుగా ఏడ్చేశాన్నేను.

ఆమె తన సీట్లోంచి లేచి వచ్చి నన్ను ఓదార్చింది "కేవలం లాప్రోస్కోపీ ద్వారా దీన్ని తొలగిస్తాం. తొలగించకపోతే కడు పునెప్పి ఇట్లాగే వస్తూ వుంటుంది. రాన్రాను క్యాన్సర్‌గా మారే ఛాన్సు వుంది. కాబట్టి ధైర్యం తెచ్చుకోండి. డబ్బు కట్టేసి రిలాక్సవండి. అంతా మేం చూసు కుంటాం. ఒక్కవారం ఓపిక పడితే అన్నీ సర్దుకుంటాయి"

నేను బైటికొచ్చి క్యాష్ కౌంటర్ దగ్గర నుంచుని నిరోషా ఎక్కడుందో వెదికాను. బహుశ ఐసియు లోపలికెళ్ళుంటుందని అనుకుని - అక్కడ క్లర్కును ఆపరేషన్‌కి ఎంత కట్టాలో అడిగాను. అతను కంప్యూ టర్లో వెదికి - మధులికకి హాస్పిటల్ డొనే షన్ ఫండ్స్‌లో నుంచి ఖర్చు జమ అవు తున్నట్టుగా చెప్పి - నేనేం కట్టనవసరం లేదని చెప్పి నవ్వాడు. నాకర్థంకాక అక్క డ్నుంచి వచ్చేసి - ఐసియూకెళ్ళాను. అద్దాల కిటికీలోంచి మధు నిరోషాలను చూసి ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నానో లేదో - కళ్ళు తిరిగి కింద పడిపోయాను.

కాసేపయాక అదే హాస్పిటల్లో కాజువా ల్టీలో బెడ్‌మీద కళ్ళు తెరిచి చూశాను. ఇటు పక్కన నిరోషా ఆందోళనగా ఆశ్చ ర్యంగా చూస్తోంది నన్ను. అటు పక్కన నర్సు నా బిపి చెక్ చేస్తోంది. నా ఎదు రుగా రేవతి!

"మేడమ్, మీరా?" అన్నాను ఆశ్చ ర్యంగా.

"యా. నేనే!" అంటూ నా పక్కన కుర్చీలో కూర్చుంది.

"మీకు టెన్షన్ ఎక్కువై స్పృహ తప్పారు. బి.పి. షుగర్ నార్మల్, మరేం లేదు. జస్ట్ కూల్!" చెప్పింది రేవతి.

నర్సువంక చూస్తే, ఔనన్నట్లు నర్సు తలూపింది.

"అశోక్‌గారూ- మా అమ్మాయిని తిట్టా రంట! నా వల్లే అన్ని ప్రాబ్లెమ్స్ వచ్చిపడ్డా యని అరిచారట! (నవ్వి) ఇట్స్ ఓకే. మీరు ఒక్కసారి నా ప్లేస్‌లో ఉండి ఆలో చించండి. ఇప్పుడు మీ కూతురికి వచ్చింది జస్ట్ ఎ సింపుల్ సిస్ట్. దానికే కళ్ళు తిరిగి పడిపోయారు. నేను ఫైనల్ స్టేజి క్యాన్స

ర్‌తో చావడానికి రెడీగా ఉన్న పరిస్థితిలో నా కన్నకూతురు నాతో అనుక్షణం గడపాలనుకోవడం- తప్పా? అయినా నేనేమీ వెంకట్ జీవనస్రవంతిలో కలిసిపోవడానికి రాలేదే? మళ్లీ పెళ్లి చేసుకోమన్లేదే? డామిట్, నాకూ భర్త ఉన్నాడు- అమెరికాలో. ఇంకో చిన్న బుడ్డోడు కూడా. అనసూయ బాధపడితే, దానికి నాకేంటి సంబంధం? అంతిష్టమైతే- ధైర్యముంటే పెళ్లి చేసుకోమను- నేనేం వద్దన్లేదే! నేను అప్పట్లో నా కూతుర్ని వదిలి నా సుఖం వెతుక్కుంటూ వెళ్లిపోయిన మాట నిజమే! డామ్ ట్రూ! కానీ- నా తప్పు తెలుసుకున్నా, ఒప్పుకుంటున్నా, క్షమాపణ అడిగాను. దేవుడు ఆల్రెడీ డెత్ సెంటెన్స్ రాశాడు" చిన్నపాటి లెక్చర్‌లాగా చెప్పింది రేవతి.

అంతా విన్నాక నేను నీళ్లు నమిలి "సారీ మేడమ్" అన్నాను.

నిరోషా నావైపు చూసి నవ్వు ముఖం పెట్టి "రిలాక్సవ్వండి- ప్రాబ్లం చిన్నదే అంట. ఆపరేషన్ కూడా చిన్నదే.." అంటుండగా..

"పాప కూడా చిన్నదే కదమ్మా! అందుకే కంగారు, ఆమాత్రం ఉండాలిలే- కూతురంటే. తండ్రికి కూతుళ్ల మీద కారిపోవాలి మమకారం- అప్పుడే తల్లికి చూడముచ్చటగా ఉంటుంది. అన్నట్టు.. మీరు బిల్లు గట్రా ఏవీ పే చెయ్యనవసరం లేదు. అప్పట్లో మేం ఈ హాస్పిటల్‌కి డొనేషన్లు రాశాం. ఇప్పటి వరకూ ఎవరం వాడుకోలేదు. ఇట్లా ఉపయోగపడింది. గ్రేట్, గాడ్ ఈజ్ గ్రేట్" అంది రేవతి.

నేను మంచం మీంచి లేచి రేవతికి నమస్కారం పెట్టి థాంక్స్ చెప్పాను. బయట కుర్చీలో వెంకటేశ్వర్లు, స్వప్న కూర్చున్నారు. నన్ను చూడంగానే- నా దగ్గరికి వచ్చి నన్ను పట్టుకుని పరామర్శించారిద్దరూ. వాళ్లతో రేవతి కూడా జాయినయ్యింది.

★ ★ ★

ఆపరేషన్‌కి దాదాపు గంట పట్టింది. అందరం అటూ ఇటూ తిరుగుతున్నాం. ఎవరూ మూడ్‌లో లేరు. ఎవరి ఆలోచనల్లో వారున్నారు. మధుని పోస్ట్ ఆపరేషన్ వార్డ్‌లోకి షిఫ్ట్ చేశాక అందరం మానసికంగా రిలాక్సయ్యాం. మధు కళ్లు తెరిచి చూసినప్పుడు ఎదురుగా స్వప్న కనబడ్డంతో నవ్వే ప్రయత్నం చేసింది.

ఇంతలో అనసూయ, మోహన్ వచ్చి మధుని, నన్ను, నిరోషాని పరామర్శించారు. వీళ్లు రాగానే వెంకటేశ్వర్లు, స్వప్న దూరంగా జరిగారు. రేవతి అంతకు ముందే వెళ్లిపోయింది.

★ ★ ★

పైసా ఖర్చు లేకుండా మధుకు కడుపు నొప్పి నయమైపోయింది. రేవతి కనబడ్డాక డా॥ ప్రియాంక మమ్మల్ని మరింత జాగ్రత్తగా చూసింది. డిశ్చార్జప్పుడు ఆమె- మా కారు దాకా వచ్చి మధులికకు బై చెప్పి సెండాఫ్ పలికింది.

ఈ వారం రోజుల్లో స్వప్న- అనసూయ ప్రతిరోజు మధు మంచం దగ్గర కలిశారు. కానీ మునుపటంత ఉల్లాసంగా మాట్లాడుకోలేదు. అనసూయ తన ఫ్లాట్ ఖాళీ చేసి కూకట్‌పల్లికి వెళ్లిపోయే రోజున నేను, నిరోషా కూడా వెళ్లాం- వీడ్కోలు చెప్పడానికి.

స్వప్న అతి విచారంగా మొహం పెట్టి మోహన్‌ని బతిమిలాడింది- వెళ్లిపోకండని.

"డెస్టినీ ఫేవర్ చెయ్యలేదు. అందుకే వెళ్తున్నాం కానీ- మనం టచ్‌లో ఉందాం. ఉండాలి. నన్నూ మా మమ్మీని మర్చిపోకు" అని ముభావంగా చెప్పి మొహం తిప్పేసుకున్నాడు మోహన్. స్వప్న అనసూయ సర్దుకుంటున్న చివరి సూటుకేసును గట్టిగా పట్టుకోగా ఏంటన్నట్లు చూసింది అనసూయ- స్వప్నవైపు.

ఇద్దరూ మార్చి మార్చి చాలా సేపే చూసుకున్నారు.

ఒక్కసారే- ఇద్దరూ కౌగిలించుకుని

దుఃఖించారు. దృశ్యం చూసిన మాకు కన్నీళ్లు రాలాయి. స్వంత తల్లీ స్వంత కూతురు లాగా- పెళ్లిచేసి అత్తారింటికి వెళ్లి పోతున్న కూతుర్ని గట్టిగా హత్తుకున్న తల్లిలా అనసూయ- తనని హాస్టల్లో వది లేసి ఇంటికి వెళ్లిపోయే తల్లిని పట్టుకున్న చిన్న పాపలా స్వప్న- మనసుకు కష్టం కలిగించేలా కళ్లు పిండేశారు. నిరోషా కల్పించుకుని ఆ ఇద్దర్ని విడదీసి అటూ ఇటూ ఇద్దర్నీ ఓదార్చింది.

అప్పటికే పెద్ద ట్రక్‌లో సామాన్లన్నీ నింపేశారు.

బామ్మగారిని రెండు చేతుల్తో ఎత్తుకుని మోహన్- కార్లో కూర్చోబెట్టాడు. అన సూయ ఇంటికి తాళం వేసి ఆ తాళాన్ని నిమిరి- చెప్పులు వేసుకుని ఇంక వెనక్కి తిరిగి చూడకుండా మెట్లు దిగి కిందికి వెళ్లి పోయింది. నేనూ, నిరోషా, స్వప్న మెల్లిగా మెట్లు దిగి 304 తలుపు తీసుండటంతో అటువైపు చూశాం.

వెంకటేశ్వర్లు సోఫాలో ఒరిగి టీవీ చూ స్తున్నాడు. చేతిలో కాలుతున్న సిగరెట్టు! టీ పాయ్ మీద యాష్ ట్రేలో కూడా అప్ప టికే బూడిదైన సిగరెట్లున్నాయి. కళ్లు ఎరు పెక్కినై! ఎవరి వంకా చూడటం ఇష్టం లేనట్లు టీవీలో న్యూస్ వంక చూస్తు న్నాడు. కానీ ఆయన మనసులో మోగే ఫిరంగుల చప్పుళ్లు నాకు వినబడుతున్నై.

స్వప్న బాల్కనీ నుండి చూసింది. సామాన్ల ట్రక్కు, కారు కదిలాయి- భరిం చలేని భారాల్ని మోసుకుంటూ.

★ ★ ★

ఆ తర్వాత రెండ్రోజులకి- త్రినాథ్ ఇంటికి వెళ్లి ఆయన్ని పరామర్శించాను. ఇప్పుడు కొంచెం కొంచెం మాట్లాడగలుగు తున్నాడు.

"అశోక్... వచ్చే వినాయకచవితి దాకా నేను ఉంటానో పైకి పోతానో తెలియదు. నా కోసం నీ శాక్సాఫోను ఒకసారి వాయిస్తే వినాలనుంది" ఇది చెప్పడానికి ఆయనకు మూడు రెట్లు సమయం పట్టింది.

సరేనన్నాను. ఈసారి వచ్చినప్పుడు తప్పకుండా శాక్సా తెచ్చి ప్లే చేస్తానని చెప్పా ను. మధులిక ఆపరేషన్, అనసూయ వాళ్లు ఇల్లు ఖాళీ చేయడం, రేవతి రావడం ఇత్యాది విషయాలన్నీ ఆయన ఊ కొడు తుండగా చెప్పాను. అంతా విన్నాక-

"నువ్వు చెప్పేది ఎవరి గురించి?" అన్నాడు. నా నెత్తిన పిడుగు పడింది! నేను అక్కడ చారి ఉన్నాడేమోనని చుట్టూ చూశాను.

"మీకు మోహన్ తెల్సు కదా. మీరే కదా నాకు వాళ్లందర్నీ పరిచయం చేసింది! ఎవ రంటారేంటీ?" అన్నాను ఆశ్చర్యంగా.

త్రినాథ్ ఆలోచిస్తూ గుర్తుకు తెచ్చుకు న్నాడు "మోహనా? మోహన్.."

కొంపదీసి అల్జీమర్స్ వ్యాధి మొదల య్యిందా ఏమిటి ఖర్మ అనుకుంటుండగా- చారి లోపలికి వచ్చాడు.

"అరేయ్ చారి- మోహన్ వచ్చాడు. ఇదిగో శాక్సాఫోన్ కమ్మగా వాయిస్తాడట... చూడు.. కూర్చో.." అరవబోయాడు త్రినాథ్. చారి రెండు చేతులతో కూల్ డౌన్ అన్నట్లుగా త్రినాథ్‌ని మాట్లాడకు అన్నట్లు సైగ చేశాడు.

"అశోక్, ఈ వారం నుంచే- వీడిట్లా వింతగా మాట్లాడుతున్నాడు. ఒకసారి మా పనావిడని చూసి 'అనసూయ అ యాం సారీ' అంటూ వెంటబడ్డాడు. దాం తో మళ్లీ డాక్టర్‌గారికి చూపిస్తే- సైక్రియా టిస్ట్‌కి రిఫెర్ చేశారు. ఒంటరితనం, గుండె పోటు, ఆపై ఆపరేషన్.. ఇవన్నీ మతిమ రుపు జబ్బుకు దారి తీశాయని చెప్పాడు సైక్రియాటిస్టు, మందులేవో ఇచ్చారు. ఐనా ఏం మెరుగవ్వలే!" వివరించాడు చారి. త్రి నాథ్ ఇంకా కన్ఫ్యూజన్లోనే ఉండిపోయా డు- నా పేరు మోహనా? కాదా అన్నట్లు.

"ఇంతకీ నేనొచ్చిన పని- వచ్చే శనివారం

అంటే మార్చి 28 నాడు మధ్యాహ్నం, శ్రీరామనవమి మొట్ట మొదటిసారి ప్రియదర్శిని పార్క్‌లో చేయ తలపెట్టిన సందర్భంగా మిమ్మల్నిద్దర్నీ ఆహ్వానిస్తూ- వెంకటేశ్వర్లు గారు ఈ ఆహ్వాన పత్రిక మీకు అందజేయమన్నారు" అంటూ పత్రిక త్రినాథ్ చేతిలో పెట్టా.

త్రినాథ్ పత్రికను చదివి- "ఏంటి బాబూ? శ్రీరామునికి మళ్లీ పెళ్లా? ప్రతి ఏడాది చేసుకుంటాడు కదూ! అసలు- అందరూ ప్రతి ఏడాదీ ఇట్లా పెండ్లి చేసుకుంటే ఎప్పుడూ కొత్త జంటల్లాగా ఉండిపోవచ్చు. ఏమంటావ్ బాబూ! అరేయ్ చారీ, నువ్వేమంటావ్? "

"అంటే పెళ్లాన్నే మళ్లీ మళ్లీ చేసుకోవాలా లేక ప్రతి యేడాదీ వేరే వేరే చేసుకోవాలనా నీ ఉద్దేశ్యం? " చారి నవ్వాపుకుంటూ అడిగాడు.

"అరేయ్ వెధవా! నా ఉద్దేశం మొగుడూ పెళ్లాలే మళ్లీ పట్టుబట్టలు కట్టుకుని గోరింటాకు పెట్టుకుని బాసింగాలు కట్టుకుని- ఎంత బాగుంటుందిరా ఆ ఫీలింగు.." త్రినాథ్ చెప్పాడు.

"మరి నువ్వెందుకు చేసుకోలేదురా? పోనీ ఈసారి ప్రియదర్శిని పార్కులో రాముని పెళ్లంట. వచ్చి నువ్వు కూడా చేసుకుంటావా? "

"ఛ ఛ.. నాకు పెళ్లేంట్రా? " అంటూ నవ్వాడు త్రినాథ్.

నవ్వి.. "నాకా యోగ్యత లేదు.. లేదు" అంటూ ఉన్నట్టుండి ఏడ్పు లంకించుకున్నాడు. చిన్న పిల్లాడికి మల్లే..

అది!

ఇన్ని రకాల డిప్రెషన్లకి మూలకారణం అది. తిండి, నిద్రలాగే మనిషికి శృంగార సుఖం- సెక్స్ యోగ్యత ఎంతో ఆవశ్యకం!! సెక్స్ అనేది కేవలం పైకి కనిపించే ఒక 'చర్య' కాదు. అదొక ప్రాసెస్. మనిషి మనిషితో జతకూడటం- మాట్లాడుకోవడం- గిల్లుకొని గిచ్చుకుని- ముద్దులాడి సరసాలాడి- మనసు మనసుతో పెనవేసుకుని- అప్పుడు- అందరికీ కన్పించే సెక్స్ యాక్ట్! ఇవన్నీ జీవితంలో అనుభవించని వ్యక్తి- మానసిక రుగ్మతలకు బలవ్వడం తప్పదేమో! తద్వారా శరీరం కృంగిపోతుంది. నేలమట్టమై మట్టిలో కలిసిపోతుంది!!

★ ★ ★

నేను, నిరోషా కలిసి రేవతి ఇంటికెళ్లి ఆహ్వాన పత్రిక ఇచ్చాం. ఆమె మాకు మర్యాదలు చేసింది, చుట్టాలకు మల్లే.

"మధ్యాహ్నం పన్నెండింటికి మేడమ్, మీరు తప్పకుండా ఓ గంట ముందే రావాలి. నేను స్వప్న కలిసి శాక్సాఫోన్ షో ప్రాక్టీస్ చేస్తున్నాం. సీతారాముల కళ్యాణం మీద వచ్చిన సినిమా పాటల్ని పాడబోతున్నాం" చెప్పాను కాఫీ చప్పరిస్తూ.

"నేను తప్పకుండా వస్తాను కానీ, అనసూయ వస్తోందా? ఆమెకు ఆహ్వానం ఇచ్చారా? ఎవరెళ్లారు? " అడిగింది రేవతి తన లాప్‌టాప్ మూసేస్తూ. "మేడమ్, నేను, స్వప్న వెళ్దామని ప్లాన్ చేశాం రేపు!" చెప్పింది నిరోషా ఉత్సాహం నిండిన గొంతుకతో.

అనసూయని నిరోషా మిస్సవుతోందని రేవతి గ్రహించింది.

"స్వప్నకి కూడా తనంటే బాగా ఇష్టం. చాలా మిస్సవుతుంది తనని"

"అవును మేడం! మీరేమనుకోనంటే మీకు ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి" అంది నిరోషా. చెప్పమన్నట్టు చూసింది రేవతి- మా ఇద్దరి వంకా.

"మీకెట్లా చెపాల్నో మాకైతే అర్థం కావట్లేదు రేవతిగారూ! అసలు మాకు సంబంధం లేని విషయం ఇది. కానీ విధి వశాత్తూ మేమూ ఇందులో ఇరుక్కుపోయాం. కానీ- ఇప్పుడు మేం కల్పించుకోకపోతే- ఈ కథ కనుమరుగై నల్గురికి

# సెల్ఫీ తుపాకులు!




తుపాకీలు అధికంగా గల అమెరికాలో అవి పొరపాటున పేలడం సగటున రోజుకి ఏడెనిమిదిసార్లు జరుగుతోంది. ఎక్కువమందికి ఈ గుళ్లు కాలికే తగలడం ఆశ్చర్యం!

✤ కెంటకీ రాష్ట్రంలోని ఎర్లాంజర్‌లో డేరిల్(25) అనే పోలీస్ ఆఫీసర్ లిఫ్ట్‌లో వెళ్తూ, సూపర్ బజార్‌లో కొన్న సంచీలు చేతిలో ఉండగా, హోల్‌స్టర్‌లోంచి తన రివాల్వర్‌ని తీసి చూస్తుండగా, పేలి కడుపులోకి గుండు దిగింది. పక్కనేఉన్న అతని భార్య సహాయంతో బయటికి వచ్చాడు.



✤ ఫ్లోరిడాకి చెందిన డేల్(35) కారు డ్రైవ్ చేస్తుండగా, అతని కుక్క సీటు మీది నైన్ యం.యం రివాల్వర్‌ని కాలితో అటు ఇటు తన్నింది. దాంతో అది పేలి అతని కాల్లో గుండు గుచ్చుకుంది.

✤ 2014లో కన్నర్స్‌వీల్(ఇండియానా)కు చెందిన పోలీసు ఆఫీసర్ డేవిడ్ (55) తన హోల్‌స్టర్‌లో పాయింట్ ఫోర్ జీరో కేలిబర్ రివాల్వర్‌ని పెట్టుకుంటుంటే, తుపాకీ పేలి గుండు అతని పాదంలో గుచ్చుకుంది. 1999లో కూడా ఇతనికిలాగే జరిగింది.

✤ అక్టోబరు 2014లో జూస్ అనే బేస్‌బాల్ ఆటగాడు తన రివాల్వర్‌ని శుభ్రం చేస్తుండగా పేలి గుండు ఎడమ చేతిలో దిగింది.

✤ కేలిఫోర్నియాలోని టాక్‌టన్‌లో జనవరి 2015లో డోనెల్లీ(21) ఓ పెట్రోలు బంక్‌లో తుపాకీతో జొరబడి దొంగతనం చేస్తూ పొరపాటున తన కాలి మీద పేల్చుకుని పారిపోయాడు. పోలీసులు అతన్ని ఓ హాస్పిటల్‌లో అరెస్టు చేశారు.

✤ కేలిఫోర్నియాలోని ఫ్రెస్నోకి చెందిన నోవెల్ తన గర్ల్‌ఫ్రెండ్‌ని, ఆమె ప్రియుడ్ని తుపాకీతో బెదిరిస్తూ పేలిస్తే గుండు అతని పాదంలో గుచ్చుకుంది.

✤ న్యూ మెక్సికోకి చెందిన ఆస్కార్(21) మిత్రులతో కలిసి తాగి, సెల్ఫీ తీసుకుంటుండగా తన చేతిలోని రివాల్వర్ పేలి గుండు తలలో దిగి మరణించాడు.

✤ ఆర్లాండోలోని రిచర్డ్(36) జనవరి 2015లో కార్లో వెళ్తూ మరో కారు డ్రైవర్‌తో పోట్లాటకి దిగి, బెదిరింపుగా తీసిన రివాల్వర్ పేలి అతని కాల్లో గుచ్చుకోవడంతో హాస్పిటల్‌లో చేరాల్సొచ్చింది.

అన్యాయం జరిగే అవకాశం ఉంది!" చెప్పన్నాను నేను చిన్న సైజు ఉపోద్ఘాతంతో.

"కొంచెం క్లుప్తంగా చెప్పండి అశోక్" కాలు మీద కాలు మార్చుకుని ఠీవీగా కూర్చుని తలపంకించింది రేవతి.

"మీకు తెలిసే ఉండొచ్చని మా అంచనా. విషయం ఏంటంటే మోహన్-స్వప్నలు ఒకర్నొకరు బాగా ఇష్టపడ్డారు. చాలా క్లోజ్ ఫ్రెండ్సయ్యారు. దాదాపుగా మోహన్ తరఫునుంచైతే- అది ప్రేమించినట్టే అనుకోవచ్చును. విధి ఇక్కడ విచిత్రమైన ట్విస్ట్ ఇచ్చి- స్వప్నకు అనసూయతో తల్లీ కూతుళ్లలాగా అనుబంధం పెంచింది. సమాంతరంగా అనసూయ, వెంకటేశ్వర్లు మధ్య స్నేహం కూడా పెరిగి తాము తమ తమ జీవితాల్లో ఏం కోల్పోతున్నారో రియలైజ్ ఐనారు. తన తల్లికి, స్వప్న తండ్రికి మధ్య ఏర్పడ్డ ఆకర్షణని గమనించిన మోహన్- స్వప్న పట్ల తన ఫీలింగ్స్‌కి స్వస్తి పలికి- ఫ్రెండ్స్‌షిప్‌తో అలాగే మనసును నియంత్రించుకున్నాడు. అతను గనక అలా అనుకోక- స్వప్నతో లవ్ ఎఫయిర్‌కు తెరతీసి తల్లితో కొట్లాడి ఒప్పించుకోవాలనుకుంటే- అదేమీ అసాధ్యమయ్యేదే కాదు! స్వప్న కూడా తనకు తెలీకుండానే- తను కోల్పోయిన తల్లి అవసరాన్ని అనసూ

యలో వెదుక్కుని తృప్తిపడింది.."

"ఇంతకీ మీరు చెప్పదలుచుకుంది- వెంకట్‌కి అనసూయకి రిజిష్టర్ పెళ్లి చేసేద్దామనా? అదే గనక మీ ఉద్దేశమైతే దానికి నేను అడ్డం లేను, అడ్డు రాను!" స్పష్టంగా చెప్పింది- టాపిక్ మూసేస్తూ.




*శ్రీరామనవమి:*

ప్రియదర్శిని పార్క్‌లో పెద్ద మండపం ఏర్పాటు చేసి పూలతో మావిడాకులతో అరటి తోరణాలతో బాగా అలంకరించారు. వెంకటేశ్వర్లు ఆధ్వర్యంలోని కళ్యాణ ఉత్సవ కమిటీ వార్తా పత్రికల్లో కూడా అందరికీ ఆహ్వానం ప్రచురించింది. ఆ పార్కుకున్న గ్లామర్ వల్ల చుట్టు పక్కల జనాలు బాగానే వచ్చి ఆసీనులయ్యారు.

శ్రీరామచంద్రుడు జన్మించిన ఘడియలోనే కళ్యాణం జరపడం సంప్రదాయం. పట్టు వస్త్రాలు, ముత్యాల తలంబ్రాలు మోసుకుంటూ ఎమ్మెల్యే రావడం ఇంకా శోభనిచ్చింది. ఆ ప్రాంగణానికి వేద పండితులు పెళ్ళి మంత్రాలు మొదలుపెట్టి శ్రీరాముడు, సీత విగ్రహాల్ని అలంకరిస్తున్నారు. నేను, స్వప్న కలిసి, విడి విడిగా శాక్సాఫోన్‌లో పాడి శ్రోతల్ని అలరిస్తున్నాం. ఇంకో పక్కన నాదస్వర బృందం మా గానంతో శృతి కలుపుతూ అక్కడి వాతావరణాన్ని ఆహ్లాదం ఆనందంతో నింపింది. వెంకటేశ్వర్లు పట్టువస్త్రాలు ధరించి నుదుట కుంకుమ ధారణ చేసి ఏర్పాట్లు పర్యవేక్షిస్తూ వస్తున్న ప్రజానీకానికి ఆహ్వానం పలుకుతున్నాడు.

త్రినాథ్, చారి ఒక మూలన కూర్చుని ఆసక్తిగా అంతా గమనిస్తున్నారు. త్రినాథ్ నా వంక చూస్తూ థమ్సప్ బొటన వేలిని చూపిస్తూ నవ్వాడు. అతని శాక్సాఫోన్ కోరిక తీరుస్తున్నందుకు నాక్కూడా ఒకింత ఆనందంగా వుంది. వైకుంఠంలో విరజా నది వుందో లేదో తెలియదు గాని, ప్రియదర్శిని పార్కు ఈ రోజు వైకుంఠంలాగా, పక్కనేవున్న సరూర్‌నగర్ చెరువు విరజా నది లాగా అన్పిస్తోంది.

ఇంతలో దూరం నుంచి మోహన్, అనసూయ వస్తూవుండడం గమనించి నేను వెంకటేశ్వర్లుకు సైగ చేశాను. ఆనందంగా వెళ్లి వాళ్ళను తీసుకొచ్చి ముందు వరసలో కూర్చోబెట్టాడాయన.

మల్లెపూలు, బంతిపూలు బస్తాలకొద్దీ వాడి మాలలు తోరణాలుగా కట్టడం వలన పార్కు మరింత గుబాళిస్తోంది. శ్రీరాముడే స్వయంగా, నిజంగా అక్కడ వున్నట్టే - నిజమైన సీతను పెళ్ళాడబోతున్నట్టే అందరూ చాలా భక్తి ప్రపత్తులను ప్రదర్శిస్తూ పవిత్రతను పెంచుతున్నారు. పూర్తి స్థాయిలో పెళ్ళి వాతావరణం నెలకొని వుందిప్పుడు.

ఇంతలో రేవతి. తన స్టాఫ్ మెంబర్లను కూడా తీసుకుని ప్రవేశించింది. వెంకట్, స్వప్న వెళ్ళి ఆమెను తోడ్కొని వచ్చి ఎమ్మెల్యే పక్కన స్టేజీ మీద కూర్చోబెట్టారు. ఆమెను చూడంగానే ఎమ్మెల్యే దంపతులు అంతకు ముందే ఆమె పరిచయం వున్నట్టుగా విస్మయానందం వ్యక్తపరిచారు. రేవతి తన స్టాఫ్‌మెంబర్స్ వైపు చూసి అభివాదం చేసింది. అందులోంచి ఒకతను రెండు పెద్దసైజు పూలదండలు తెచ్చి రేవతి చేతికందించాడు.

శ్రీరామ నామస్మరణతో ఆ పరిసరా

లన్నీ మారుమోగుతున్నై. నా దృష్టి అనసూయ మీదకి మళ్ళింది. నేను శాక్సాఫోన్ ప్లే చేసినప్పుడు ఆమె నాపాటే వింటున్నట్టు నాకు తెలుస్తోంది. కళ్ళతోటే ఆమె నన్ను పలకరించింది. నిరోషా, మధులిక వెళ్ళి ఆమె పక్కనే వున్న కుర్చీల్లోకి మారారు. త్రినాథ్ కూడా మెల్లిగా అడుగు తీసి అడుగేస్తూ వెళ్ళి అనసూయని పలకరించాడు. మొదట్లో బిగుసుకుపోయినా వెంటనే తమాయించుకుని మామూలుగానే ఆయనకి నమస్కరించింది.

వేద పండితులు రాముల వారికి సీతమ్మ వారికి జీలకర్ర బెల్లం పెట్టారు. ఆ తర్వాత సరిగ్గా 12.00 గం॥కి రెండు చేతుల బొటన వేళ్ళతో పట్టుకున్న మంగళసూత్రం అందరికీ చూపించి మాంగళ్య ధారణ చేశారు. ఆపైన ముత్యాల తలంబ్రాలు పోశారు.

నేను ఆ నిమిషంలో నా శక్తికి మించి శాక్సాఫోన్ వూదుతున్నాను - కళ్ళుమూసుకుని. నేను కళ్ళు తెరిచి చూసేసరికి రేవతి - అనసూయని భుజం మీద చెయ్యేసి స్టేజి మీదకి తీసుకొస్తోంది వెనకాతలే మోహన్ - త్రినాథ్. నిరోషా మధుని తీసుకుని స్టేజి మీద నించుని వుంది ఆ పాటికే. ఆ సీన్ చూసి దిగ్భ్రాంతి చెందాను. నా గుండె చప్పుడు మృదంగం కన్నా బలంగా వినిపిస్తోంది.

రేవతి స్టేజీ మీదకు చేరుకుని వెంకట్‌ని చూసి రమ్మని సైగ చేసింది. ఆయనకు ఏం జరుగుతోందో అర్థం కాక అట్లా బిగుసుకుపోయాడు. వేద పురోహితుల దగ్గర మైకు తీసుకొని గట్టిగా అందరూ వినేలాగా అరిచింది మైక్రోఫోన్లో "వెంకటేశ్వర్లుగారూ దయచేసి స్టేజిమీదకి రండి. మీతో పని వుంది" అంది.

నేను శాక్సా అక్కడ పడేసి ఒక ఉదుటున వెంకట్‌ని చేరుకున్నాను. వెంకట్‌కు ముచ్చెమట్లు పోశాయి. అనసూయ కూడా ఆందోళనగా రేవతి వంక నిరోషా వంక చూస్తోంది. స్వప్న తన తండ్రి దగ్గరికెళ్ళి ఆనందంగా కౌగిలించుకుని ఆయన రెక్కలు పుచ్చుకుని స్టేజివైపుకి నడిపించింది.

ఎమ్మెల్యే కూడా వెంకట్‌ను రమ్మని సైగ చేశాడు. రేవతి తన చేతిలో ఆ రెండు పూలదండల్ని పట్టుకుని సిద్ధంగా నుంచుంది. నేను వెంకట్‌ని స్టేజీమీదకి నడిపించాను. ఒక పూదండను వెంకట్ చేతికిచ్చి ఇంకోదాన్ని అనసూయకిచ్చి సీతారాములకి అలంకరించమని చెప్పి పక్కకు జరిగింది. అక్కడ ఏం జరుగుతుందో రేవతి ఇట్లా ఎందుకు చేసిందో అర్థమయ్యి కాకముందే సీతారాముల విగ్రహాలకు ఆ ఇద్దరూ పూల దండలు వేశారు. దండం పెట్టుకున్నారు.

అప్పటికే రేవతి కన్నీళ్ళు నిండిన కళ్ళను చేతితో తుడుచుకుంటుండగా ఆమె చేతిలో వున్న పసుపుతాడు అందరికీ కనబడింది.

రామయ్యా, రఘురామయ్యా!

రావయ్యా, ఇటు చూడవయ్యా!

నువ్వు అడవుల్లో వదిలిపెట్టిన సీతమ్మను ఒక్కసారి చూడవయ్యా. మేమంతా వెదికి వెదికి తీసుకొచ్చాం. చూడవయ్యా ఇంతకాలం ఎట్లా ఎన్ని కష్టాలు పడివుంటుందో ఒక్కసారి ఆమె కళ్ళలోకి మనసులోకి చూడవయ్యా.. ఆమె భూదేవిని రప్పించుకుని మట్టిలో కలిసిపోకముందే ఆమెను పరిగ్రహించుమయ్యా, మళ్ళీ పాణిగ్రహణం చేసుకోవయ్యా.

వెంకటేశ్వర్లుకు అంతా అర్థమైంది. కానీ తను దీనికి సిద్ధంగా వున్నాడో లేడో తెలియడం లేదు. అనసూయ కూడా లేడి పిల్లలాగా బెదురుతూ చూస్తూ వుంది.

*ది ప్రియదర్శిని పార్క్*

త్రినాథ్ 'డి' బెంచ్ మీద ఆసీనుడై వున్న సీను మళ్ళీ ఇవాళ పొద్దున చూసే భాగ్యం కలిగింది నాకు.

ఆయన దగ్గరగా వెళ్ళి పలకరించాను.



నన్ను 'అశోక్' అనే పిలిచాడు.

"వాకింగ్ చేద్దువులే గానీ కాసేపు నాతో కూర్చో అశోక్" అంటూ నా చేయి పట్టుకుని పక్కనే కూర్చోబెట్టుకున్నాడు.

"బాగా వాయించావయ్యా, శాక్సాఫోన్! అబ్బో అద్భుతం గ్రేట్... గాడ్ గిఫ్ట్.."

"థాంక్సంకుల్"...

"అన్నట్టు.. నిన్న రాములోరి కళ్యాణం కన్నుల పండుగగా జరిగింది. నభూతో... అన్నట్లు చాలా సంతోషం"

"ఇంతకీ మీకు ఆరోగ్యం ఎట్లావుంది పుడు? మతిమరుపు? "

"ఔనౌను. మతిమరుపు కూడా వచ్చింది. ఎందుకో తెలీదు. నిన్న కళ్యాణం చూసిందగ్గర్నుంచీ నా శరీరంలో, మనసులో ఏదో మార్పు కనబడుతోంది. రెండడుగులేస్తే ఆయాసం దగ్గు వచ్చేది ఇవ్వాళ రాలేదు. అందుకే చారిగాడ్ని బతిమిలాడితే ఇక్కడ డ్రాప్ చేసి వెళ్ళాడు. గంటాగి వచ్చి మళ్ళీ తీస్కెళతాడు..."

"గాడ్ ఈజ్ గ్రేట్... అంకుల్"

"గాడ్! నువ్వు అప్పుడెప్పుడో నన్ను దేవుడి గురించి ఆయన ఉన్నాడా లేడా అనడిగావు! నువ్వే కదా నన్నడిగింది!"

"ఔనంకుల్. నేనే"

"చూశావా దేవుడున్నాడు అనుకోవడం వల్లే కదా మనం ఈ పండుగలు కళ్యాణాలు చేసేది. చూశావా! మాములుగా



ఐతే నిన్న అట్లా జరిగేదా? మనుషులకు ఓ లిమిట్ వుంటుందయ్యా. ఆ లిమిట్‌ని అధిగమించడానికి దేవుడు అనే కాన్సెప్ట్ అవసరం! ఆ రేవతి రూపంలో నీ రూపంలో మోహన్ రూపంలో... ఇట్లా జరిపించాడు అనసూయ కళ్యాణం!"

"మీ రూపంలో కూడా అంకుల్! అసలు కథ మొదలైందే మీ వల్ల!!"

"ఏమంటున్నావ్? నావల్లా? నేనేం చేశాను? ఏదో సోది కథలాగా నీకు చెప్పాను. నాకు టైం పాస్ అవడం కోసం! ఆ మోహన్ చెప్పింది నీతో షేర్ చేసుకున్నాను. అంతేకదా!"

"ఏయ్, దొంగా... చిలిపి కృష్ణుడిలాగా మీరు చేసింది మర్చిపోయారా? " అనసూయ చెయ్యిపట్టుకుని ఆమె వెంకటేశ్వర్లుకు చేరువయ్యేలా చేసింది ఆయనేనని ఎప్పుడో నాకు అర్థమైంది.

"నేను? మతిమరుపు కదా, గుర్తులేదు. నువ్వు చెప్పు! నేనేం చేశానో!" ఆసక్తిగా అడిగాడు. కావాలనే అడిగినట్లు తోచింది.

"పోన్లెండంకుల్. మీకు గుర్తులేకపోవడమే మంచిది. అంతా మనమంచికే అన్నట్లు - చివరికి శుభం జరిగింది. జస్ట్ ఫర్‌గెట్ దట్ వన్"

"ఏంటయ్యా ఏం చేశాన్నేను? "

ఆయన నన్నాటపట్టిస్తున్నాడా? నాకూ త్రినాథ్‌ని ఆట పట్టించాలనిపించింది.

"వెంకటేశ్వర్లు నిన్ను ప్రేమిస్తున్నాడు అని అనసూయకి, అనసూయ నిన్నిష్టపడుతోందని వెంకటేశ్వర్లుకి చెప్పి ఇద్దరి మధ్యా ప్రేమ చిగురింపజేశారంట కదా!"

"ఔనా? ఆ విషయాలు నాకేవీ గుర్తు రావడం లే. నిజమా? అయితే వాళ్ళ పెళ్ళి క్రెడిట్ నాకే దక్కాలి! సింహభాగం నాదే!" నవ్వాడు త్రినాథ్. ©

# యతి

**అమెరికా మూలం : విలియం సాంబ్రోత్**

**అనువాదం : శారదాప్రసాద్**

**ప**దునైన పళ్లతో ఒళ్లంతా కొరికేస్తున్నట్టుంది ఆ మంచుకొండల్లో వీస్తున్న బలమైన గాలితెర. కనుచూపుమేరా తెల్లటి మంచు దిబ్బలే ఉన్నాయి. మొహానికి ఈడ్చికొడుతున్న గాలిని తట్టుకోలేక, కళ్లు చికిలించి చూస్తూ, మెడకు, భుజానికి తగిలించి వున్న కెమెరాలను సరుద్దుకుంటూ ముందుకు నడుస్తున్నాడు ఎడ్ మెకాలె. రెండు నెలలుగా ఆ మంచుకొండల్లో అతను చేస్తున్నది ఇదే పని.. కెమెరాలు సిద్ధంగా వుంచుకుని, రోజంతా నడవడం.

నీలాకాశం కింద భూమ్యాకాశాలు కలిసే చోటు వరకూ నేలమీద విస్తరించి, మైళ్ల కొద్దీ ఎత్తుకు గాల్లోకి చొచ్చుకొనిపోయి, తెల్లటి మంచు దుప్పట్లు కప్పుకున్న హిమాలయాలదే దేదీప్యమయిన గాంభీర్యం.

వార్తల్లో పతాకశీర్షికలో రాయాల్సిన ఒక వార్తకు కావలసిన ఫొటో తీయడం కోసం ఎడ్ హిమాలయ పర్వతానికి వచ్చాడు. ఇరవైవేల అడుగుల ఎత్తుకు చేరేసరికి శ్వాసించడం కూడా కష్టతరమౌతోంది. తలెత్తిచూస్తే, అతని చుట్టూవున్న మంచు శిఖరాలు మరో పదివేల అడుగల ఎత్తులో వున్నాయిని అర్థమౌతోంది.

సామాన్లు మోయడానికి అతనితో వచ్చిన షేర్పాకూలీలు ఎదురుగా వున్న ఎత్తయిన దిబ్బమీద కనిపిస్తున్నారు. సామాన్లు సర్దేసి బయలుదేరడానికి సిద్ధంగా వున్నారు. వాళ్లతో వాదిస్తున్న డాక్టర్ షెంక్ విపరీతంగా చేతులు తిప్పుతూ, కిందివేపు వేళ్ళతో చూపిస్తూ ఏదో చెబుతున్నాడు. మాట్లాడుతున్నపుడు అతని నోట్లోంచి వచ్చే ఆవిరి స్పష్టంగా కనిపిస్తోంది. షెంక్ మేము తలపెట్టిన ప్రాజెక్టుకు దిశా నిర్దేశకుడు.

షెంక్ బాగా విసిగిపోయి వున్నాడు. అతన్ని తప్పు పట్టలేం. అతను మాతో తిరగాలని ఒప్పందం చేసుకున్న రెండు నెలల కాలం పూర్తయిపోయి చాలా రోజులయింది. ఈ రెండు నెలల్లో ఆ మంచుకొండల్లో తిరగని ప్రదేశం అంటూ లేదు. చిన్న చిన్న దిబ్బలు మొదలుకొని, ఎత్తయిన మంచు కొండలు ఎక్కాం, దిగాం. టిబెట్ వేపు వెళ్లే రహదారి వరకూ వెళ్లి తిరిగొచ్చాం. మంచులో ఎక్కడయినా ఆ అడుగు జాడలు కనిపిస్తాయేమోనని అంగుళం అంగుళం వెతుకుతూ తిరిగాం. మేము తప్ప మరో జీవి అక్కడ తిరుగుతోందని రుజువు చేసే ఏ ఒక్క ఆధారాన్నైనా పట్టుకోవాలని పట్టుదలగా తిరిగాం. రెండు నెలల ప్రయత్నం, శోధన వృథా అయిపోయింది. ఈ ప్రాజెక్టులో మాకు విజయం దక్కలేదు.

అసలీ అర్థంలేని ప్రాజెక్టు రెండు నెలల

అ
క్ష
రం

ఓ వ్యక్తి పవిత్రమైన
ఆలోచనలతో మాట్లాడినా లేక పనిచేసినా
ఎప్పటికీ విడువని
నీడలాగా ఆనందం
అతని వెన్నంటే ఉంటుంది

– గౌతమ బుద్ధుడు



క్రితం ప్రారంభమైంది. ఆ రోజు న్యూయార్క్‌లో, పిక్చర్ మ్యాగజైన్ ఆఫీసులో, తన బాస్ ఎదురుగా కూర్చుని వున్నాడు ఎడ్. బాస్ తన చేతికిచ్చిన ఫొటోని చూస్తున్నాడు. అలుక్కుపోయినట్టున్న ఛాయాచిత్రం అది. స్పష్టంగా కనపడటం లేదు. ఆ ఫొటో హిమాలయపర్వతాల్లో భూమికి ఇరవైవేల అడుగుల ఎత్తునుండి తీసిన ఫొటో. గ్లైడర్ నడుపుతున్న ఒకాయన తీసిన ఫొటో అది.

"గ్లైడర్ నడుపుతూనా?" ఫొటో వంక చూస్తూ, తన బాస్ చెప్పేది వింటున్న ఎడ్ తలెత్తి ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"ఔను గ్లైడరే. ఆ గ్లైడర్ నడిపే ఆయన ఆ రోజు ఎవరెస్ట్ శిఖరం మీద ఎగురుతున్నాడు. ఒక పొడవాటి శిఖరం దాటగానే, కింద, సుమారు వెయ్యి అడుగుల దూరంలో ఎవరో కదులుతున్నట్టు కనపడింది. గ్లైడర్‌ను కొద్దిగా కిందకు దించిన ఆయనకు అచ్చం మనుషుల్లా వున్న ఒక జీవుల గుంపు కనబడింది. ఆ గుంపులో ఆడవాళ్లు, మగవాళ్లు, కేరింతలు కొడుతూ ఆడుకుంటున్న పిల్లలూ.. అందరూ వున్నారు. కానీ, అందరూ నగ్నంగా వున్నారు. ఆ వింత జీవులు కనుమరుగయ్యేలోపునే ఫొటోలు తీయాలనే కంగారులో తన కెమెరాతో కొన్ని ఫొటోలు తీశాడు. వాటిల్లో కాస్త బాగా కనపడుతున్న ఫొటోలు యివే" అన్నాడు బాస్.

ఆ మాటలు విని ఫొటోను మరింత పరిశీలనగా చూశాడు ఎడ్. ఫొటోలో ఎటుచూసినా తెల్లటి సూర్యకాంతిని ప్రతిఫలిస్తున్న మంచుకొండలు కనిపిస్తున్నాయి. మంచు ముద్దల్లాంటి ఆ కొండల మధ్యగా బల్లపరుపుగా వున్న ప్రదేశం. అందులో మధ్యగా చిన్న గుంపు. కళ్లకు దగ్గరగా పెట్టుకుని ఫొటోను చూసిన ఎడ్‌కు అవి మానవాకారాలుగానే కనిపించాయి. మనుషులైతే మరి బట్టలేవీ!?

"అంతా వింటుంటే, కనీకనపడని ఈ ఫొటోలు చూపించి ఆయన మీకు టోపీ పెడుతున్నాడనిపిస్తోంది" అన్నాడు ఎడ్.

"కాదు. మేం అతన్ని అన్ని విధాలుగా ప్రశ్నించి చూశాము. ఆయన గ్లైడర్ మీద వెళ్లొచ్చాడు. ఫొటోలను నిపుణుల చేతికిచ్చి అభిప్రాయం అడిగాము. అవి డమ్మీలు కావని చెప్పారు. ఆ ఫొటోలో కనపడుతున్నవి రెండు కాళ్ల మీద నిటారుగా నిలబడి నడుస్తున్న నగ్న జీవులు. అనుమానం లేదు. అయితే ఈ ఫొటోలు ముద్రించడానికి పనికిరావు. నాకు ఆ జీవుల క్లోజప్‌లు కావాలి. వాళ్లు ఏదో పని చేస్తున్న కదలికలు అందులో కనపడాలి. మన పాఠకులు మన నుంచి ఆశించేదే మనం యివ్వాలి" ఫొటోలను విసుగ్గా బల్లమీదికి విసిరేస్తూ అన్నారు బాస్.

సిగార్ వెలిగించుకుని తిరిగి చెప్పటం మొదలుపెట్టాడతను "నువ్వు తీసే ఫొటోలు మన పత్రికలో ముద్రించేందుకు తగినట్టుగా వుండాలి ఎడ్! అక్కౌంట్స్ సెక్షన్‌లో అడ్వాన్సు తీసుకుని బయలుదేరు"

"అయితే ఈ ఫొటోలు తీయడానికి ఎవరెస్ట్ ఎక్కమంటారు నన్ను" వ్యంగ్యంగా అన్నాడు ఎడ్. మళ్లీ తనే "ఈ ప్రదేశం

ఎక్కడుందో కనుక్కుని, అక్కడికెళ్లి రెండు కాళ్లపై నిటారుగా నిలబడి నడిచే ఈ నగ్న జీవుల ఫొటోలు తీసి తేవాలి. అంతేనా మీరంటున్నది? "

గొంతు సవరించుకుని అన్నాడు బాస్ "నువ్వు ఎక్కాల్సింది ఎవరెస్ట్ శిఖరం కాదు ఎడ్. గౌరీశంకర్ అని, ఎవరెస్ట్ శిఖరాల్లో ఒక శిఖరం. సముద్రమట్టం నుంచి ఇరవై మూడువేల అడుగుల ఎత్తులో వుంది"

"అంటే, మీరు చెపుతున్నది ఆ శిఖరం సుమారు ఎత్తు"

"నిజానికి అది గౌరీశంకర్ కూడా కాదు. గౌరీశంకర్ శిఖర సముదాయంలో అన్నింటికన్నా అతి తక్కువ ఎత్తున్న శిఖరం. అయినా నీలాంటి పారాట్రూపర్ ఎక్స్‌పర్ట్‌కి ఇదేమంత కష్టమైన పనికాదు"

ప్రశంసకు పొంగిపోతూ నవ్వాడు ఎడ్. బాస్ మళ్లీ చెప్పటం మొదలుపెట్టాడు. "ఈ గ్లైడర్ నడిపిన వ్యక్తి తాను చూసిన ఆ ప్రదేశం ఎక్కడవుందో కచ్చితంగా చెప్ప లేకపోయాడు. కానీ ఒక మ్యాప్ లాంటిది గీసి చూపించాడు. అమెరికన్ ఆల్ఫైన్ క్లబ్బువాళ్లు ప్రింట్‌చేసిన మ్యాప్‌లను వాటితో సరిపోల్చి చూసినపుడు దాదాపు రెండూ ఒకేలా వున్నట్టు మాకనిపించింది. ఈ శిఖరం ఎక్కటం అన్నపూర్ణ, కె-రెండు శిఖరాలు ఎక్కినంత కష్టం కాదు"

సిగార్‌ను మరో దమ్ములాగి వదులుతూ అన్నాడు బాస్ "ఆల్ఫైన్ క్లబ్బు వాళ్ల సమాచారం ప్రకారం మాన్‌సూన్ వచ్చే రెండు నెలల ముందు మనం తిరిగేందుకు అక్కడి వాతావరణం అనుకూలంగా వుంటుందట. ఈ పని పూర్తిచేయడానికి రెండు నెలల కాలం ఎక్కువే అనుకుంటాను ఎడ్. ఖాట్మండులో షేర్పాలుండే ఊరు ఒకటుంది - నామ్‌చే బజార్. అక్కడ నువ్వు బేస్ క్యాంప్ ఏర్పాటు చేసుకో. నీకు కావలసిన సరంజామా అంతా విమానం ద్వారా అక్కడ జారవిడిచే ఏర్పాటు చేస్తాము"

మరింత బుజ్జగింపుగా మాట్లాడుతూ అన్నాడు బాస్ "నువ్వు రైలు దిగాక నామ్‌చేకు చేరడానికి రెండు వారాలు నడవాల్సి వుంటుంది. ఆ రెండు వారాల్లో అక్కడి వాతావరణానికి అలవాటు పడిపోతావు. నామ్‌చేలో వున్న షేర్పాలు అనుభవంగల పోర్టర్లు. హిమాలయాలు ఎక్కిదిగిన మరో యిద్దరు షేర్పాలను కూడా తయారుగా వుంచాం. వీళ్లతోపాటు డాక్టర్ షెంక్ కూడా నీతో వుంటారు. ఆయన పనిచేసే రంగంలో ఆయన నిష్ణాతుడు"

"ఏవిటాయన పని చేస్తున్న రంగం? "

"జంతుశాస్త్రం. ఈ ఫొటోల్లో కనిపిస్తున్నవన్నీ జంతువులే.. డాక్టర్ షెంక్ పనిచేసే రంగం అదే. నీతోపాటు వచ్చే వాళ్లందరూ విషయాన్ని గోప్యంగా వుంచుతారు. మీ అందరిలో కెమెరాలు వుపయోగించేందుకు అనుమతి నీ ఒక్కడికే వుంటుంది. ఈ జీవుల గురించి నేను ఊహిస్తున్నది నిజమైతే, ఈ పని నువ్వు పూర్తి చేయగలిగితే నీ కెరీర్ ఒక మలుపు తిరుగుతుంది"

"అవి ఎవరని మీరనుకుంటున్నారు? "

"మనకు యింతకాలం తెలియని ఒక మనుష్య జాతి.. మనుషుల్లో మరో శాఖ"

అంతకు మించి ఇంకేమీ అడగలేదు ఎడ్. రెండు నెలలు.. అంతే.. విషయం అంతా తనకే తెలిసిపోతుంది.

ఆలోచనల నుండి తేరుకున్నాడు ఎడ్. ఈ రోజున తెలిసింది.. రెండు నెలల్లో తెలిసిన విషయం శూన్యం.

నేపాలీ దేశంలో చాలా వదంతులు వ్యాపించి వున్నాయి. మనిషిలానే రెండు కాళ్ల మీద నడిచే జీవులు వున్నాయని కథలు కథలుగా చెపుతారు. ఆ భీకరాకారుల్ని 'యతి' అనే పేరుతో పిలుస్తుంటారు షేర్పాలు. వాళ్లు పురాణ పురుషులని వాళ్ల నమ్మకం. ఎవ్వరూ ఎక్కలేనంత ఎత్తులో వున్న శిఖరాగ్రాలనుండి అప్పుడపుడూ



లయబద్ధంగా మోగే వాయిద్యాల శబ్దం, పాడుతున్న పాటలు లీలగా వినపడతాయి. బౌద్ధ భిక్షువుల ఆన ఒకటుంది- హిమాలయాల్లో ఏ జీవినీ వధించకూడదని.

కథలు, పురాణాలు, యివి వినడానికే సరిపోయింది సమయం. గ్లైడర్ మీద తిరిగిన వ్యక్తి సూచించిన ప్రదేశానికి చేరుకోవడానికి ఈ రెండు నెలలకాలంలో బల్లపరుపుగావున్న భూమిమీద నుండి బయలుదేరి దారిలో ఎన్నెన్నో మంచు కొండలు, మంచు లోయలు, శిఖరాలు దాటుకుంటూ యిక్కడికి వచ్చారు.

ఈ రెండు నెలల్లో డాక్టర్ షెంక్ అంటే విముఖత ఏర్పడిపోయింది ఎడ్‌కు. అన్ని జీవుల్నీ వెన్నెముక ఉన్నవి, వెన్నెముక లేనివి అని రెండు తరగతులుగా విడగొట్టి మాట్లాడుతుంటాడు. షేర్పాలతో వాదనలో మునిగిపోయిన షెంక్‌నే చూస్తున్నాడు ఎడ్. వాదన పూర్తయినట్లుంది. కాస్త ఎత్తులోవున్న మంచు దిబ్బను ఎంచుకుని,

షేర్పాలతో సామాన్లు విప్పించి మళ్లీ గుడారం ఏర్పాటు చేస్తున్నాడు షెంక్. అతను ఈ రోజే తిరిగి వెళ్లిపోతానన్నా, ఆపే హక్కులేదు ఎవ్వరికీ. ఎందుకంటే రెండు నెలలకాలం పూర్తయిపోయి చాలా రోజులయింది. కానీ, ఆ వింత జీవులవుని కిని కనిపెట్టి, పేరు ప్రఖ్యాతులు గడించి, తానూ తనరంగంలో సుస్థిర స్థానం ఏర్ప రచుకోవాలన్న స్వార్థం కూడా అతనిలో వుంది. కానీ యిప్పటి వరకూ ఏ పురోగతీ కనిపించలేదు పనిలో. గ్లైడర్ పైలట్ తీసిన స్పష్టత లేని ఫొటోలు అనామకంగా నిలిచిపోయే పరిస్థితి కనిపిస్తోంది.

ఆలోచిస్తూనే మంచు దిబ్బమీద షేర్పాలు ఏర్పాటు చేస్తున్న గుడారాల వంక తలెత్తి చూస్తున్నాడు ఎడ్. అదే సమయంలో అతని దృష్టి మరి కాస్త పైనున్న శిఖరం, ఆ పక్కనే బల్లపరుపుగా వున్న ప్రదేశంపై పడింది. అతనివి కెమెరా కళ్లు. హఠాత్తుగా తను చూసిన ఫొటో గుర్తొచ్చింది ఎడ్‌కు. అతని జ్ఞాపక శక్తి అమోఘం. తాను ఫొటోలో చూసిన శిఖరంలానే వుంది - ఎదురుగా కనపడు తున్న ఈ శిఖరం. ఫొటోలో చూసినట్టే ఆ శిఖరం తాలూకు నీడ ఆ బల్లపరుపు ప్రదే శంలో నిట్టనిలువునా పడుతోంది. ఆ నీడ చివరిలోనే ఆ వింత జీవుల గుంపు నిల బడి వుండటం ఫొటోలో చూసిన గుర్తు.

పైన నిలబడిన షెంక్ తనను చూసి అన్నాడు "యిది ఆఖరు మజిలీ ఎడ్. యిప్పటికే అనుకున్న వ్యవధి దాటి వారం రోజులయింది. మాన్సూన్ మొదలయ్యే సమయం వచ్చింది. యిక మనం వెను తిరగకుంటే కష్టాల్లో పడతాం"

షెంక్ దృష్టిలో యిదే ఆఖరు మజిలీ.

గుడారాల్లో ఆ రాత్రి అందరూ నిద్రలో మునిగిపోయారు. బలంగా వీస్తున్న గాలికి గుడారాల గుడ్డలు టపటప కొట్టు కుంటున్నాయి.

"అందరూ చెపుతున్న కథల గురించి చాలా ఆలోచించాను డాక్టర్ షెంక్. ఏదో ఒక ఆధారం లేకుండా ఈ కథలు పుట్టి వుండవు. మీరొకటి గమనించారా... ఎవ రు ఈ విషయం గురించి చెప్పినా ఆ జీ వులు, మనుషులు తెల్లవారుఝాము స మయంలో, అది కూడా మనుషులు వంట రిగా సంచరిస్తున్నప్పుడే ఒకరికొకరు తార సపడినట్టు చెపుతున్నారు" అన్నాడు ఎడ్.

షెంక్ పరిహాసంగా నవ్వాడు "నాకైతే అనిపిస్తున్నది, ఆ జీవులు ఎలుగుబంటి జాతికికాని, నాలుగు కాళ్ల జంతువుల జాతి కికాని చెందినవని. ఆ జాతి జీవులు సామాన్యంగా మనుషులకెదురుపడవు. అయినా ఈ మంచు శిఖరాలలో మను షులు తిరిగేదీ చాలా తక్కువే"

యింకా ఆలోచనల్లోనే మునిగివున్న ఎడ్ తిరిగి అన్నాడు "మనం ఆ జీవులను వెతకడానికి అనుసరిస్తున్న ఈ పద్ధతి సరి కాదని నాకనిపిస్తున్నది. యిలా పది మందిని వెంట బెట్టుకుని, శబ్దాలు చేస్తూ తిరగటం... యివన్నీ మనం సంచరిస్తున్న వైనాన్ని ముందే పసిగట్టి కనపడకుండా జాగ్రత్తపడే అవకాశాన్ని ఆ జీవులకు కల్పి స్తాయి. ఆ గ్లైడర్ నడిపిన వ్యక్తి ఏ శబ్దమూ చేయలేదు. అతను గమనిస్తు న్నట్టు ఏ సంకేతమూ ఆ జీవులకు అందే అవకాశం లేదు. అందుకే ఆ జీవులు అతని కళ్లబడ్డాయి" క్షణకాలం ఆగి అన్నాడు ఎడ్ "నేను పైన కనపడుతున్న శిఖరాన్నెక్కి వెతకాలనుకుంటున్నాను"

"ఒద్దొద్దు" గాభరాగా అన్నాడు షెంక్

నిర్భయంగా అన్నాడు ఎడ్ "నేనీసారి వంటరిగానే వెళతాను. నాతో ఒక షేర్పా గైడ్‌ను తీసికెళతాను. తెల్లవారుఝామునే బయలుదేరుతాను. ఆక్సిజన్ తప్ప మరే యితర పరికరాలూ వద్దు. ఒకసారి తిన డానికి కాస్తంత తిండి పట్టుకెళతాను. కెమెరాలు ఎలానూ నాతోనే వుంటాయి.

ఈ విషయం మిగిలిన వాళ్లెవరికీ చెప్ప కండి. మధ్యాహ్నానికల్లా తిరిగి వచ్చేస్తాను. ఈ ఒక్క ఆఖరి ప్రయత్నం పూర్తయి, నేను తిరిగొచ్చే వరకూ దయచేసి యిక్కడే వుండండి... కొద్ది గంటలు... నా కోసం"

"సరే, వెళ్ళండి. కానీ ముఖ్యమైన వస్తు వొకటి మర్చిపోతున్నారు" అర్థం కానట్టు చూశాడు ఎడ్. "అదే గ్యాస్‌గన్. మీకు ఆ జీవి తారసపడితే అంత దూరం నుండి మాకు ఎలా తెలియపరుస్తారు? గ్యాస్‌గన్ గాల్లోకి పేల్చండి. విషయం మాకు అర్థమ వుతుంది" అన్నాడు షెంక్.

తెల్లవారుతోంది. గాలి జోరు తగ్గింది. మబ్బులు కమ్మేసి చంద్రుడు కనపడటం లేదు. ఎడ్, అతనితోపాటు షేర్పా శబ్దం చేయకుండా గుడారాల బయటకు వచ్చి, శిఖరం వేపు బయలుదేరారు.

చుట్టూ వాతావరణం నిశ్శబ్దంగా వుంది. ఎడ్ నడుముకు బిగించుకున్న కెమెరా బె ల్టులు ఒకదానికొకటి ఒరుసుకుంటున్న శ బ్దం స్పష్టంగా వినబడుతోంది. అప్పుడప్పు డూ గడ్డలు గడ్డలుగా వాలులోకి జారుతు న్న మంచు ముద్దల శబ్దం వినబడుతోం ది. తూర్పున సన్నటి వెలుగురేఖ కనిపి స్తోంది. కొద్దిగంటల్లో తెల్లవారుతుంది. ఆ శిఖరం అత్యధిక ఎత్తులో వుందిగాబట్టి సూర్యోదయం ముందుగానే కనిపిస్తున్నది. ముక్కులకు ఉన్ని దుప్పట్లు అడ్డుపెట్టుకు న్నా గాలిలోని చల్లదనం ఊపిరితిత్తులను కోసేస్తున్నట్లు అనిపిస్తోంది.

నడుస్తున్న యిద్దరూ ఒక్క క్షణం ఆగి ఫ్లాస్కులోని వేడి వేడి చాకొలెట్ డ్రింకును తాగారు. షేర్పా భుజాన్ని తట్టి, సూర్యకాం తిపడి బంగారు రంగులో మెరుస్తున్న శిఖరం అంచును చూపించాడు ఎడ్. అటు తలతిప్పి చూసిన షేర్పా ఒకసారి ఆకాశం అంతా పరికించి చూశాడు. ఆకా శంలో తూర్పువేపు నెమ్మదిగా అలుము కుంటున్న మేఘాలు కనిపించాయి. వాళ్లు బయలుదేరిన గుడారాలవేపు చేత్తోచూ




'లాస్ట్ సప్పర్' అనే అపూర్వ కళాఖండాన్ని రూపుదిద్దడానికి లియొనార్డో డావి న్సీకి పదేళ్లు పట్టింది. చిత్ర నిర్మాణం చేయనిరో జుకు పారితోషికం ఇవ్వబోమని మతాధిపతు లు నిబంధన పెట్టినా సమయమంతా ఆ చిత్ర రచనకు సంబంధించిన అధ్యయనాలతో నే గడిపేవాడు.

పించి ఏదో గొణిగాడు షేర్పా.

శిఖరంవేపుపైకి నడవడం ప్రారంభించ గానే ఎడ్ నుండి తన నడుముకు కట్టిన నైలాన్ తాడును విప్పేసుకున్నాడు షేర్పా. వీళ్లు నడుస్తున్న చోటు నుంచి బల్లపరు పుగా వున్న ప్రదేశం దూరంగా కనిపిస్తోం ది. అప్పటి వరకూ ఎడ్‌కంటే రెండడుగు లు ముందు నడుస్తున్న షేర్పా నడకవేగం తగ్గించి, ఎడ్ కంటే వెనకబడ్డాడు.

సూర్యుడు ఆకాశంలో మరికాస్త పైకొ చ్చాడు. వీస్తున్న గాలి వేగం పుంజుకుంది. అప్పటివరకూ ఎదురుగా కనపడుతున్న శిఖరం వెనుకనున్న మరో ఎత్తయిన మంచు పర్వతం చిక్కగా పడుతున్న మంచు తెర వెనక్కిజేరి కనుమరుగౌ తోంది. మంచువాన మరింత పెరుగు తోంది. ఎడ్ నడుస్తున్న ప్రదేశం ఉదయి స్తున్న సూర్యకాంతితో నిండిపోయింది. ఆకాశం నీలంగా, నిశ్చలంగా వుంది. తల తిప్పిచూస్తే గుడారాల చుట్టూ యింకా చీకట్లు అలుముకునే వున్నాయి.

ఎడ్ నడుస్తున్న దారిలో ఎదురుగా తన ఎత్తున్న రాయి మంచుతో కప్పివుంది. ఆ మంచు దిబ్బ పక్కన నిలబడి కిందికి చూస్తే, వాలుగా కిందకి దిగి బల్లపరుపుగా పరుచుకున్న ఖాళీ ప్రదేశం కనబడింది.

వృత్తాకారంలోవున్న ఆ బల్లపరుపు

ప్రదేశం అంతా మెత్తని మంచుతో కప్పి వుంది. తూర్పువేపున నిట్టనిలువుగా, సన్నగాపైకి లేచిన శిఖరం మీద ఎండపడి, ఆ శిఖరం నీడ మధ్యనున్న మైదానంలాంటి ఖాళీ ప్రదేశంలో పడుతోంది. వెనక్కి తిరిగి చూశాడు ఎడ్. తనతో వస్తున్న షేర్పా చాలా అడుగుల దూరంలోనే ఆగిపోయాడు. మాటిమాటికీ ఆకాశం వంక చూస్తున్నాడు. అతని చేష్టలు అర్థం కాలేదు ఎడ్‌కు. మరికాస్తముందుకెళ్లి మంచు దిబ్బకు వీపును ఆన్చి కింద ఎదురుగా విశాలంగా వున్న మైదానం వేపేచూస్తున్నాడు ఎడ్.

అతని మెదడు... జ్ఞాపకాల పొరల్లోంచి అతని బాస్ దగ్గర ఎడ్ చూసిన ఫొటోను

## కొత్తగాలి...



**ముప్పయి రోజులూ**
**అనుభవించినా**
**ఇంట్లో రౌరవం**
**ఫస్టున పెన్షన్ వచ్చేనాడు**
**నాకు అమిత గౌరవం!**

– **యి.భ.వ. రావు,** చిలకలూరిపేట

గుర్తుకు తెచ్చి అతని కళ్ల ముందు పెడుతోంది. అవును... ఫొటోలో తను చూసిన మైదానంయిదే. బల్లపరుపుగా పరుచుకున్న మంచు, చుట్టూ ఎత్తయిన శిఖరాలు, ఆ మైదానంలో కనిపిస్తున్న శిఖరం తాలుకు నీడ, ఆ నీడ చివర సంచరిస్తున్న జీవులు.. పోలికలన్నీ సరిపోతున్నాయి. తాను ఫొటోలో చూసిన ప్రదేశం యిదే కాదు కదా!. ఈ ఆలోచన వచ్చేసరికి అతని గుండెలకు ఎగదన్నింది రక్తం... ఉద్వేగంతో.

కళ్లార్పకుండా మైదానం అంతా పరికిస్తూవున్నాడు ఎడ్. హఠాత్తుగా జరిగిందది... మైదానానికి ఒక మూలనుండి నడచి వస్తున్న మూడు ఆకారాలు... ఎదురుగా... తనకు వందగజాలకంటే తక్కువ దూరంలోనే... కింద... మైదానంలో. ఒకటి పెద్దది, రెండు చిన్న ఆకారాలు.

ఎడ్ కొంచెం ముందుకు వంగి చూశాడు. ఆకారాల్లో స్పష్టత వచ్చింది. అతని గుండె వేగం పెరిగిపోయింది. ఉన్నారు... జీవులున్నారు... తన కళ్ల ఎదురుగానే వున్నారు. ముందుకు నడచివస్తున్న ఆకారాలలో మరింత స్పష్టత కనిపించింది. ఆ పెద్ద ఆకారం ఒక స్త్రీ, ఆమె పక్కన యిద్దరు పిల్లలు.

ఆ ముగ్గురికీ ఒంటి నిండా తెల్లటి బొచ్చు, కింద నుండి పైవరకూ ఒళ్లంతా పట్టినట్టున్న తెల్లటి దుస్తులు ధరించినట్టు. ఆమెకు తల వెనుక వేలాడే జుట్టు లేదు. ఆ ఒక్క తేడా తప్ప మనం చూసే అందరి స్త్రీలలాగే వుంది ఆ స్త్రీ ఆకారం. చేతులు పొడవుగా, పుష్టిగా వున్నాయి. తొడలు బలంగా వున్నాయి. కాళ్లు కురచగా వున్నాయి. బరువుగా, నిండుగా, గుండ్రటి స్తనాలు వున్నాయి.

కోతి జాతి మాత్రం కాదు.

పిల్లలిద్దరూ తల్లి చుట్టూ కేరింతలు కొడుతున్నట్టు ఆడుకుంటూ నడుస్తున్నారు. యింతలో ఆమె ఆ యిద్దరిలో చిన్న పిల్లాడిని రెండు చేతులతో ఎత్తుకుని గుండెలకు హత్తుకుంది. పిల్లాడి ముఖంమీద పడుతున్న వెంట్రుకలను చేత్తో వెనక్కి తోసింది... అచ్చం ఒక తల్లి ప్రేమతో పిల్లాడిని చేతుల్లోకి తీసుకుని ముద్దాడుతున్న భంగిమలో.

'ఎవరనుకోవాలి వీళ్లని?' ఎడ్ ఆలోచిస్తున్నాడు. యింతలో ఆ తల్లి జీవి గలగలమని నవ్విన శబ్దం వినపడింది. ఆ తల్లి చేతుల్లోని పిల్లాడిని ముద్దులాడుతూ మురిసిపోతుంది. షెంక్ చెప్పిన విషయం ఒకటి గుర్తొచ్చింది ఎడ్‌కు. 'శబ్దం చేస్తూ నవ్వగలిగే శక్తి ఒక్క మనిషికే వుంది.



మరే జీవికీ ఆ శక్తి లేదు'

నవ్వుతున్నారు. యిప్పుడు ముగ్గురూ నవ్వుతున్నారు. తల్లి పిల్లవాడికి ఒళ్లంతా గిలిగింతలు పెట్టి మరీ నవ్విస్తోంది. దివ్యానుభూతిని పొందుతున్నాడు ఎడ్. ఈ ప్రపంచం ఎవ్వరికీ తెలియకుండా దాచి పెట్టిన ఒక రహస్యాన్ని తన రెండు కళ్లతో ఎదురుగా చూస్తున్నాడు. చప్పున గుర్తొచ్చింది ఎడ్‌కు. తను ఫొటోలు తీయాలి. అందరికీ చూపించాలి. గ్యాస్ గన్ గాలిలో పేల్చి డాక్టర్ షెంక్‌ని, షేర్పాలను అప్రమత్తం చేయాలి. పైన ఆకాశంలో మబ్బులు వేగంగా కదులుతున్నాయి. తెల్లనివి, నల్లనివి కూడా. ఎడ్ ముఖానికి మంచు ముక్కలు తగులుతున్నాయి, కొన్ని రాలిపోతూ, కొన్ని అతుక్కుపోతూ.

కానీ, ఎందుకో ఆ జీవుల ఏకాంతాన్ని భంగపరచకూడదనిపించింది ఎడ్‌కు. కద

అక్షరం

నీ శత్రువు మాటలు
విను.. ఎందుకంటే..
నీలోని లోపాలు, తప్పులు
అందరికన్నా బాగా తెలిసేది వారికే..

– షేక్‌స్పియర్



లకుండా నిశ్చలంగా నిలబడిపోయి, పట్టప గలు, పూర్తి వెలుగులో తను చూస్తున్న అద్భుతాన్ని తనివితీరా ఆస్వాదిస్తున్నాడు.

యింతలో అతను అనుకోని సంఘటన ఒకటి జరిగింది. అప్పటి వరకూ పిల్లలతో ఆడుకుంటున్న ఆమె కాళ్ల మీద నిటారుగా నిలబడి, ఎండ కళ్లలో పడకుండా అరచే తిని నుదుటి మీద ఆన్చి కళ్లకు అడ్డం పెట్టుకుని, తలపైకెత్తి చుట్టూ చూడటం మొదలుపెట్టింది. తల చుట్టూ తిప్పుతూ చూస్తున్న ఆమె చూపు ఎడ్‌వేపు తిరిగాక, అతని మీదే చూపునిలిపి, కదలకుండా నిల బడిపోయింది. పై ప్రాణాలుపైనే పోయాయి ఎడ్‌కు. కొయ్య బారిపో యాడు. చిన్న పిల్లలిద్దరూ ఎక్కడలేని సంతోషంతో గాల్లో ఎగురుతూ కేరింతలు కొడుతున్నారు. చాలా నెమ్మదిగా ఆమె చేయి గాల్లో లేపింది. దూరంగా వున్న వాళ్లని పలకరిస్తున్నట్టు గాల్లో చేతులూ పింది. శిలలా మారిపోయాడు ఎడ్. కండ రాలన్నీ భయంతో బిగుసుకుపోయాయి.

ఏదో అనుమానం పీకింది ఎడ్‌ను. అది నిజం కాకూడదనుకుంటూ చాలా... చాలా నెమ్మదిగా వెనక్కి తిరిగి చూశాడు ఎడ్. తనకు సరిగ్గా అయిదు గజాల దూరంలో నిలబడి, తన వేపే తీక్షణంగా చూస్తూ, ఎత్తుగా, తెల్లటి బొచ్చుతో నిలబడి వున్నాడు మగజీవి. ఆమె కంటే అతను రెట్టింపు పరిమాణంలో వున్నాడు. రెట్టింపు బలంగా వున్నాడు. షెంక్ చెప్పిన మాటలు ముమ్మాటికీ నిజం... 'ఆదిమాన వుల్లో స్త్రీకంటే పురుషుడు రెట్టింపు బల శాలి' అని.

గ్యాస్‌గన్ తీద్దామంటే అది చాలా బిగు వుగా భుజాల వెనుక బెల్టుకి బిగించి వుంది. అతని నుండి తప్పించుకుని ప్రాణాలతో బయటపడే మార్గం ఎడ్‌కి కని పించటం లేదు. ఎనిమిది అడుగుల ఎత్తు వున్నాడతను. ఎడ్ తొడ పరిమాణంలో వున్నాయి అతని జబ్బలు. గుచ్చేసేలా చూస్తున్న నీలంకళ్లు. నైపుణ్యం గల వేట గాడి తెలివి వుంది ఆ కళ్లల్లో.

ఆ జీవి వున్న చోటు నుండి ఒక అంగుళం కూడా ముందుకు కదలలేదు. వూపిరి వేగంగా పీల్చి వదులుతున్నాడు ఎడ్. భయంతో శరీరం వణికి పోతున్నా, ఎడ్‌కున్నా ఫొటోగ్రాఫర్ కళ్లు మాత్రం ఎదురుగా వున్న అతని స్వరూపాన్ని నిలు వెల్లా చూస్తూ మస్తిష్కంలో ఆ రూపాన్ని భద్రపరుస్తున్నాయి. విశాలమయిన వక్షం, తెల్లటి పెద్ద పళ్లు. ఏ భావమూలేని ము ఖం. ముఖం నుండి భుజాలు, గుండెల వ రకూ యిసుకరంగులో వుంది బొచ్చు. ఆ కింద తెలుపు రంగులో చిన్న చిన్న చెవు లు తలకు రెండు పక్కలా అంటించినట్టు నొక్కుకు పోయివున్నాయి. పొట్టిగా, లావు పాటి మెడ. పాదాలు పొడవుగా వున్నా యి. కాళ్ల వేళ్లు పక్షి కాలివేళ్లలా లోపలివే పుకు వంపు తిరిగి ఉన్నాయి.

వాళ్లిద్దరూ ఒకరినొకరు కొన్ని క్షణాలు అలానే చూసుకున్నారు. ఎడ్‌కి ఆశ్చర్యం మొదలయింది. 'ఎందుకలా అంతసేపు తన వంక చూస్తూ ఊరుకున్నాడతను? యింకా దాడి ఎందుకు ప్రారంభించలేదు?'

ఎడ్‌లో చిన్న కదలిక కనపడగానే మీదికి దూకుదామని ఎదురు చూస్తున్నాడా?

కొన్ని నిముషాలు గడిచాయి, ఇద్దరూ ఆ స్థితిలో వుండగా. ఇద్దరిమధ్యా సన్నటి, తెల్లటి మంచుపొర. ఇద్దరిమధ్యన అవగాహన కుదిరినట్టు అప్రయత్నంగా ఎడ్ అర చేయి గాల్లోలేపి, అతనివేపు తిప్పి ఊపుతూ వెనక్కితిరిగి ఒక్క గెంతుగెంతాడు కిందివేపు. అతను కిందికి కాళ్లతో దిగలేదు. మంచు మీద జారుతూ, పల్టీలు కొడుతూ కిందికి చేరుకున్నాడు. ఎముకలు కొరికేసే చల్లటిగాలిలో కూడా అతని నుదుటిమీద చెమట చుక్కలుగా పేరుకుంది.

కింది వరకూ జారివచ్చి, లేచి కాళ్లమీద నిలబడి శిఖరం వేపు చూశాడు ఎడ్. చిక్కగా కురుస్తున్న మంచు తప్ప మరింకేం కనిపించలేదతనికి. ఆ జీవిని తాను చూశాననడానికి సాక్ష్యాలుగావున్న తన పాదముద్రలు, అతని పాదముద్రలూ మంచులో కప్పబడిపోయి వుంటాయి. చుట్టూ వున్న నోరులేని రాళ్లు, తామిద్దరి చుట్టూ తిరిగిన గాలి... యివే ఈ ఘటనకు సాక్ష్యాలు, తమ కలయిక నిజమని చెప్పే సాక్షులు.

షేర్పా ఆగిపోయిన చోటే నిలబడి తన కోసం ఎదురుచూస్తున్నాడు. యిద్దరూ ఒకరినొకరు నైలాన్ తాడుతో నడుముల దగ్గర కట్టుకుని, కిందికి దిగటం మొదలు పెట్టారు. యిద్దరూ కిందికి చేరుకునే సరికే గుడారాలు విప్పేసి, సామాన్లు సర్దేసి, తిరుగు ప్రయాణానికి సిద్ధంగా వుంది, షెంక్, షేర్పాల, బృందం.

ఎడ్‌వేపు ప్రశ్నార్థకంగా చూశాడు షెంక్.

ఏమని చెపుతాడు ఎడ్? షెంక్ ఒక శాస్త్రవేత్త. అతను వినే ప్రతి విషయానికి రుజువు అడుగుతాడు. ఆ వస్తువయినా చూపించాలి. లేదా అస్థికలు, అవశేషాలు అయినా చూపించాలి. ఆఖరుకి ఒక ఫొటో అయినా చూపిస్తేనేగాని విషయాన్ని నమ్మడు. ఎడ్ మస్తిష్కంలోనే అతను చూసిన జీవి చిత్రం ముద్రితమై ఉంది. ఫిల్మ్‌రీల్ మీదకాదు. మంచువాన వెలిశాక తిరిగి ప్రయత్నించి ఫొటో తీసి తేవాలన్నా, అది అసాధ్యం. యిప్పటికే ఎడ్ కంటపడిన ఆ జీవి మరో చోటికి వెళ్లిపోయి వుంటాడు పిల్లలతో సహా.

షెంక్ ప్రశ్నార్థకానికి, 'ఏమీ లేదు' అన్నట్టుగా తల అడ్డంగా వూపి వూరుకున్నాడు ఎడ్. తాను చూసిన నిజాన్ని రుజువులతో వెల్లడించలేక పోతున్నందుకు బాధగా లేదు ఎడ్‌కు. 'ఏమీ లేదా?' అన్నట్టు భుజాలు కదిలిస్తూ కళ్లెగరేసి గిరుక్కున వెనుతిరిగి శిఖరం దిగసాగాడు షెంక్. మిగిలిన అందరూ అతన్ని అనుసరించారు... ఎడ్‌తో సహా.

మంచు తెరలు, మంచు వానదాటి, చిక్కటి చిట్టడివిని దాటి, వేడిగా, పల్చని గాలి వీస్తున్న భూమికి చేరుకున్నారు అందరూ.

యింతకీ ఎవరతను? ఎలా పుట్టాడు? అతని జాతి ఏది? ఎవరికీ దొరకని అతని స్థావరం ఎక్కడ? .. సమాధానం దొరకని ప్రశ్నలు. వేలవేల సంవత్సరాల క్రితం ఆవిర్భవించిన ఆది మానవుడా? రానురాను తెలివిమీరి పోయి, రూపాంతరం చెందిన నేటి మనుషులతో మమేకమయ్యేందుకు యిష్టపడక, భూమికంటే ఎత్తులో, పైకి, యింకా పైపైకి వెళ్లిపోయి, ఎవ్వరికీ అందుబాటులోకి లేని హిమాలయాల్లో తలదాచుకుంటున్నాడా? ... లేదా, తమ శకాన్ని తిరిగి ప్రారంభించాలనుకుంటున్న తెలివైన జాతికి చెందినవాడా? ...

అతను ఎవరైతేనేమి. అతన్ని గురించిన రహస్యం ఎడ్ గుండెల్లో భద్రంగా వుంది. 'తాను చూసిన ఈ విషయం చెప్పినా మాత్రం ఎవరు నమ్ముతారు' అనుకున్నాడు ఎడ్. ©




## అధరాపురపు తేజోవతి

# పూర్వాసంధ్యా ప్రవర్తతే

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

వేణు అన్న కుర్రవాడి కథే ఈ 'పూర్వా సంధ్యా ప్రవర్తతే' నవల. వేణు తాలూకు ప్రేమ వ్యవహారం ఈ నవలలో కొంతవున్నా, ప్రధానంగా ఇది వేణు నడవడికి సంబంధించిన కథ. రచయిత్రి అధరాపురపు తేజోవతి సమాజంలోని చెడు నడవడిని ఎత్తిచూపుతూనే, మంచి వ్యక్తుల ఓర్పు, కార్యదీక్ష, నిబద్ధత, సరైన ఆలోచన, మంచి నడవడి ఎంతటి మేలు చెయ్యగలవో హత్తుకునేలా చిత్రీకరించారు. మన కళ్లముందు మెదిలే జీవితమే ఈ నవలలో ఉంది.

**తిన్నగా గీసిన గీతలాంటి సరళమైన నవల 'పూర్వా సంధ్యా ప్రవర్తతే'. కథలో పెద్దగా మలుపులుగానీ, ఎక్కువ మెలో డ్రామా గానీ లేవు. కథలో ఉన్నది అరవై, డెబ్బై దశకాల నాటి జీవితం. మధ్యతరగతి, దిగువ మధ్యతరగతికి చెందిన కొన్ని కుటుంబాలు, కొందరు వ్యక్తుల చుట్టూ సాగిన కథ. చురుకుగా చదివించటానికి సాధారణంగా రచయితలు వాడే దినుసులేమీ వాడకుండానే, సరళంగా చదివించే నవల ఇది.**

వేణు పదోతరగతి చదువుతున్న విద్యార్థి. స్నేహితుల ప్రభావం వల్ల కొంత రౌడీతనం అలవాటైంది. ఆ బృందానికి అతనే నాయకుడు. చిన్నచిన్న అల్లర్లు చేసేవారు తప్ప పెద్ద ప్రమాదకరమైన వారెవరూ అతని బృందంలో లేరు. అతనూ అలాంటివాడే. పదోతరగతి పరీక్షల్లో కాపీ చెయ్యటానికి ప్రయత్నించిన వేణు శంకరం మాస్టారి కళ్లబడ్డాడు. ఇద్దరికీ మాటా మాటా పెరిగింది. 'కాపీ కొట్టనియ్యకపోతే ఏం చేస్తానో చూడ'మని బెదిరించాడు వేణు. 'దేనికైనా సిద్ధమే' అన్నారు శంకరం మాస్టారు. పరీక్ష రాయకుండా బయటికి వచ్చేశాడు వేణు. ఆ తర్వాతి పరీక్షలకీ హాజరుకాలేదు. శంకరం మేస్టారి మీద కక్ష పెంచుకున్నాడు. తన స్నేహితులతో ఆయన్ని కొట్టించాలని పథకం వేశాడు. శంకరం మాస్టారు ఒంటరిగా సైకిల్ మీద వస్తుండగా వేణు స్నేహితులు కాపుకాసి ఆపారు. కొంచెం దూరంలో చాటుగా వేణు ఉన్నాడు. వేణు పరీక్షలు పోవటానికి, అతని భవిష్యత్తు పాడవటానికి శంకరం గారే కారణం అని నిలదీశారు.

'నేనా మీ స్నేహితుడి జీవితం పాడుచేసింది? అతను చేజేతులా తన భవిష్యత్తును పాడు చేసుకోబోతుంటే వారించాను, అంతే. అతని మీద నాకేం కక్ష లేదు. ఇవ్వాళ కాపీకొట్టి పాసై సర్టిఫికెట్ తెచ్చుకుంటాడు. కానీ విద్య ఉద్దేశం సర్టిఫికెట్లు సంపాదించటమే కాదు. దురలవాట్లను పోగొట్టి, సత్ప్రవర్తనను అలవర్చని విద్య విద్య కాదు. దురలవాట్లను ప్రోత్సహించటం ఉపాధ్యాయుడిగా నా ధర్మమూ కాదు' అన్నారు శంకరం మాస్టారు.

ఆయన తన పద్ధతి మార్చుకుని, విద్యార్థుల విషయంలో చూసీ చూడనట్టు ప్రవర్తించకపోతే పరిణామం తీవ్రంగా ఉంటుందని బెదిరించారు వాళ్లు. ఎట్టి పరిస్థితుల్లోను తన పద్ధతి మారదన్నారు శంకరం మాస్టారు. చాటునుంచి చూస్తున్న వేణు మాస్టారు దగ్గరికి వచ్చాడు. మింగేసేలా చూశాడు. శంకరంగారు చిరునవ్వు నవ్వారు.

'మిస్టర్ వేణుగోపాల్! ముందు చాలా భవిష్యత్తు ఉంది. మీరు ఇలాంటి దుర్నడతల మీద పరీక్షలన్నీ పాసవగలమని, వృద్ధిలోకి రాగలమని అనుకోవడం పొరపాటు. కష్టపడి చదవండి, మీకు అభ్యంతరం లేకపోతే సాయంత్రం పూట మా ఇంటికి రండి. తెలియనివేమన్నా ఉంటే పాఠం చెబుతాను. కృషి చేస్తే తప్పక పాసవుతారు' అని చెప్పి ఎంతో ధైర్యంగా సైకిల్ ఎక్కి

వెళ్లిపోయారు. వాళ్లు ఏం చెయ్యలేక చూస్తూ ఉండిపోయారు.

శంకరంగారు చెప్పినట్టు వేణు వాళ్లింటికి పాఠం కోసం వెళ్లలేదు సరికదా, ఆయనే ఒక రోజు వేణు ఇంటికి వెళ్లారు. వేణుకి తండ్రి లేడు. తల్లి, అక్క మాత్రమే ఉన్నారు. అక్క జ్యోతి అంటే వేణుకి ఎంతో ప్రేమ. ఆమె మాట ఏదీ కాదనలేడు. జ్యోతి ఎదురుగా శంకరంగారు వేణు ని పాఠాల కోసం తనింటికి రమ్మన్నారు. జ్యోతి వెళ్లమంది. అక్క మాట కాదనలేక ఒప్పుకు న్నాడు వేణు. అయినా అతనికి మాస్టారంటే అయిష్టంగానే ఉంది. ట్యూషన్ డబ్బుల కోసం ఆయన ఇదంతా చేశాడన్న దురభిప్రాయం ఏర్ప రచుకున్నాడు.

నెలలు గడిచేకొద్దీ శంకరంగారి తత్వం అర్థమ వుతూ వచ్చింది వేణుకి. ఆయన నిజాయితీ, ధర్మబద్ధత తెలిసొచ్చాయి. ఆయనంటే గౌరవ మూ ఆరంభమైంది. శంకరంగారికి డబ్బుకోసం చదువుచెప్పే అలవాటు లేదు.

ఇంట్లోంచి బయటికి వెళ్లిన పిల్లలు ఎలా ఉంటున్నారో, వాళ్ల ధోరణి ఎలా ఉందో చాలా మంది తల్లిదండ్రులకి తెలియదు. వేణు తల్లి జానకమ్మకు ఇల్లు చూసుకోవటం, పిల్లలిద్దర్ని చదివించటం వరకే తెలుసు. వేణు రౌడీ వ్యవ హారాల గురించి ఆవిడకే కాదు, అక్క జ్యోతికీ తెలియదు.

జ్యోతి బి.ఎ. పాసయింది. మోహన్‌ని ఇష్టప డుతోంది. స్నేహితురాలు రాధ అన్నయ్య మోహన్ కాకినాడలో ఇంజినీరింగ్ ఆఖరి సంవ త్సరం పరీక్షలు రాసి రావటానికి సిద్ధంగా ఉన్నాడు. బావ ఆనందరావుని పెళ్లి చేసుకోమం టోంది తల్లి. వాళ్ల ఊరికి సర్పంచ్ ఆయన. అత నికి రాజకీయాలంటే ఇష్టం. అతని చదువు ఇంట ర్‌తో ఆగిపోయింది. జ్యోతి మొగ్గు మోహన్ మీదే ఉంది. తన మనసులో విషయం తల్లికి చెప్పింది. తల్లి మోహన్ వాళ్లింటికి మరిదిని పంపి మాట్లాడి రమ్మంది. పెళ్లికి అభ్యంతర పెట్టలేదు గానీ, పదివేలు కట్నం కావాలన్నారు. ప్రేమ, నువ్వు లేందే నేనుండలేను అని కబుర్లు చెప్పిన మోహన్ కూడా తల్లిదండ్రులు కట్నం అడగటంలో తప్పు లేదని సమర్థించుకోవటంతో జ్యోతి తెల్లబోయింది. ఆ పెళ్లి కోసం జానకమ్మ ఆదాయం వస్తున్న పొలాన్ని బేరం పెట్టింది. ఆ పొలం కాస్తా పోతే తల్లికి రోజు గడవటం, వేణు చదువు సాగటం ఎలా అన్న అనుమానం వచ్చింది జ్యోతికి. అదీకాక మోహన్, ప్రేమ




కన్నా డబ్బుకే ఎక్కువ విలువ ఇవ్వడం నచ్చ లేదు. అన్నీ ఆలోచించి, తనని కోరుకుంటున్న ఆనందరావుని పెళ్లి చేసుకోవటానికే నిశ్చయించు కుంది జ్యోతి. భర్తతో పల్లెకి కాపురం వెళ్లిపో యింది జ్యోతి.

వేణు శ్రద్ధగా చదవటం వల్ల పదోతరగతి పాస్ అయ్యాడు. అదంతా శంకరం మేస్టారి చలవే అని తెలుసు. సెలవుల్లో అక్కయ్య జ్యోతి వాళ్లింటికి వెళ్లాడు. అక్కడ పరిచయం అయిన సుశీల అంటే ఆకర్షణ ఏర్పడింది వేణుకి. సుశీల జ్యోతి వాళ్ల పక్కింటి పిల్ల. ఆ వయసులో ఉండే సరదా, సంతోషాలతో ఆ సెలవులు గడిపాడు వేణు. మళ్లీ పట్నం వచ్చి కాలేజీలో చేరాడు.

జ్యోతి భర్త ఆనందరావుకి ఊళ్లో మంచి పలు కుబడి ఉంది. రాజకీయాల్లో అతని ప్రత్యర్థి వెంక ట్రావుకీ మంచి పలుకుబడి ఉంది. వీరిద్దరిదీ చెరోమార్గం. వెంకట్రావు భార్య రవణ, జ్యోతి కలిసి చదువుకున్నారు. అంతేకాక ప్రాణ స్నేహి తులు. ఊళ్లో రాజకీయాల వల్ల ఇప్పుడు బద్ధ శత్రువుల భార్యలు. అయినా జ్యోతి ధైర్యం చెయ్యటం వల్ల ఒకర్నొకరు కలుసుకోగలిగారు.

శంకరంగారి వల్ల వేణులో కొంత మార్పు వచ్చి, చదువంటే శ్రద్ధ చూపించటం ప్రారంభిం చాడు. లేకపోతే విద్యార్థిగా అతని జీవితం నాశనమయ్యేది. చదువు విషయంలో మెరుగుప డినా, అతనిలో పూర్తిగా పాత వాసనలు పోలేదు. ఓ గొడవ వల్ల కాలేజీ నుంచి ఓ వారం సస్పెండ్ అయ్యాడు. విషయం తెలిసి శంకరం

## ఉద్యోగినుల సమస్యల మీద గురి



'రాలిపూవులో రాలిన ముత్యాలు, విజయ, కలల కెరటాలపై కన్నె పడవలు, కోయిల పిలిచింది' వంటి ప్రసిద్ధ నవలల ద్వారా అత్యంత పాఠకాదరణ పొందిన రచయిత్రి అధరాపురపు తేజోవతి. వివిధ పత్రికల్లో దాదాపు వందకు పైగా కథలు రాశారు. పన్నెండు వరకు నవలలు రాశారు. తేజోవతి తన పన్నెండో ఏట నుంచే కథలు రాయడం ప్రారంభించారు. తెనాలి జె.ఎం.జె. మహిళా కళాశాలలో ఆంగ్ల లెక్చరర్‌గా ఉద్యోగ జీవితం ప్రారంభించిన తేజోవతి ప్రధానంగా మహిళా ఉద్యోగుల సమస్యలను తన రచనల్లో ఎక్కువగా ప్రస్తావించారు. అలాగే వృద్ధుల సాధకాబాధకాలను రచనల్లో చెప్పడమేకాక వృద్ధాశ్రమాల ఆవశ్యకతను గట్టిగా చెప్పారు. తేజోవతి మొట్టమొదటి నవల 'పూర్వా సంధ్యా ప్రవర్తతే' ఉగాది నవలల పోటీలో ద్వితీయ పురస్కారం సాధించడం విశేషం. శ్రీనాథపీఠం ఆధ్వర్యంలో శ్రీమతి స్వరాజ్యలక్ష్మి, పురుషోత్తమరావుల అవార్డు, బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తి ఫౌండేషన్ స్ఫూర్తి పురస్కారం పొందారు.

గారే ప్రిన్సిపల్ దగ్గరికి తీసికెళ్లి క్షమాపణ చెప్పించి సస్పెన్షన్ రద్దు చేయించారు. ఇలాంటి సంఘటనలు, శంకరం మాస్టారి దిశానిర్దేశం వేణుకి ఎంతో మేలుచేస్తూ వచ్చాయి. ప్రతి సెలవులకీ అక్కగారి ఊరు వెడుతూనే ఉన్నాడు. సుశీల కనబడుతూనే ఉంది. యవ్వన వయస్కులైన వారిద్దరూ మరింత దగ్గరయ్యారు. పరస్పరం ప్రేమ ఏర్పడింది. వేణు డిగ్రీ పూర్తయింది. జ్యోతికి సుశీల, వేణుల ప్రేమ విషయం తెలిసి పెళ్లికి ప్రయత్నాలు ఆరంభించాలనుకుంది. వేణు ఎమ్మెస్సీలో చేరాడు.

సుశీలని పెంచుకుంటున్న పిన్ని చనిపోవటంతో తల్లిదండ్రుల దగ్గరికి వెళ్లింది. సుశీల శంకరం మాస్టారంటే గిట్టని వరదరాజుల మాస్టారి కూతురు. అప్పటి దాకా ఆ విషయం వీళ్లల్లో ఎవరికీ తెలియదు.

ఊళ్లో ఎలక్షన్ గొడవల్లో ఆనందరావుని ప్రత్యర్థి వర్గం చంపేశారు. జ్యోతికి కోలుకోలేని దెబ్బ అది. అయినా ధైర్యం తెచ్చుకుని నిలబడింది. చిన్నవాడు, అభంశుభం తెలియని, తల్లి లేని పిల్లాడు, మరిది రంగడి కోసం ఆ ఊళ్లోనే ఉండటానికి నిశ్చయించుకుంది. తల్లి జానకమ్మ పిలిచినా ఆమెతో వెళ్లలేదు.

ఎమ్మెస్సీ చదువుతుండగా వేణుకి ఉష పరిచయం అయింది. ఉష ప్రొఫెసర్‌గారి అమ్మాయి, బాగా ధనవంతురాలు. ఉషకి వేణు అంటే పిచ్చిప్రేమ.

తను దేవుడిలా చూసుకునే శంకరం మాస్టారిని ద్వేషించే వరదరాజులుగారి కూతురు సుశీల అని తెలిసిన దగ్గర్నించీ వేణుకి ఆమెపై విముఖత కలిగింది. వేణుని కూడా వరదరాజులుగారు చాలా ఇబ్బందులు పెట్టాడు. ఆయన వల్ల శంకరం మేష్టారు, వేణు పోలీసు స్టేషన్‌కి కూడా వెళ్లాల్సి వచ్చింది. అదృష్టం బావుండి ఏ కేసూ లేకుండా బయటపడ్డారు. అటువంటి వ్యక్తి కూతుర్ని చేసుకోవడం శంకరం మాస్టారికి జరిగిన అన్యాయాన్ని సమర్థించటమే అన్న భావన. సుశీలని చేసుకోనని చెప్పేశాడు. అంతేకాదు ఉష వేపు మొగ్గు చూపించాడు. మళ్లీ శంకరంగారి జోక్యం వల్లే ఆ సమస్య పరిష్కారమయింది. ఆవేశంలో తనెక్కడ పొరబడ్డాడో గ్రహింపుకి వచ్చాక వేణు సుశీలతో పెళ్లికి సమ్మతించాడు.

జ్యోతి, స్నేహితురాలు రవణ ప్రోద్బలంవల్ల గ్రామ సర్పంచ్ అయింది. దానికి వెంకట్రావు నిండు మనసుతో మద్దతు తెలిపాడు.

ప్రధానంగా వేణు కథలాగే సాగిన ఈ నవలలో అతని తొందరపాటుని, ఆవేశాన్ని, రౌడీతనాన్ని ఎంత ఎక్కువగా రచయిత్రి చెప్పారో, అంతగానూ అతని అంతర్గత సంఘర్షణని, అతని మీద శంకరం మాస్టారి ప్రభావం తీసుకొచ్చిన సున్నితమైన మార్పుల్ని అంత వివరంగానూ చిత్రీకరించారు.

ఈ నవలలో పూర్తిగా మంచివాళ్లు, అలాగే పూర్తిగా చెడ్డవాళ్లు ఎవరూ లేకపోవటం విశేషం. అందుకే సహజత్వానికి దగ్గరగా ఉంది. వ్యక్తిగత అనుభూతులైన ప్రేమ, ద్వేషం, అసూయ, అభిమానాల్ని ఎంతగా ప్రతిఫలించిందో ఈ నవల సాంఘిక సమస్యలైన విద్య, ఆరోగ్యం, రాజకీయాల్ని సంకుచితత్వం గురించి అంతగానూ విశ్లేషించింది. విద్యార్థి, ఉపాధ్యాయుల సంబంధాలు ఎలా ఉండాలో, దానికి ఎంతటి కృషి అవసరమో తెలిపిన నవల ఇది. ©



# చతుర ప్ర.జ.

**పాఠకుల ప్రశ్నలకు ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్ సమాధానాలు**

ప్ర. సృష్టికర్త బ్రహ్మదేవుడి ఆజ్ఞపై ఆదిశేషుడు ఈ భూలోకాన్ని తన పడగల మీద మోస్తున్నాడని మహాభారతం ఆదిపర్వంలో ఉంది. నేటి సైన్సు దీనిని అంగీకరిస్తుందా?

**– బిక్కునూరి రాజేశ్వర్,** ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా

**జ.** మనకి కనిపించే ఒక్క సూర్యుడి కాంతినే భరించలేం. అలాంటి సూర్యగోళాలు వందలాదిగా విశ్వం నిండా ఉన్నాయి. నక్షత్రాలు సరేసరి! ఇదంతా మన సైంటిస్టులు పరిశోధనలు చేసి చెప్పిందే గదా! వేలు, లక్షల కోట్ల కాంతిగోళాలు దాటిన శక్తి తత్వాన్ని ఆదిశేషునిగా ప్రతీకాత్మకంగా భావించవచ్చు. అన్ని గోళాలు, అణువులు, పరమాణువులు పరస్పర ఆకర్షణ శక్తులతో పరిభ్రమిస్తున్నాయని విజ్ఞానశాస్త్రం చెబుతోంది. దీన్నే 'ఆదిశేష' పదంతో చెప్పారు. 'శేష' (మిగిలినది) ఒకదానికి చెందినది అని అర్థం. 'ఆది' సృష్టికి మూలమైన తత్వమునకు 'శేషుడు' అని అర్థం.

ప్ర. పాపాలు చేసినవారు నరకానికి, పుణ్యాలు చేసినవారు స్వర్గానికి వెళతారంటారు. మరి పాప పుణ్యాలు సమానమైనపుడు ఎక్కడికి వెళతారు?

**– కరణం శివానందరావు,** కర్నూలు

**జ.** ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు ఈ విషయంలో చాలా చర్చించాయి. పుణ్యపాపాలు సమానంగా ఉండటం చాలా అరుదు. యోగులు, మహర్షులు వారి ఇచ్ఛానుసారం ఏది ముందను కుంటే దానిని అనుభవించవచ్చు. పాపానుభవం తెలుస్తుంది. పుణ్యఫల అనుభవం గమనించేవారు అరుదు. సముద్రమంత పుణ్యం చేసి, నీటి బిందువంత పాపం చేశాడు నృగమహారాజు. పాపమే ముందు అనుభవిస్తానన్నాడు. అంతే వేల సంవత్సరాలు ఊసరవెల్లి జన్మలో ఉండాల్సి వచ్చింది. ఇది భాగవత గాథ. పుణ్యపాపాలు రెండూ పూర్తిగా తొలగితేనే పునర్జన్మ రాహిత్యం సాధ్యమని శ్రుతివాక్యం.

ప్ర. యజ్ఞయాగాదులు, పూజల వల్ల వర్షాలు కురుస్తాయా? ఎన్నో చెట్లను నరికి కాల్చడం, నవ ధాన్యాలను, నెయ్యిని అగ్నికి ఆహుతి చెయ్యడం- లక్షల, కోట్ల డబ్బు ఖర్చుచేయడం ఎంతవరకు సమంజసం? అభిషేకం, అర్చన పేరుతో పాలు, పెరుగు, తేనె వంటివి వృథా చేస్తున్నారు. పేదల ఆకలి బాధలు కొంతవరకైనా తీర్చవచ్చు కదా! వీటి ఆంతర్యం ఏమిటి?

**– వి. అమిత,** కరీంనగర్

**– పక్కి బాలకృష్ణారావు,** గరివిడి, విజయనగరం జిల్లా

**జ.** యజ్ఞాలలో ఉపయోగించే నవధాన్యాలు, చెట్లకొమ్మల చిదుగులు (కొమ్మల ముక్కలు కాదు, చిన్నచిన్న పుల్లలు), దర్భలు, నేయి, పాలు, తేనె, పెరుగు- వీటన్నిటి ద్రవ్యగుణాల్ని ఆయుర్వేద గ్రంథాలు విస్తారంగా వివరించాయి. కాల్చినందువల్ల, కాగినందువల్ల, పొగగా మారినందున వాతావరణంలో ఎలాంటి మార్పులు తెస్తాయో 'ద్రవ్యరత్నావళి' వంటి గ్రంథాలు చెప్పాయి. మిరియపు గింజ తింటే ఒక రకమైన ప్రభావం, పొడి చేసి పాలతో తీసుకుంటే మరొక ఫలితం, కాలినపుడు పరిమళం పీల్చితే మరొక ఫలితం. ఇలాగే అన్ని హోమ ద్రవ్యాలతో ఉపయోగాలున్నాయి. తద్వారా మేఘాలు, వర్షాలు- ఇలాంటి ఫలితాలున్నాయి.

మరొక మాట! ప్రతియుగమునకు అన్నశాంతి పేర ఎందరెందరికో ఆకలి తీర్చడం ప్రధానంగా ఉండేది. అశ్వమేథాలు, ఇంద్రయాగాలు

# చతుర ప్ర.జ. 6

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్ అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : చతుర ప్ర.జ.

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

(గోవర్ధన ఘట్టం) లో ఇది చూడవచ్చు. ఆఖరికి యాగాలు జరిగిన క్షేత్రంలో 'సత్రము' పేరుతో లోగిళ్లు నిర్మించి అన్నార్తుల ఆకలి తీర్చేవారు ఆనాటివారు.

*ప్ర. భక్తి కూడా ఒక వ్యసనమే కదా? మరి తేడా ఏమిటి?*

**– జి.ఎస్. శ్రీనివాసరావు,**
*బొబ్బిలి, విజయనగరం జిల్లా*

**జ.** వ్యసనం అంటే ఆపదని, చెడు అలవాటని, మంచి నుంచి చెడుకు మనిషిని మరలించే బుద్ధి అనీ అర్థం. దీనిని వేరే రకంగా ఒకే పనిమీద చాలా అభిరుచి కలిగి ఉండడం అనే అర్థంలో వాడడం అలవాటయింది.

ఇక భక్తి అన్నది వ్యసనమా? మంచి గుణమా? ఆలోచించండి! భక్తి వ్యసనం.. చెడు దారి పట్టించే అలవాటయితే ఆదిశంకరుల వంటి వారు 'మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'- మానవుడు సంసార బంధాలు పోగొట్టుకునేందుకు ఉన్న సాధనాలన్నింటిలో భక్తి చాలా గొప్పదని అనరు. నారదుని భక్తిసూత్రాలు రావు. ప్రహ్లాదుడు నవవిధ భక్తులు వివరించడు.

భక్తి ముసుగులో చెడు మార్గం పట్టినపుడు మాత్రం దానిని తప్పనిసరిగా వ్యసనం అనాల్సిందే! తొలగించడానికి తగిన రీతిలో ప్రయత్నించాల్సిందే!

*ప్ర. శ్రుతులు అంటే ఏమిటి? ఎన్ని? సంగీత పరంగా రాగాలకు అనువుగా కూర్చే శ్రుతులతో సంబంధం ఏమైనా ఉందా?*

**– టి.వి.డి.ఎన్. సీతారామారావు,**
*కొత్తగూడెం, ఖమ్మం జిల్లా*

**జ.** ప్రశ్నలో సందిగ్ధత ఉంది. రాగము, భావము, లయ - గీతానికి ప్రధానము. భావానికి తగిన రీతిలో గానం చేయడానికి ఎన్నుకునే గానరీతి రాగము. దానికి ఉండే నడక (తూగు)ను నిర్దేశించేది లయ. గాయకుని మనోధర్మము గాత్ర విశేషము, ఆరోగ్యము మొదలైన వాటిననుసరించి శ్రోతలకి వినసొంపుగా గానమో, వాద్యమో వినిపించే స్థాయి శ్రుతి.

శ్రుతి అంటే వేదము అనే అర్థం ఎలాగూ ఉంది. సంగీతానికి మూడు శ్రుతులు అని యజుర్వేదము చెప్పింది. 1. తారము - ఇది క్రౌంచ ధ్వనిలా ఉంటుంది. ఇది రాక్షసులకి ప్రీతి(ట)! 2. మధ్యమ - ఇది దేవతలకి ప్రీతిట! 3. మంద్రము - ఇది మానవులకి. సంగీత శాస్త్రము తెలిసిన విశేషజ్ఞులు మరింత వివరంగా సాంకేతిక పదాలతో వివరించగలరు.

*ప్ర. భగవంతుడు అందరి కంటే ఉన్నతుడు, అతీతుడు కదా! మరి గ్రహణాలప్పుడు ఆలయాలు మూసెయ్యడం ఎందుకు?*

**– కె.వి. భారతి,** పాకాల, చిత్తూరు జిల్లా

**జ.** సూర్యచంద్రులు రాహుగ్రస్తమైనపుడు ఆ స్థితి అశుచిత్వానికి గుర్తు. సంప్రదాయం నమ్మిన వారందరికీ ఇది ఆచరణీయం. అలాంటి అపవిత్ర స్థితిలో ఆరాధన నిషేధం. మానసిక జపం ప్రధానం. అశుచి తొలగాలని ఆర్తితో జపం చేస్తాం కనుక ఆ సమయంలో జపం ఎక్కువ ఫలితం ఇస్తుందని పెద్దల నానుడి. రాహుకేతువుల ప్రాధాన్యం ఉన్న ఆలయాలు, ప్రత్యేకించి శివాలయాలు తప్ప మిగిలినవి అన్నీ మూసితీరాలని ఆగమవేత్తల నిర్ణయం. అందరికంటే ఉన్నతుడైన భగవంతుని పూజించడానికి అధికారం ఉన్న పూజారి కూడా అశుచిగా ఉన్నపుడు ఆ పనికి అనర్హుతవుతాడు కదా!

ఉత్పాతాలు, విపత్కర పరిస్థితులు, భయంకర

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

*ప్ర. శ్రీరాముడికి వనవాసం 14 ఏళ్లే కోరింది కైక? ఇందులో ఏమైనా అంతరార్థం ఉందా? ఏ తల్లయినా తన కొడుకు కలకాలం రాజ్యం చెయ్యాలనే కోరుకుంటుంది కదా?*

**– తటవర్తి రామకృష్ణ,** తాళ్లగడ్డ, హైదరాబాద్

జ. రాజకీయాలు యుగాలని బట్టి, తరాలని బట్టి మారుతుంటాయి. నియమాలూ అంతే. ఉదాహరణకి, రుణపత్రాలు (ప్రామిసరీ నోట్లు) మూడు సంవత్సరాలు గడిస్తే తిరగ రాయకుంటే చెల్లవు. మూడు తరాలు గడిస్తే ఒకే ఇంటి పేరుగలవారికి పురుళ్ల పుణ్యాలు ఉండవని శాస్త్రం. ఏడు తరాలు గడిస్తే అన్నాచెల్లెళ్లు, అక్కా తమ్ముళ్లు రాకపోకలు ఉండకపోతే బంధుత్వం తెగిపోతుంది.

అదే పద్ధతిలో రాముడు కనుక రాజ్యానికి దూరంగా 14 సంవత్సరాలుంటే రాజ్యార్హత కోల్పోతాడు అని ఒక కారణం చెబుతారు. అయితే భరతునికే రాజ్యం ఇచ్చినప్పుడు రాముడు నగరంలో ఉంటే ప్రమాదమని, అరణ్యవాసం ఏర్పాటు అని కథా గమనంలో వస్తుంది.

అన్నకు పెళ్లి కాకకుండా, తమ్ముడు చేసుకుంటే 'పరివేత్త' అనే వానికి వచ్చే పాపం తమ్ముడికి వస్తుంది. జ్యేష్ఠుడు ఉండగా చిన్నవాడికి పట్టాభిషేకం జరిగినా అదే పాపం. కానీ జ్యేష్ఠుడు రోగి కానీ, నాస్తికుడు కానీ, కనీసం క్షణకాలమైనా దురాచారాలకి పాల్పడే బుద్ధి కలిగినా, చిన్నవాడికి 'పరివేత్తా' దోషం అంటదు. పట్టాభిషేక ముహూర్త సమయానికే కాదు, జీవిత పర్యంతము రామునికి పై లక్షణాలు ఉండే అవకాశం లేదని కైకకీ తెలుసు. కానీ 14 సంవత్సరాలలో (ఆనాటి వారి జీవితకాలంతో పోల్చితే అది చాలా తక్కువ వ్యవధి) అలాంటిది ఏదైనా జరగకపోతుందా అని కైకమ్మ ఊహ, ఆశ. దశరథుడే అరవై వేల సంవత్సరాలు జీవించాడట.

మైన అంటువ్యాధులు ప్రబలుతున్నపుడు కూడా ఆలయాలు మూసివేయడం ఒకనాటి సంప్రదాయం. దేవాలయాల పవిత్రత రక్షించడము, తద్వారా సమాజానికి క్షేమము కలిగించడము ఈ ప్రక్రియలోని అంతరార్థము.

*ప్ర. తల్లిదండ్రులు ప్రత్యక్షదైవాలు కదా! వారిని సేవించి, గౌరవించి, ప్రేమగా చూసుకుంటే చాలు కదా! వేరే దేవాలయానికి వెళ్లడం అవసరమా?*

**– నేమాన సుభాష్‌చంద్రబోస్,** విశాఖపట్నం

**జ.** చాలా మంచి ఆలోచన! పద్మపురాణంలో 'మాతృతీర్థము', 'పితృతీర్థము' అని రెండు గాథలు (కనీసం పది అధ్యాయాలు) ఉన్నాయి. శ్రవణకుమారునిలా, ధర్మవ్యాధునిలా, గరుత్మంతునిలా - అంత గొప్పగా మాతాపితరుల సేవ చేయగలిగితే, ఆ పిల్లలే దేవుళ్లు. ఆ లోగిళ్లు దేవతానిలయాలు. ఈ శతాబ్దంలో అలాంటి సంతానం ఉన్నారా? ఉద్యోగాల కోసం ఖండాంతరాలు వెళ్ళి, తల్లిదండ్రులని 'ఏసీ గదుల వృద్ధాశ్రమాల్లో ఉంచాం కదా!' అని కొందరు, 'డబ్బు కావలసినంత పంపుతున్నాం' అని కొందరు- వీరిని ఏమనాలి? ఒకవేళ తల్లిదండ్రులని సేవిస్తే దేవాలయ దర్శనం మానమని ఏ శాస్త్రమూ చెప్పలేదు. దేవాలయ దర్శనానికే వీలు కానంత సమయం తల్లిదండ్రుల సేవకి కేటాయిస్తే మంచిదే. 'మాతృదేవో భవ! పితృదేవో భవ!' సంస్కారం బలపడుతుంది.

*ప్ర. 'ఊరికి చేసిన సేవ.. శవానికి చేసిన అలంకారమే' అనే నానుడి ఉంది. ఈ నానుడి పుట్టుకకు కారణం వివరించగలరు. ఊరికి సేవ చేయడం పుణ్యమే కదా? ఇలా శవానికి చేసినట్లే అనడమెందుకు?*

**– వెల్మల రాంరెడ్డి,** పూడూరు, కరీంనగర్ జిల్లా

**జ.** సామెత ఎక్కడో పద భంగానికో, వాక్య భంగానికో గురయింది. తన ఇంటిని, భార్యాపిల్లలని, తనవారిని, తల్లిదండ్రులు, బంధువులు, సేవకులు - వీరందరినీ బాధ్యతా రహితంగా గాలికి వదలి, పేరు, పదవి, ఆర్భాటం, స్వార్థం కోసం ఊరికి (ఊరికే) చేసిన సేవ శవాలంకారం కాదా! ఊరి మీద అభిమానం ఉంటే, తనని ఆశ్రయించిన వారు 'ఊరివారిలో' ఉండరా- గమనించండి! అవసరం లేనిచోట బాధ్యత నటించి, చేసే సేవ శవాలంకారం. అవసరం ఉన్నచోట బాధ్యత పడి చేసే సేవ ఎంత చిన్నదయినా, సామాన్యమైనదైనా శ్లాఘనీయం. త్యాగయ్య 'బ్రోవ భారమా రఘురామా నన్ను ఇందరిలో..' అని రాముని పరాచకమాడారు. బాధ్యతా నిర్వహణ తర్వాతే పుణ్యకార్యాలు.

# మా అత్త బంగారం



\- వాణిశ్రీ

ఈశ్వరమ్మ విశాఖపట్నంలో పెద్దకొడుకు దగ్గర నాలుగు నెలల నుంచి వుంటున్నది.

ఆ రోజు ఉదయం ఎనిమిదింటికి ఈశ్వరమ్మ హాల్లోని సోఫాలో కూర్చుని కాఫీ తాగుతున్నది. టీపాయ్ మీద ల్యాండ్‌లైన్ ఫోన్ మోగింది. ఆమె రిసీవర్ ఎత్తింది.

"హలో...!" అన్నది.

"అత్తయ్యా! నేను శ్రావణిని మాట్లాడుతున్నా!"

"శ్రావణీ బాగున్నావా? పిల్లలు కులాసానా? "

"ఆ!... అంతా బాగున్నారు అత్తయ్యా! మీ అబ్బాయి విశాఖపట్నం నుంచి హైదరాబాద్‌కి ట్రైన్ టిక్కెట్ బుక్‌చేసి మీకు కొరియర్లో పంపారు అత్తయ్యా! ఈ రోజే మీ ప్రయాణం, అందుకే గుర్తు చేస్తున్నా!"

"ఆ!... టిక్కెట్ అందింది శ్రావణీ"

"ట్రైన్ పేరు గరీబ్‌రథ్. ఫుల్ ఏ.సి. కంపార్ట్‌మెంట్. రాత్రి ఎనిమిదిన్నరకి అక్కడ బయల్దేరుతుంది"

"సరేనమ్మా! రాత్రికి బయల్దేరుతున్నాలే"

"జాగ్రత్త అత్తయ్యా! ట్రైన్లో పక్కసీటు, ఎదురు సీటు వాళ్ళు ఏమిచ్చినా తీసుకుని తినకండి. అన్నీ ఇంటి దగ్గర్నుంచి తెచ్చుకోండి, వాటర్ బాటిల్‌తో సహా"

"అలాగే... అలాగే...!"

"ట్రైన్ సికింద్రాబాద్ వచ్చేసరికి తెల్లవారుతుంది. మీ అబ్బాయి ట్రైన్ దగ్గరికి వస్తాడు"

"సరేనమ్మా" అన్నది ఈశ్వరమ్మ.

శ్రావణి ఆమె రెండో కోడలు.

ఈశ్వరమ్మ రిసీవర్ పెట్టేసింది. ఆమె పక్కనే కూర్చుని ఉంది సరస్వతి. ఆమె పెద్దకోడలు.

"పొద్దున్నే ఫోన్ చేసిందా శ్రావణి? " అడిగింది సరస్వతి.

"ఔనమ్మా!"

"హుఁ... నేను అనుకుంటూనే ఉన్నాను. ఊపిరాడనివ్వదు మీకు. ఏం కొంపమునిగిందని పొద్దున్నే ఫోన్లు? ట్రైన్ టికెట్ పంపారుగా? రాక తప్పుతుందా? " అక్కసుగా అన్నది సరస్వతి.

అక్షరం

మనస్ఫూర్తిగా పనిచెయ్యనివారు
జీవితంలో
విజయాన్ని సాధించలేరు

– అబ్దుల్ కలామ్



"పోన్లేమ్మా! దాని ఆదుర్దా దానిది"

"మీరెళ్లిపోతున్నారంటేనే ఏదోలా ఉంది అత్తయ్యా! నాలుగు నెలలు నాలుగు రోజుల్లా గడిచిపోయాయి. ఎంతహాయిగా ఉందో, మీరెళ్లిపోతే దిగులుగా ఉంటుందిక. కొన్నాళ్ళపాటు సరిగా నిద్రపట్టదనుకోండి"

"ఔననుకో! కాని తప్పదుగా! ముగ్గురు కొడుకుల దగ్గర, తలా నాలుగు నెలల పాటు ఉంటానని ఒప్పుకున్నానుగా! నాకు ఓపిక ఉన్నంతకాలం తిరుగుతుంటాను. ఏదైనా జబ్బుపడి మంచాన పడితే చెప్పలేను"

"అంతమాట అనకండి అత్తయ్యా! వినడానికే బాగాలేదు. మీకైమనా అయితే తట్టుకోలేను. అటువంటి పరిస్థితే వస్తే మిమ్మల్ని కదలనిస్తానా? నా దగ్గరే ఉంచుకుని జీవితాంతం సేవ చేస్తాను"

"మాతల్లే.. అంతమాటన్నావు అదే చాలు"

"మీరెళ్ళిపోతున్నారంటే పిల్లలు గూడా దిగులు పడిపోయారు. అసలు స్కూలుకి వెళ్ళనని మొరాయించారు. నేనే బతిమాలి పంపించాను" చెప్పింది సరస్వతి.

"పిల్లలు స్కూలు నుంచి వచ్చేసరికి నేను ఉంటానుగా? రాత్రి ఎప్పుడో ఎనిమిదిన్నరకి ట్రైన్"

"మేమంతా వచ్చి సెండాఫ్ ఇస్తాం అత్తయ్యా!"

ఈశ్వరమ్మ సంతోషించింది. పెద్ద కోడలికి తనంటే ఎంత ప్రాణమో? అనుకుంది.

★ ★ ★

నాలుగు నెలల తర్వాత హైదరాబాద్‌లో ఈశ్వరమ్మ రెండో కొడుకు ఇంట్లో ఉన్నది.

ఈశ్వరమ్మ హాల్లోని సోఫాలో కూర్చుని కాఫీ తాగుతున్నది. టీపాయ్ మీద ల్యాండ్‌లైన్ ఫోన్ మోగింది. ఆమె రీసివర్ ఎత్తింది.

"హాలో..." అన్నది.

"హాలో! అత్తయ్యా! మీరేనా? చూశారా.. మీ గొంతు ఎలా గుర్తుపట్టానో? "

"స్వప్నా! బాగున్నావా? "

"బాగున్నాను అత్తయ్యా! మీ ఆరోగ్యం ఎలా వుంది? బాగున్నారు కదా? హైదరాబాద్‌లో ఒకటే వర్షాలు, చలి విపరీతంగా వుంది. ఎయిర్‌పోర్టులో విమానాలు దిగలేక వెనక్కి వెళ్ళిపోతున్నాయని వార్తల్లో చెప్తున్నారు"

"ఔనమ్మా!"

"ఇక రేపటి నుంచి మీకు ఏ బాధా లేదు అత్తయ్యా! మీ అబ్బాయి ట్రైన్ టికెట్ బుక్‌చేసి, కొరియర్లో మీకు పంపారుగా! హైదరాబాద్ చెన్నై ఎక్స్‌ప్రెస్‌కి"

"ఆc... టిక్కెట్ వచ్చిందమ్మా! సాయంకాలం బయల్దేరుతున్నా!"

"జాగ్రత్త అత్తయ్యా! ట్రైన్లో అపరిచితులు బిస్కెట్లనీ, డ్రింకులనీ ఇస్తే తీసుకోకండి. అందులో మత్తుమందు కలుపుతారు. అన్నీ ఇంటి దగ్గర్నుంచి తెచ్చుకోండి, వాటర్ బాటిల్తో సహా"

# చతుర కత

"అలాగేనమ్మా!"

"ఉంటాను అత్తయ్యా!"

సోఫాలో ఈశ్వరమ్మ పక్కనే కూర్చునివుంది శ్రావణి.

"ఎవరు స్వప్ననే కదా? "

"ఔను...!"

"హు!... పొద్దున్నే ఫోన్. ఏం కొంపమునిగిందనో...! ఈ రోజు మీరెళ్ళిపోతున్నారంటే అదోలా వుంది అత్తయ్యా!" శ్రావణి కళ్ళొత్తుకుంది.

ఈశ్వరమ్మ హృదయం ఉప్పొంగిపోతోంది ముగ్గురి కోడళ్ళకి తన మీద అంతులేని ప్రేమ వున్నందుకు.

ఎందుకంటారా ఆ కోడళ్ళకు అత్తమీద అంత ప్రేమ? విడ్డూరంగా వుందా? ఉంటుంది మరి?

ఈశ్వరమ్మకు ప్రతినెలా పాతికవేలు పెన్షన్ వస్తుంది మరి! ©

# భామనే.. సత్యభామనే..!

17

బుల్లితెరపై 'కసమ్ సే' అనే హిందీ సీరియల్‌తో ప్రత్యేక గుర్తింపును పొందిందా చిన్నది. అదే 'రాక్ ఆన్' సినిమాకు కథానాయిక అవకాశాన్ని తెచ్చిపెట్టిందా బాలీవుడ్ భామకు. అలా వరుసగా 'వన్స్ అపాన్ ఎ టైమ్ ఇన్ ముంబై, బోల్ బచన్' వంటి సినిమాలతో దేశంలోని అందరి దృష్టినీ తనవైపు తిప్పుకున్న ఆ సొగసరి మరెవరో కాదు.. ప్రాచీ దేశాయ్! మరి ఆ ముద్దుగుమ్మ తన అందానికి ఎలా మెరుగులు దిద్దుకుంటోందో ఆమె మాటల్లోనే..

## సొగసు చూడతరమా...

సానుకూల భావాలతో మనసును, శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకోవడమే నా అందం వెనుక దాగిన రహస్యమని నా అభిప్రాయం. సరైన ఆహారం తీసుకుంటూ ఆరోగ్యంగా జీవించడం, సంతోషంగా ఉండడం.. ఇవి ముఖంలో సహజమైన కాంతిని నింపుతాయి. అందాన్ని రెట్టింపు చేస్తాయి. మన ఆలోచనలూ బాహ్య సౌందర్యం మీద ప్రభావాన్ని చూపుతాయి.

తెల్లవారుజామున లేవగానే గ్లాసు గోరువెచ్చని నీటిలో తేనె కలుపుకుని తాగుతాను. తర్వాత యోగా.. ఇవి రెండూ రోజును ఉత్సాహంగా మొదలుపెట్టడానికి ఉపయోగపడడమే కాదు, చర్మసౌందర్యాన్నీ ఇనుమడింపజేస్తాయి.

ఇంట్లో పాటించగలిగే చిన్న చిన్న చిట్కాలపైనే ఎక్కువ నమ్మకం నాకు. వీలైనపుడల్లా అలోవీరా గుజ్జు, పసుపు ముఖానికి రాసుకుంటుంటాను. రోజుకు కనీసం మూడు నుండి నాలుగు లీటర్ల నీరు తాగుతాను. కొబ్బరినీళ్లంటే చాలా ఇష్టం. సంవత్సరం పొడవునా తాగుతాను. ఇక వేసవిలో పంచదార లేకుండా నిమ్మరసం కొంచెం కొంచెంగా తాగు

తుంటాను. చర్మాన్ని ఆరోగ్యవంతం చేయడంలో బాగా తోడ్పడతాయి.

క్యాలరీలు లెక్కబెట్టుకుంటూ ఆహారం తీసుకోవడం ఇష్టముండదు. పని ఒత్తిడి ఉన్నప్పటికీ సమయానికి ఆహారం తీసుకుంటాను. మధ్యమధ్యలో నీరు తప్పకుండా తాగుతుంటాను. అలా చేయడం వల్ల త్వరగా అలసిపోకుండా శక్తిని కోల్పోకుండా ఉంటాను. లోపలి ఆరోగ్యం బాగున్నపుడే బయటికి అందంగా కనిపిస్తాం. పవర్ యోగా క్షణాల్లో శక్తినిస్తుంది. తాజా కూరగాయలు ఎక్కువగా తింటాను. జంక్ ఫుడ్ తింటే మన శరీరానికి అంతకుమించిన అనర్థం ఇంకోటుండదని నా అభిప్రాయం.

సాధారణంగా పొద్దున్నే ఓ గిన్నె నిండా బొప్పాయి లేదా ఆపిల్ ముక్కలు లాగించేస్తా. తర్వాత అల్పాహారంలో రెండు టోస్టు చేసిన బ్రెడ్ స్లైసులు, ఉడకబెట్టిన కోడిగుడ్డు, ఓ కప్పు టీ తీసుకుంటాను. మధ్యాహ్న భోజనంలో రెండు



చపాతీలు, పప్పు, కూరగాయ ముక్కలు, పెరుగు, ఏదైనా సలాడ్ తప్పనిసరి. ఇక రాత్రి భోజనంలో చపాతీ, పప్పు, కూరగాయల కూరలు ఉంటాయి.

నాకు సమయం దొరికినపుడల్లా ఫ్రెండ్స్‌తో కలిసి డ్యాన్స్ చేస్తుంటాను. అపుడపుడూ స్పాకి వెళ్తుంటాను. ఎక్కువగా మేకప్ వేసుకుంటే నా చర్మానికి సరిపడదు. అందుకే ఎక్కువగా ఆక్సిజన్ ఉండే క్రీమ్‌ని వాడుతుంటాను.

ప్రతిరోజూ వ్యాయామం, వర్కవుట్లు నా శరీరానికి పడవు. జిమ్‌కు అస్సలు వెళ్లను. అయితే నాకిష్టమైన, నేనింత నాజూగ్గా ఉండేందుకు తోడ్పడుతున్న డాన్స్ మాత్రం చేస్తుంటాను. క్రమం తప్పకుండా యోగానూ చేస్తుంటాను. అది సానుకూల భావాలను పెంచుతుంది.

సేకరణ : సంధ్యారాణి

## సన్నబడాలనుకుంటున్నారా?

బరువు తగ్గాలంటే ముందు శరీరంలోని అనవసరమైన కొవ్వు పదార్థాలను తగ్గించుకోవాలి. అందుకు చాలా సులువైన మార్గం మనకు సుపరిచితమైన పదార్థాలను క్రమం తప్పకుండా వాడడమే.



**పసుపు:** దీనిలో లభించే కర్క్యుమిన్ అనే పదార్థం కొవ్వుకణాలు పెరగకుండా దోహదం చేస్తుంది.

**మిరియాలు:** వీటిలో లభించే పైపరైన్ అనే పదార్థం శరీరంలో కొత్త కొవ్వుకణాలు పుట్టకుండా చేస్తుంది.

**మిరప:** జీవక్రియను వేగవంతం చేసి ఆకలిని తగ్గించే గుణం మిరపలోని క్యాప్సైసిన్‌కు మెండుగా ఉంది.

**అల్లం:** ఆహార పదార్థాల్లోని ఫ్యాటీ ఆసిడ్స్‌ను నాశనం చేసే గుణం అల్లానికి ఉంది. తిన్న పదార్థాలు కొవ్వుగా మారకుండా అవి కరిగిపోయేందుకు ఇది సహకరిస్తుంది.

## మహిళా శక్తి



✦ **ప్రతిఒక్కరికీ సామర్థ్యం ఉంటుంది. చేయవలసిందల్లా అవసరమైనపుడు దాన్ని ఉపయోగించుకునే ధైర్యం కూడగట్టుకోవడం**

– ఎరికా జోంగ్



✦ **గొప్ప మహిళలుగా పేరు పొందినవారు గొప్పవారుగా పుట్టలేదు. వారందుకు జీవితకాలం కష్టపడ్డారు** –సాబ్రినా న్యూబై

# సోయగం



## జుట్టు రాలుతోందా?

★ ఒక ఉల్లిగడ్డను సన్నగా తరిగి రసాన్ని తీసిపెట్టుకోవాలి. నాలుగైదు వెల్లుల్లి రెబ్బలు మెత్తగా చేసి దానికి కొద్దిగా కొబ్బరినూనె చేర్చి వేడిచేయాలి. చల్లారిన తరువాత దీన్ని ఉల్లిరసంలో కలిపి మాడుకు రాసి మసాజ్ చేయాలి. ఓ పది నిమిషాల తర్వాత చల్లని నీటితో శుభ్రం చేసుకోవాలి. ఇలా వారానికి రెండుమూడు సార్లు చేస్తే చక్కని ఫలితం కనిపిస్తుంది.

★ గుడ్డులోని తెల్లని సొనను వేరు చేసి దానితో నేరుగా మాడు మీద మసాజ్ చేయాలి. జుట్టంతా కూడా బాగా కలిసేట్టుగా రాయాలి. అరగంట తర్వాత చల్లని నీటితో కడగాలి. తెల్లసొనలోని ప్రోటీన్లు, విటమిన్లు జుట్టు రాలడం తగ్గి కేశాలు పెరిగేందుకు తోడ్పడతాయి.

★ రాత్రి పడుకునేముందు ఆలివ్ ఆయిల్‌తో మర్దనా చేసుకోవాలి. జుట్టుకు కాటన్ బట్టను చుట్టుకుని పడుకోవాలి. తెల్లారి లేవగానే తలస్నానం చేయాలి. ఇలా వారానికి రెండు సార్లు చేయాలి. ఆలివ్ ఆయిల్ జుట్టు మొదళ్లలోని బాక్టీరియాను నశింపజేసి కుదుళ్లను దృఢపరుస్తుంది.

# టెక్ గురూ!

## స్క్రీన్ రీడర్

సమాచారం కోసమో, వినోదం కోసమో సిస్టమ్ ముందు కూర్చుంటాం. కానీ ఎక్కువసేపు స్క్రీన్ మీద టెక్స్ట్‌ను చదవలేకపోతాం. కొద్దిసేపటికే కళ్లు నులుముకోవలసివస్తుంది. అలా గంటల తరబడి స్క్రీన్ చూడకుండా అందులోని విషయాన్ని ఎవరో ఒకరు చదివి వినిపిస్తే ఎంత



బాగుంటుందో కదూ.. అవును నిజంగా అలా అనిపించే చదివి వినిపించే 'స్క్రీన్ రీడర్' సాఫ్ట్‌వేర్‌ను రూపొందించారు. మరి దానికి ఎంత డబ్బు కావలసివస్తుందో అని భయపడాల్సింది లేదు. http://goo.gl/7Di7B9 లింకునుండి దాన్ని ఉచితంగా పొందొచ్చు. స్క్రీన్ రీడర్‌ను ఇన్‌స్టాల్ చేయగానే తెరపై ఐకాన్ కనిపిస్తుంది. దానిపై క్లిక్‌చేస్తే టూల్ బార్ రూపంలో స్క్రీన్ రీడర్ ఓపెన్ అవుతుంది. సిస్టంలో సేవ్ అయిన ఫైల్స్‌ని వినాలనుకుంటే స్క్రీన్ రీడర్‌లోని మెనూబార్‌పై క్లిక్ చేస్తే ఓపెన్ అనే ఆప్షన్ వస్తుంది. దానిపై క్లిక్ చేసి డ్రైవుల్లోని విందామనుకున్న ఫైల్‌ని సెలెక్ట్ చేసి ఓపెన్ చేసుకుంటే చాలు! అందులోని విషయాన్నంతటినీ పేరాగ్రాఫలవారీగా చదివి వినిపిస్తుంది. ఒక పేరా వదిలి చదవాలనుకుంటే నెక్స్ట్ ఆప్షన్‌ను క్లిక్ చేయాలి. పాజ్, ప్లే ఆప్షన్స్ కూడా ఉన్నాయి. స్లోయర్, ఫాస్టర్ ఆప్షన్స్‌తో నెమ్మదిగా, వేగంగా వినిపించే ఆప్షన్స్ కూడా ఉన్నాయి.

బ్రౌజింగ్‌లోని విషయాన్ని చదవాలంటే.. ఆ విషయాన్ని సెలెక్ట్ చేసి స్క్రీన్ రీడర్‌పై గల ప్లే ఆప్షన్‌ని క్లిక్ చేస్తే చాలు.

బ్రౌజింగ్‌లోని విషయాన్ని సేవ్ చేసుకుని కావలసినపుడు వినే అవకాశం కూడా ఉంది. వెబ్ పేజీలో సెలెక్ట్ చేసిన విషయాన్ని ఎమ్‌పీత్రీ ఫైల్‌గా సేవ్ చేసుకుంటే సరి. కావాలనుకున్నపుడు స్క్రీన్ రీడర్ సాయంతో వినొచ్చు. ఓపెన్ చేసిన ఫైల్స్, వెబ్ నుంచి తీసుకున్న టెక్స్ట్‌ను క్లోజ్ చేసేందుకు స్క్రీన్ రీడర్‌లో క్లియర్ ఆప్షన్ ఉంటుంది.

# జతపరచండి

ఇక్కడ కొన్ని నేపథ్య గీతాలు, అవి ఉన్న సినిమా పేర్లు ఉన్నాయి. ఏ నేపథ్య గీతం ఏ సినిమాలోదో చెప్పగలరా? లేదంటే జవాబులు ఈ పేజీల్లోనే ఉన్నాయి, చూడండి..

| | |
|---|---|
| 1. చెరసాల పాలైనావా.. | ఎ. మంచి కుటుంబం |
| 2. కనుమూసినా కనిపించే నిజమిదేరా.. | బి. రంగులరాట్నం |
| 3. త్యాగశీలివమ్మా మహిళా అనురాగ.. | సి. లవకుశ |
| 4. సుడిగాలిలోన దీపం.. | డి. కులదైవం |
| 5. కల ఇదనీ నిజమిదనీ.. | ఇ. దొంగరాముడు |
| 6. పయనించే ఓ చిలుకా.. | ఎఫ్. దేవదాసు |
| 7. కలిమి నిలవదు యేమీ మిగలదు.. | జి. జీవితచక్రం |
| 8. ఏ నిమిషానికి ఏమి జరుగునో.. | హెచ్. సంతానం |

జవాబులు ఈ సంచికలోనే..

కూర్పు : కావ్య




**మైక్రోసాఫ్ట్ వస్తువులు!**



**టీచర్:** మీకు తెలిసిన మైక్రోసాఫ్ట్ ప్రోడక్ట్స్ ఏవైనా చెప్పండి..?

**చిన్ని:** ఎమ్. ఎస్. వర్డ్

**బంటి:** ఎమ్. ఎస్. ఎక్సెల్

**నాని:** ఎమ్. ఎస్. పవర్‌పాయింట్

**చంటి:** ఎమ్.ఎస్. ధోని!

**మూడు టిక్కెట్లు!**



**భర్త:** ఈ రోజు ఆదివారం కదా.. బాగా ఎంజాయ్ చేయాలనుకున్నా. అందుకే మూడు సినిమా టిక్కెట్లు తీసుకొచ్చా

**భార్య:** మూడు టిక్కెట్లు దేనికండీ?

**భర్త:** ఒకటి నీకు, మిగిలిన రెండు మీ అమ్మానాన్నలకు.

**చిన్ననాటి అస్థిపంజరం!**



**పర్యాటకుడు:** ఈ అస్థిపంజరం ఎవరిది?

**సర్దార్:** ప్రముఖ ప్రాచీన రాజుగారిది.

**పర్యాటకుడు:** ఆ పక్కనే ఉన్న చిన్న అస్థిపంజరం ఎవరిది మరి?

**సర్దార్:** అది కూడా ఆ రాజుగారిదే.. ఆయన చిన్నప్పటిది!

# ఆలూ టిక్కీలు

చిటికెలో రుచిగా..!



**తయారుచేసే పద్ధతి:**

ముందుగా ఆలుగడ్డలను శుభ్రంగా కడిగి పొట్టు తీసి తురుముకోవాలి. కొత్తిమీర, పచ్చిమిర్చిని సన్నగా తరిగి పక్కన పెట్టుకోవాలి. ఆలుగడ్డ తురుములో, శనగపిండి, జీలకర్ర, కారం, ఉప్పు, ఇంగువ, పచ్చిమిర్చి తరుగు, కొత్తిమీర, కొద్దిగా నీరు పోసి ముద్దగా కలుపుకోవాలి. ఇపుడు దాన్ని కొద్దికొద్దిగా తీసుకుని చేతి మీదే వత్తుకుని బ్రెడ్ పొడిలో దొర్లించి నూనెలో ఎరుపు వర్ణం వచ్చేవరకు వేయించాలి. అంతే ఆలు టిక్కీలు రెడీ!

## కావలసిన పదార్థాలు

- ఆలుగడ్డలు - 2
- కొత్తిమీర కట్ట - 1
- జీలకర్ర - 1 టీస్పూన్
- పచ్చిమిర్చి - 2
- ఇంగువ - చిటికెడు
- బ్రెడ్ పొడి - తగినంత
- కారం - 1/2 టీస్పూన్
- శనగపిండి - 2 టేబుల్ స్పూన్లు
- ఉప్పు - తగినంత

## మాటిమాటికీ ఆకలేస్తోందా?

కొందరికి భోజనం చేసిన కాసేపటికే ఆకలవుతుంది. అలా అని ఆకలేసినప్పుడల్లా ఏదో ఒకటి తింటూ ఉంటే బరువు పెరుగుతారు. మరి ఆకలవకుండా ఉండాలంటే చక్కని చిట్కాలు ఉన్నాయి. అవేంటంటే మింట్ గమ్ నమలడం లేదా పిప్పరమెంటు టీ తాగడం. ఇలా చేయడం వల్ల ఆకలిని కలిగించే హార్మోనుల ఉత్పత్తిని తగ్గించేందుకు మెదడుకు సంకేతాలందుతాయి. దాంతో కడుపు నిండుగా ఉంటుంది.



## జతపరచండి జవాబులు :

| | |
|---|---|
| 1 – ఇ | 5 – ఎఫ్ |
| 2 – హెచ్ | 6 – డి |
| 3 – ఎ | 7 – బి |
| 4 – జి | 8 – సి |

## చిట్కాలక్ష్మి

- ★ ముక్కలుగా కోసిన ఆపిల్ వంటి పండ్ల మీద నిమ్మరసం చల్లితే కొన్నిగంటల వరకూ నల్లబడకుండా తాజాగా అపుడే కోసినట్టుగా ఉంటాయి.
- ★ ఉల్లి, వెల్లుల్లి వంటి వాసనలు పోవాలంటే చేతులకు ఉప్పు రుద్దుకుంటే సరి.



## చతురంగం - 51 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 శో | భ | 2 న | | 3 అ | మ | 4 రా | 5 వ | 6 తి | |
| ధ | | 7 గ | యు | డు | | 8 వం | ద | న | 9 ము |
| 10 న | 11 ర | ము | | 12 సు | 13 మ | | నం | | క్తి |
| | వ | | 14 అ | | 15 ర | ణం | | 16 షూ | |
| 17 కా | ళీ | 18 క | నా | 19 లు | క | | 20 బ | లి | 21 మి |
| ళిం | | 22 న | మి | త | | 23 జా | లి | | సి |
| ది | | 24 రా | క | | 25 వా | జీ | | 26 సి | మి |
| | 27 కో | వా | | 28 ఆ | లి | | 29 గా | త్రం | |
| 30 మా | మ | | 31 పా | ట | | 32 జ | లం | | 33 వే |
| 34 స | లి | ల | ము | | 35 సిం | గం | | 36 వా | ణి |

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**భవానీదేవి పరుచూరి**

బి-27,
ఎస్.వి.ఎన్.కాలనీ,
గుంటూరు
పిన్ : 522006

## సరైన సమాధానాలు రాసిన వారు

1. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, కర్నూలు జిల్లా, 2. గరికిపాటి సూర్యశ్రీ, కాకినాడ, 3. కరణం శివానందరావు, కర్నూలు, 4. వి. వెంకట సుబ్బారావు, బెంగళూరు, 5. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 6. ఆర్. లక్ష్మి, మోతీనగర్, హైదరాబాద్, 7. తటవర్తి రామకృష్ణ, తాళ్లగడ్డ, 8. అడపా సత్యనారాయణ బాబ్జి, కూకట్‌పల్లి, 9. ఎన్. సుదర్శనరావు, ప్రగతినగర్, హైదరాబాద్, 10. పేర్వేల దేవీపవన్‌కుమార్, మణికొండ, 11. జి. ముత్తుమారన్, చర్లపల్లి, రంగారెడ్డి జిల్లా, 12. డా. శివభూషణం, కర్నూలు, 13. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 14. ఎం. వసంత, బోరబండ, 15. పప్పు శ్రీదేవి, అమలాపురం, 16. మహావాది అశోక్‌కుమార్, చిక్కడపల్లి, 17. అడపా విఘ్నేశ్వరరావు, పర్లాకిమిడి, ఒడిశా, 18. రావూరి రోషిత, తిరుపతి, 19. డా. సి. జనార్దన సింగ్, నల్లకుంట, 20. పొన్నపల్లి వెంకటప్పయ్య, సరూర్‌నగర్, 21. కె. సుబ్రహ్మణ్యం, అనంతపురం, 22. టి. అంజలి, తిరుపతి, 23. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, హైదరాబాద్, 24. పసుమర్తి జయశ్రీ, ఎం.జె. కాలనీ, హైదరాబాద్, 25. సి. హెచ్. శివశంకర శాస్త్రి, లింగంపల్లి, హైదరాబాద్, 26. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 27. యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా, 28. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 29. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 30. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనందబాగ్, 31. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోలు, 32. పి. శుభ, బంజారాహిల్స్, 33. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, హైదరాబాద్, 34. కె. శ్రీకళ, కర్నూలు, 35. యు. ప్రణవ్, ఉత్తనూరు, మహబూబ్‌నగర్ జిల్లా, 36. ధరణి పద్మాసన, నల్లకుంట, 37. చింతపల్లి నాగేశ్వరరావు, ప్రసాదంపాడు, విజయవాడ, 38. రామకూరు లక్ష్మి, శ్రీకాకుళం, 39. తూములూరు సత్యనారాయణ మూర్తి, ఖమ్మం, 40. సంతోష్‌కుమార్, కొడిమ్యాల, 41. బిక్కునూరి రాజేశ్వర్, ఈద్‌గాం, ఆదిలాబాద్ జిల్లా, 42. వి. బంగారం, కొంతమూరు, తూ.గో. జిల్లా, 43. వి. బిందు, కొంతమూరు, తూ.గో. జిల్లా, 44. వి. ఇందిరా సుబ్రమణ్యం, సోమాజిగూడ, 45. యస్. జమీలా బేగం, కర్నూలు, 46. బి.వి. నరసింహారావు, పేరాల, ప్రకాశం జిల్లా, 47. టి. లక్ష్మీకుమారి, మచిలీపట్నం, 48. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 49. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమండ్రి, 50. తొయ్యేటి వెంకట సూర్యం, విశాఖ, 51. కోలా సత్యనారాయణ, విశాఖ, 52. గౌరిపెద్ది రాజ్యలక్ష్మి, సోమాజిగూడ, 53. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 54. ఎస్. మణిమేగలై, తిరుపతి, 55. నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం, 56. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, హైదరాబాద్, 57. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 58. కె. నాగభూషణం, ఉప్పరగూడ, హైదరాబాద్, 59. సి. నిర్మల, తిరుపతి, 60. ఉపద్రష్ట నరసింహమూర్తి, లాలాపేట, సికింద్రాబాద్, 61. తోకల నారాయణరావు, మచిలీపట్నం, 62. యు.యు.యు., ఎమ్మిగనూరు, 63. పి.బి. సీతాదేవి, నరసాపురం, ప.గో. జిల్లా, 64. (..128లో)

# చతురంగం - 52 ఆధారాలు

## అడ్డం

1. యయాతి భార్య, శుక్రాచార్యుడి కుమార్తె (4)
4. మురుగు కాల్వను ఇలా కూడా అంటారు (2)
6. సాయినాథుడ్ని వాడుకగా ఇలా పిల్చుకుంటాం (2)
8. ఎక్కువ (3)
10. బలుపు కాదు- - (2)
12. వెయ్యి గ్రాములని దేన్నంటారు? (3)
14. గౌరవంగా మీ, మీ యొక్క (2)
16. టపాకాయ, పటాసు (3)
19. శివయ్య వాహనం (2)
21. సుగ్రీవుడి భార్య.. అటునుంచి (2)
23. గాలి (3)
25. భారతంలో భీష్ముని తర్వాత అందరి క్షేమం కోరినవాడు, నీతికోవిదుడు (4)
27. చొక్కాకు ఉండేది (2)
29. అడ్డం 8కి వ్యతిరేకం (3)
30. 'వస్తాడు'కు వ్యతిరేకం (2)
31. పెద్ద తొట్టిలాంటిదే (2)
33. కొందరికే 'ఇది' తిరుగుతుంది (2)
35. నన్నయ్య, తిక్కన, ఎఱ్రనలను కలిపి ఇలా అంటారు (4)
36. నక్కలు చేసే ధ్వని, మధ్య ఎగిరిపోయిన లక్ష్మణుడి భార్య (2)
37. కొంగ (2)
38. స్వర్గంలో ఉండే నది (3)
39. ఏడు కొండలవాడి పుణ్యక్షేత్రం (4)
41. అర్ధరాత్రి (3)
42. చీకటి (4)

## నిలువు

1. శ్రీకృష్ణుడి మాతృమూర్తి (3)
2. రాత్రి (3)
3. టెక్కు, గర్వంలాంటిదే (2)
5. అగ్నిపర్వతాలు పేలితే ఇది ఉబుకుతుంది (2)
7. ఉషతండ్రి, అనిరుద్ధుడి మామ (5)
9. తలకిందులైన ఒడ్డు, తీరం (2)
11. పేజీ (2)
13. పిసినారి (2)
15. ఏఎన్నార్, నాగార్జున, నాగచైతన్యల సినిమా (2)
17. అక్షరజ్ఞానం లేనివాడు (4)
18. దశమి ముందు వచ్చేది? (3)
20. స్వర్గం (2)
22. పూజ, నమస్కారం (2)
24. నాశనం కావడం కదా తలకిందులైంది (3)
26. పేరాశ లాంటిదే (3)
28. 'అవును-2' దర్శకుడు శీర్షాసనం వేశాడు(4)
32. నైట్రోజన్ తెలుగు(4)
33. సేనాని, రజనీకాంత్ సినిమా (4)
34. ఇటీవల ఇది నేపాలీయుల బతుకుల్ని కుదిపేసింది (4)
35. కేసీఆర్ తనయ (3)
36. గ్రామం (2)
39. తద్దినాన్ని ఇలా కూడా అంటారు (2)
40. అడ్డం 29, హద్దు కింది నుంచి (2)

*(127వ పేజీ తరువాయి...)*

బందెల ప్రణవ్, ఉయ్యూరు, కృష్ణా జిల్లా, 65. కొత్తపల్లి ప్రసాదరావు, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా, 66. పి. శ్రీకాంత్, మాదాపూర్, 67. కొత్తపల్లి స్వరలయ, చీరాల, ప్రకాశం జిల్లా, 68. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 69. కాకర్లమూడి రామలింగమూర్తి, తణుకు, ప.గో. జిల్లా 70. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 71. ఎం. సంఘమిత్ర, గుడివాడ, కృష్ణా జిల్లా, 72. పి. గాయత్రీదేవి, రాజమండ్రి, 73. ఆండ్ర అచ్యుతరామయ్య, తణుకు, 74. కణుగుల గ్రీష్మ, శ్రీకాకుళం, 75. కంచర్ల త్రినాథులు, నరసాపురం, ప.గో. జిల్లా, 76. డా. చిన్నం వెంకటేశ్వర్లు, విజయవాడ, 77. పి. విజయలక్ష్మి, కాకినాడ, 78. పెద్దింటి వెంకటరంగాచార్యులు, వనస్థలిపురం, 79. ముడుంబ సీత, భద్రాచలం, 80. నున్న లక్ష్మి, యఱ్రవరం, తూ.గో.జిల్లా, 81. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో.జిల్లా.

# చతురంగం - 52

రూ.150/- బహుమతి | గడువు తేది : జులై 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | ■ | 6 | 7 |
| | ■ | 8 | క్కు | 9 | ■ | 10 | 11 | ■ | |
| 12 | 13 | | ■ | 14 | 15 | ■ | 16 | 17 | |
| ■ | | ■ | 18 | ■ | 19 | 20 | ■ | 21 | |
| 22 | ■ | 23 | | 24 నం | ■ | 25 | 26 | | |
| 27 జె | 28 | ■ | 29 | | | ■ | 30 | | ■ |
| ■ | 31 | 32 | ■ | | ■ | 33 | | ■ | 34 |
| 35 | | | | ■ | 36 | త్త | ■ | 37 | |
| 38 | | | ■ | 39 | | | 40 | ■ | |
| | ■ | 41 | | | ■ | 42 | | | |

పంపినవారి పేరు: ----------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------

----------------------------------------------------------

----------------- పిన్ : ----------- ఫోన్ : ---------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

